# రెండవ పంచవర్ష ప్రణాళిక

## తూర్పు గోదావరి జిల్లా

**1959-60**

ప్రణాళిక, స్థానిక పరిపాలనా శాఖ
ఆంధ్రప్రదేశ్

25 నయా పైసలు

# విషయ సూచిక

# మనవి మాట

రాజ్య ప్రణాళికలో జిల్లావారీ వివరాలను పొందుపరుస్తూ ప్రచురించిన జిల్లా ప్రణాళికలో వరుసలో 1959-60 సంవత్సరానికి సంబంధించిన యీ ప్రచురణ నాలుగవది. ఈ ప్రచురణయొక్క మొదటి భాగంలో జిల్లాకు సంబంధించిన సాధారణ గణాంక సమాచారం యివ్వబడింది సాధ్యమైన మేరకు నేటివరకు లభ్యమయిన గణాంక వివరాలు యిందు పొందుపరుప బడినాయి. రెండవ పంచవర్ష ప్రణాళిక క్రింద రాజ్య ప్రభుత్వం తలపెట్టిన నాలుగవ సంవత్సరపు కార్యక్రమాన్ని గురించి కూడ క్లుప్తంగా యీ భాగంలో వివరింపబడింది. ఇక రెండవ భాగంలో తంతి, తపాలా, రైలుమార్గాలతో సహా అభివృద్ధి కార్యక్రమాల వివరాలు యివ్వబడినాయి. ఈ ప్రచురణ జిల్లా పరిషత్తులకు కొంత ఉపయోగకరంగా ఉంటుందని యీ ప్రచురణను యింకా మేలుగా రూపొందించటానికి పరిషత్తులు సూచనలు చేస్తాయని ఆశించబడుతున్నది. సూచనలు ఎవరు పంపినా సంతోషంతో స్వీకరించబడతాయి. వాటిని హైదరాబాదులోనున్న ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రణాళికాశాఖ డిప్యూటీ కార్యదర్శిగారికి పంపవచ్చును.

హైదరాబాదు
తేది 13-12-1959

సి. నరసింహం
ప్రభుత్వ కార్యదర్శి ప్రణాళిక స్థానిక పరిపాలన శాఖ

# సాధారణ విషయాలు

## విస్తీర్ణం, వర్గీకరణ

ఈ జిల్లా విస్తీర్ణం 5,768 చదరపుమైళ్లు. ఇందులో 5 రెవిన్యూ డివిజన్లు, 13 తాలూకాలు ఉన్నాయి. 1956–57 సంవత్సరంలో ఈ జిల్లాలోని భూమి క్రింది విధంగా వర్గీకరింపబడింది.

| | విస్తీర్ణం ఎకరాలలో | మొత్తం విస్తీర్ణం లో శాతం |
|---|---|---|
| మొత్తం భూమి విస్తీర్ణం | 36,37,000 | — |
| అడవులుండే ప్రదేశం | 13,45,185 | 37.0 |
| బీడుభూమి, సాగుక్రిందకు రానిభూమి | 2,32,034 | 6.4 |
| వ్యవసాయేతర కార్యాలకు ఉపయోగించబడుతున్న భూమి | 1,79,526 | 4.9 |
| సాగుకు లాయకీ అయిన బంజరు | 4,86,202 | 13.4 |
| శాశ్వత పచ్చిక బీళ్లు, ఇతర పచ్చిక బయళ్ళు | 1,64,335 | 4.5 |
| సాగుచేయబడే నికరపు విస్తీర్ణంలో చేర్చబడని నానా రకాల చెట్లు, తోటలు, పంటలు ఉండే భూమి | 61,507 | 1.6 |
| ప్రస్తుత బంజర్లు | 29,523 | 0.8 |
| ఇతర బంజర్లు | 64,030 | 1.18 |
| మొత్తం సాగు చేయబడే భూమి | 10,74,648 | 31.9 |
| ఒకసారికి మించిసాగు చేయబడేభూమి | 2,51,297 | 6.9 |
| మొత్తం పంట భూమి | 13,25,945 | 36.4 |

## వేర్వేరు ఋతు పవనాలవల్ల మొత్తం వర్షపాతం
(అంగుళాలలో)

| | 1956–57 | 1955–56 | మామూలు. |
|---|---|---|---|
| నైఋతి ఋతుపవనాలు | 31.3 | 21.5 | 24.9 |
| ఈశాన్య ఋతుపవనాలు | 16 | 14.4 | 13.2 |
| శీతాకాలం | — | 0.04 | 0.07 |
| వేసవికాలం | 1.4 | 6.1 | 3.0 |
| మొత్తం | 48.7 | 42.4 | 41.8 |

## నీటివనర్లు—నీటిపారుదల

నదులనుండి త్రవ్వబడిన కాలువలు, చెరువులు, ఊటకాలువలు, మురుగు కాలువలు, సరస్సులు, కొండప్రక్కలోయలు మొదలైన వాటినుండి ఉన్న ఊట కాలువలు, చిన్న వాగులు ఈ జిల్లాలో ముఖ్య నీటిపారుదలవనర్లు. రాజమండ్రి, పెద్దాపురం తాలూకాలలోని కొన్ని చెరువులకు అడవి వాగులనుండి నీరు సరఫరా అవుతుంది. మిగత చెరువులన్నీ వర్షాలవల్ల నిండుతాయి. అందువల్ల ఎల్లప్పుడు వీటివల్ల నీటిపారుదల జరుగుతుందని చెప్పడానికి వీల్లేదు. నైఋతి ఋతుపవనాలవల్ల గోదావరిలో చాలావరకు నీరువస్తుంది. అయినప్పటికి దీని క్రింద ఉన్న ఆయకట్టంతటికీ నీటిపారుదల జరగాలంటే స్థానికంగా కూడ వర్షాలు పడటం అవసరం. నదిలో హెచ్చుగా వరదలు వచ్చినప్పుడు పల్లపు భూములు మునిగిపోతాయి. గోదావరి ఆనకట్టవల్ల రాజోలు, అమలాపురం, రామచంద్రపురం, కాకినాడ తాలూకాలకు, రాజమండ్రి తాలూకాలో కొంత భాగానికి నీటి పారుదల జరుగుతున్నది. రాజమండ్రి తాలూకాలో ఊటకాలువలు ఉన్నాయి. పెరవరం పంపింగుపథకం వల్లకూడ రాజోలు తాలూకాలో నీటి పారుదల జరుగుతున్నది. అదే విధంగా పోలవరం దీవి ప్రాజెక్టువల్ల అమలాపురం తాలూకాకు నీటిపారుదల జరుగుతున్నది. వర్షాలవల్లనిండే చెరువుల మూలంగానే రాజమండ్రి తాలూకాలో చాలవరకు నీటిపారుదల జరుగుతుంది. పెద్దాపురంలో మాగాణి

భూములకు చాలవరకు చెరువుల ద్వారానే నీటిపారుదల జరుగుతుంది. ఈ తాలూకాలో ఏలేరునదినుండి త్రవ్వబడిన నదికాలువలు కూడా ఉన్నాయి పెద్దాపురంలో ఊటకాలువలుకూడ ఉన్నాయి. పిఠాపురం, తుని తాలూకాలలో కొన్ని చెరువులను మినహాయిస్తే నీటి పారుదల సౌకర్యాలేవీ లేవు. అమలాపురం, రాజోలు తాలూకాలలో పోక తోటలకు నీరు సమకూర్చేటందుకు బావులు ఉపయోగించబడుతున్నాయి. మిగతచోట్ల రాగి, జొన్న, మొక్కజొన్న మొదలయినటువంటి మెట్టపంటలకు నీటిసౌకర్యం కలిగించడం కోసం తాత్కాలికంగా బావులు త్రవ్వబడతాయి.

1956—57 లో ఈ జిల్లాలోని నీటివనర్లు, వాటి మూలంగా సాగయిన భూమి విస్తీర్ణం వివరాలు క్రింద యివ్వబడినాయి.

## నీటి వనర్లు

| | |
|---|---|
| 1. ప్రభుత్వ కాలువలు | 11 |
| 2. ప్రయివేటు కాలువలు | — |
| 3. బావులు | |
| (ఎ) గొట్టపు బావులు | — |
| (బి) నీటిపారుదలకు మాత్రం ఉపయోగించబడే ఇతర బావులు | — |
| (i) ప్రభుత్వం వారివి | |
| (ఎ) రాతి కట్టడం గలవి | — |
| (బి) రాతికట్టడం లేనివి | — |
| (ii) ప్రయివేటువి | |

| | | |
|---|---|---|
| | (ఎ) రాతికట్టడము గలవి | 366 |
| | (బి) రాతికట్టడం లేనివి | 366 |
| 4. | గృహకార్యాలకు మాత్రం ఉపయోగించబడే బావుల సంఖ్య | 1,713 |
| 5. | ఉపయోగంలో లేని బావుల సంఖ్య | 64 |
| 6. | రిజర్వాయర్లు | — |
| 7. | చెరువులు | |
| | (ఎ) నూరు ఎకరాలు అంతకన్న ఎక్కువఆయకట్టుగలవి | 413 |
| | (బి) నూరు ఎకరాలకన్న తక్కువ ఆయకట్టుగలవి | 1,699 |

### నీటిపారుదల జరుగుచున్న భూమి విస్తీర్ణం

| | | |
|---|---|---|
| 1. | ప్రభుత్వ కాలువల ద్వారా | 4,75,266 |
| 2. | ప్రయివేటు కాలువల ద్వారా | — |
| 3. | చెరువుల ద్వారా | 1,33,403 |
| 4. | బావుల ద్వారా | |
| | (ఎ) కేవలం నీటి పారుదలకు ఉపయోగించబడేవి | 249 |
| | (బి) ఇతర నీటి పారుదల వనరులకు తోడ్పడేవి | — |
| | (సి) ఇతర వనరులు (ఊటకాలువలు మొదలయినవి) | 6 791 |
| 5. | నీటిపారుదల జరుగుచున్న మొత్తం భూమి | 6,15,759 |

| | | |
|---|---|---|
| 6. | పంటపండే నికరపు భూమిలో నీటి పారుదల జరిగే భూమి శాతం | 57.2 |
| 7. | ఒకే సంవత్సరములో ఒక సారికంటె ఎక్కువగా నీటి పారుదల జరిగే విస్తీర్ణం | 1,23,468 |
| 8. | నీటి పారుదలవల్ల పంటలు పండే మొత్తం భూమి | 7,99,232 |
| 9. | మొత్తం పంటపండే భూమిలో నీటిపారుదల జరిగే విస్తీర్ణం యొక్క శాతం | 56.7 |
| 10. | స్వంత ఆయకట్టుండే బావులు | — |
| 11. | గుర్తింపబడిన నీటి పారుదల వనరులకు తోడ్పడే బావులు | — |
| 12. | నీటి పారుదల జరిగే మొత్తం నికరపు విస్తీర్ణంలో స్వంత ఆయకట్టుండే బావులద్వారా నీటి పారుదల జరిగే విస్తీర్ణం యొక్క శాతం | — |
| 13. | ఆయిలు ఇంజన్ల సంఖ్య | 299 |

## పంటలు

వరి ఈ జిల్లాలో ముఖ్యమైన ఆహార పంట. రామచంద్రపురం, అమలాపురం, కాకినాడ, రాజోలు తాలూకాలలో వరిపండే భూములు చాల ఎక్కువగా ఉన్నాయి. భద్రాచలం, నుగూరు తాలూకాలలో జొన్న పంట చెప్పుకో దగ్గంతగా పండించబడుతున్నది. ఇతర తాలూకాలలో కొంతవరకు మాత్రం యిది పండించబడుతుంది. మొక్కజొన్న, కుంబు, రాగి, కొఱ్ఱ, వరగు, సమాయి—యివి ఈ జిల్లాలో పండించబడే యితర ఆహార పంటలు. పెసలు, కందులు, మినుములు, శనగలు, ఉలవలు—యివి యీ జిల్లాలో పండించబడే పప్పు ధాన్యాల పంటలు. మిరపకాయలు, చెరకు, వేరుశనగ, నువ్వులు, ప్రత్తి, పొగాకు—యివి ఈ జిల్లాలో పండించబడే వ్యాపార పంటలు.

పొగాకు ముఖ్యంగా రాజమండ్రి తాలూకాలో పండించబడుతున్నది. 1956–57లో ఈ జిల్లాలో సాగుచేయబడినభూమి, పండించబడిన పంటల వివరాలు క్రింద యివ్వబడినాయి.

| పంటలు | విస్తీర్ణం ఎకరాలలో | మొత్తం పంట (టన్నులలో) |
|---|---|---|
| I చిరుధాన్యాలు | | |
| 1. వరి | 7,28,272 | 4,83,930 (బియ్యం) |
| 2. గోధుమలు | 88 | 10 |
| 3. జొన్న | 75,651 | 15,530 |
| 4. సజ్జ | 44,152 | 6,550 |
| 5. బార్లి | — | — |
| 6. మొక్కజొన్న | 2,773 | 990 |
| 7. రాగి | 14,419 | 2,900 |
| 8. కొఱ్ఱ | 2,374 | 670 |
| 9. వరగు | 2,037 | 630 |
| 10. సమాయి | 3,599 | 890 |
| 11. ఇతర చిరుధాన్యాలు | 2,853 | 570 |
| మొత్తం చిరుధాన్యాలు | 8,86,528 | 5,12,700 |
| II. పప్పు ధాన్యాలు | | |
| 1. శనగలు | 3,796 | 720 |
| 2. పెసలు | 25,328 | 2,810 |
| 3. కందులు | 8,512 | 1,130 |
| 4. మినుములు | 19,950 | 2,280 |
| 5. ఉలవలు | 47,998 | 3,510 |

| | | | |
|---|---|---|---|
| 6. | ఇతర పప్పు ధాన్యాలు | 16,729 | 1,210 |
| | మొత్తం పప్పు ధాన్యాలు | 1,22,313 | 11,660 |
| **III.** | **సంబారాలు** | | |
| 1. | పోక చెక్కలు | — | — |
| 2. | మిరపకాయలు | 16,841 | 7,670 |
| 3. | అల్లం | — | — |
| 4. | పసుపు | 3,362 | — |
| 5. | వెల్లుల్లి | 182 | — |
| 6. | ధనియాలు | 2,310 | — |
| 7. | చింతపండు | 1,093 | — |
| 8. | ఇతర సంబారాలు | 287 | — |
| | మొత్తం సంబారాలు | 24,625 | 7,670 |
| **IV** | **చక్కెర పంటలు** | | |
| 1. | చెరకు | 21,042 | 73,440 |
| 2. | తాటి | 1,813 | — |
| 3. | ఇతరములు | 6 | — |
| | మొత్తం చక్కెర పంటలు | 22,861 | 73,440 |
| **V.** | **పండ్లు, కూరగాయలు** | | |
| 1. (ఎ) | తాజా పండ్లు | | |
| | (i) అరటి పండ్లు | 5,346 | — |
| | (ii) నిమ్మజాతికి చెందినపండ్లు | 7,477 | — |

| | | |
|---|---|---|
| (iii) మామిడి పండ్లు | 26,215 | — |
| (iv) ఇతర తాజాపండ్లు | 7,521 | — |
| మొత్తం తాజాపండ్లు | 46,559 | — |
| (బి) ఎండు పండ్లు | | |
| (i) జీడి గింజలు | 1.933 | — |
| (ii) ఇతర ఎండు పండ్లు | — | — |
| మొత్తం ఎండు పండ్లు | 1,933 | — |
| మొత్తం ఎండు పండ్లు, తాజాపండ్లు | 48,492 | — |
| 2. కూరగాయలు | | |
| (ఎ) బంగాళా దుంపలు | — | — |
| (బి) కర్ర పెండలం | 4,116 | — |
| (సి) చిలగడ దుంపలు | 2,006 | — |
| (డి) ఉల్లిగడ్డలు | 1,753 | 5,700 |
| (ఇ) ఇతర కూరగాయలు | 3,232 | — |
| మొత్తం కూరగాయలు | 11,107 | 5,700 |
| మొత్తం పండ్లు, కూరగాయలు దుంప పంటలతో సహా | 59,599 | — |
| (vi) వివిధ రకాలకు చెందిన ఇతర ఆహార పంటలు | 440 | — |
| మొత్తం ఆహార పంటలు | 11,15,566 | — |

## ఆహారేతర పంటలు

| | | | |
|---|---|---|---|
| I | నారలు | | |
| | 1. ప్రత్తి | 1,401 | 190 (బేళ్ళు) |
| | 2. బొంబాయి జనుము | 402 | 900 (బేళ్ళు) |
| | 3. జనుము | 15,752 | — |
| | 4. ఇతర నారలు | 1,183 | — |
| | మొత్తం నారలు | 18,738 | 1,090 |
| II | నూనె గింజలు | | |
| | (ఎ) ఆహారంలో ఉపయోగించ బడేవి | | |
| | (i) వేరు శనగ | 5,743 | 2580 (టన్నులు) |
| | (ii) కొబ్బరి | 56,305 | — |
| | (iii) నువ్వులు | 67,052 | 8,750 |
| | (iv) రేప్ విత్తనాలు, ఆవాలు | 2 | — |
| | (v) కుసుములు | — | — |
| | (vi) ఇతరములు | 71 | — |
| | మొత్తం | 1,29,173 | 11,330 |
| | (బి) ఆహారంలో ఉపయోగించబడనివి | | |
| | (i) ఎల్లగిసె విత్తనాలు | 3 | — |

| | | |
|---|---|---|
| (ii) ఆముదాలు | 2,856 | 290 |
| (iii) నిగర్ విత్తనాలు | — | — |
| (iv) ఇతరములు | 15 | — |
| మొత్తంఆహారంలో ఉపయోగించబడనినూనెగింజలు | 2,874 | 290 |
| | 1,32,047 | 11,620 |
| III అద్దకం రంగులు, తోళ్ళపరికరాలు | | |
| (i) నీలిమందు (అద్దకంకోసం) | 29 | 10 |
| (ii) ఇతర అద్దకపు రంగులు | 6 | — |
| మొత్తం అద్దకపు రంగులు | 35 | 10 |
| IV మందులు, మత్తుపదార్థాలు | | |
| 1. కాఫి | — | — |
| 2 జనుము | 18 | — |
| 3. తమల పాకులు | 49 | — |
| 4. పొగాకు | 40,777 | 12,700 |
| 5. ఇతర మందులు, మత్తు పదార్థాలు | 27 | — |
| మొత్తం మందులు, మత్తు పదార్థాలు | 40,871 | 12,700 |

| | | | |
|---|---|---|---|
| V | పశుగ్రాసపు పంటలు | 15,368 | — |
| VI | పచ్చి ఎరువు పైరులు | | |
| | 1. జనుము | 2,544 | — |
| | 2. నీలిమందు | — | — |
| | 3. ఇతరములు | 25 | — |
| | మొత్తం పచ్చి ఎరువు పైరులు | 2,569 | — |
| VII | వివిధ ఆహారేతర పంటలు | 451 | — |
| | (i) మొత్తం ఆహారేతర పంటలు | 2,10,079 | — |
| | (ii) మొత్తం పంట భూమి | 18,25,945 | — |
| | (iii) ఒకసారికంటే ఎక్కువగాసాగుచేయబడే భూమి | 2,51,297 | — |
| | (iv) నికరపు పంట భూమి | 15,74,648 | — |

## స్థానిక పరిపాలన

ఈ జిల్లాలోని కాకినాడ, రాజమండ్రి, అమలాపురం మందపేట, తుని, పిఠాపురం, సామర్లకోట, పెద్దాపురం, రామచంద్రపురం, ద్రాక్షారామం, అనకాపల్లిలలో 11 మునిసిపాలిటీలు ఉన్నాయి.

## తపాలా కార్యాలయాలు

1–4–1959 తేదీ నాటికి యీ జిల్లాలో రెండు హెడ్ ఆఫీసులు, 71 సబ్–ఆఫీసులు, 446 బ్రాంచి ఆఫీసులు, 48 టెలిగ్రాఫ్ ఆఫీసులు, 5 టెలిఫోను ఎక్స్చేంజిలు, 24 పబ్లిక్ కాల్ ఆఫీసులు ఉన్నాయి.

## రైలు మార్గాలు

ఈ జిల్లాలో 79½ మైళ్ళ బ్రాడుగేజి రైలుమార్గం ఉన్నది. కలకత్తా--మద్రాసు రైలు మార్గం రాజమండ్రి నుండి తుని వరకు యీ జిల్లా గుండా పోతుంది. రాజమండ్రి, రామచంద్రపురం, కాకినాడ, పిఠాపురం, తుని తాలూకాల మీదుగా యీమార్గం వేయ బడి ఉంది. జిల్లా కేంద్రమయిన కాకినాడను కలుపుతూ సామర్లకోట జంక్షను నుండి ఒక బ్రాంచి రైలు మార్గం వేయ బడి ఉన్నది. ఖమ్మంజిల్లాలో ఉన్నడోర్నకల్లు భద్రాచలానికి దగ్గరలో ఉన్న స్టేషను.

## రోడ్లు

ఈ జిల్లాలో 1,936 మైళ్లరోడ్లు ఉన్నాయి. అవి క్రింది విధంగా వర్గీకరించ బడినాయి, (1-4-59).

| | | మైళ్ళు |
|---|---|---|
| 1. | జాతీయ రహదారులతో సహా రాజ్య రహదారుల, శాఖచే నిర్వహించ బడుతున్న రోడ్లు | 775 |
| 2. | మునిసిపాలిటీలచే నిర్వహించ బడుతున్న రోడ్లు | 230 |
| 3. | స్థానిక సంస్థలచే నిర్వహించ బడుతున్న రోడ్లు | 931 |
| | మొత్తం | 1,936 |

## సహకారం

30-6-57 తేదీ నాటికి యీ జిల్లాలో 25 రాజ్య మరియు కేంద్ర పరపతేతర సంఘాలు, 1,207 వ్యవసాయ సహకార సంఘాలు, 264 వ్యవసాయేతర సహకార సంఘాలు ఉన్నాయి. వీటిలో సభ్యుల సంఖ్య వరుసగా 2,048; 2,38,647; మరియు 65,563.

## విద్య

1955–56 లో యీ జిల్లాలోని విద్యా సంస్థల సంఖ్య క్రింద యివ్వబడింది.

| | | |
|---|---|---|
| 1. | ఉన్నత పాఠశాలలు | 66 |
| 2. | మాధ్యమిక పాఠశాలలు | 14 |
| 3. | ప్రాథమిక పాఠశాలలు | 2,323 |
| 4. | వయోజన విద్యా కేంద్రాలు | 135 |
| 5. | ప్రత్యేక పాఠశాలలు, వృత్తి విద్యా కేంద్రాలు | 37 |
| 6. | కళాశాలలు (వృత్తి విద్యా కళాశాలలు కలుపుకొని) | 6 |
| | మొత్తం | 2,581 |

## వైద్యం, ఆసుపత్రులు

1956–57 సం.లో యీ జిల్లాలో 12 జనరలు ఆసుపత్రులు, 22 . వైద్యశాలలు ఉన్నాయి.

# రెండవ ప్రణాళికలోని నాలుగవ సంవత్సరపు కార్యక్రమ స్వరూపం

ప్లానింగు కమిషను ఉద్యోగులతోను, కేంద్రమంత్రాంగ శాఖల ఉద్యోగులతోను రాజ్య ప్రముఖోద్యోగులు సంప్రదింపులు జరిపిన తరువాత రెండవ ప్రణాళిక యొక్క నాలుగవ సంవత్సరపు కార్యక్రమం క్రింద రు. 37.66 కోట్ల

మొత్తాన్ని ఖర్చు పెట్టడానికి నిర్ణయించ బడింది. అయితే వివిధ విషయాలను పరిశీలించిన తరువాతను, ప్రణాళిక, అభివృద్ధి విషయాలనుగురించి సలహాలనిచ్చుటకు ఏర్పాటు చేయబడిన రాజ్య సలహా సంఘంలో యీ విషయాలనుగురించి సమగ్ర చర్చలు జరిపిన అనంతరం రాజ్య ప్రభుత్వం వారు ఈ సంవత్సరంఖర్చు పెట్టదలచిన మొత్తాన్ని రు. 42 08 కోట్లకు పెంచడానికి నిర్ణయించారు. ఈ విధంగా కేటాయింపు మొత్తాన్ని హెచ్చించడానికి ముఖ్యకారణాలు ఏవంటే:

(i) ఈ సంవత్సరం కేటాయింపు మొత్తాన్ని హెచ్చుచేయక పోయినట్లయితే రెండవ ప్రణాళిక యొక్క ఆఖరి సంవత్సరంలో చేయవలసిన పనులు ఎక్కువగా మిగిలి పోతాయి.

(ii) పెంచబడిన కేటాయింపు మొత్తాన్ని ఖర్చు పెట్టటానికి తగిన విధంగా రాజ్య పరిపాలనా యంత్రాంగం సంసిద్ధం చేయబడింది.

(iii) ప్రస్తుతమున్న ఆదాయ మార్గాలను పూర్తిగా వినియోగించుకో వలసిన అవసరం ఎంతో ఉన్నది.

(iv) రాజ్య ప్రభుత్వం యొక్క ఆదాయ మార్గాలు కూడ ఈ పాటి ప్రణాళికను అనులు పరచటానికి సరిపడంతగా ఉన్నాయి

ప్రతి అభివృద్ధి కార్యక్రమం క్రింద ఎక్కువ చేయబడిన కేటాయింపు వివరాల్ని మొదటి పట్టికలో చూడవచ్చును.

ఈ సంవత్సరం ఖర్చు పెట్టదలచిన డబ్బు యిది వరకటి సంవత్సరాల కంటే చాల ఎక్కువ. గత సంవత్సరం మొదట నిర్ణయించి తరువాత సవరించ బడిన మొత్తాలకంటే యిది వరుసగా రు. 12 మరియు 7 కోట్లు ఎక్కువ. ప్రణాళిక యొక్క మొదటి నాలుగు సంవత్సరాల్లోను కేటాయించబడిన మొత్తం వివరాలు రెండవ పట్టికలో చూడవచ్చును.

వివిధ విషయాల పద్దు క్రింద యివ్వబడిన కార్యక్రమాల కేటాయింపు విషయంలో చేయబడిన కొద్దిపాటి తగ్గింపు మినహా మిగత అన్ని అభివృద్ధి కార్య

క్రమాల క్రిందా కేటాయింపు మొత్తం అధికం చేయబడింది. అయితే 1958-59 సంవత్సరంతో పోల్చిచూస్తే కేటాయింపులో ఎక్కువ భాగం పరిశ్రమలకు, రవాణాకు, సాంఘిక కార్యక్రమాలకు ప్రత్యేకించ బడిన విషయం విదితం కాగలదు. అయినప్పటికి వివిధ కార్యక్రమాలకు దాదాపు గత సంవత్సరంలో యివ్వబడిన క్రమంలోనే ప్రాధాన్యం యివ్వబడింది.

ఈ సంవత్సరం అమలు పరచడానికి ప్రతిపాదించబడిన పథకాలు, వాటికి కేటాయించ బడిన డబ్బు, సాధించ దలచిన లక్ష్యాలను గురించి సమగ్ర వివరణలు రెండవ భాగంలో చూడవచ్చును.

ఈ సంవత్సరపు కార్యక్రమాన్ని గురించి సంగ్రహంగా తెలపటం కోసం 1959–60లో సాధించ దలచిన లక్ష్యాలను గురించిన వివరాలు క్రింద యివ్వబడినాయి.

## కొన్ని లక్ష్యాల వివరాలు

| పద్దు | యూనిట్లు | 1959–60 సంవత్సరపు లక్ష్యాలు |
|---|---|---|
| వ్యవసాయం | | |
| 1. వ్యవసాయోత్పత్తి | 000 టన్నులు | |
| (i) పెద్ద తరహా నీటి పారుదల పనులు | ,, | 190.60 |
| (ii) చిన్న తరహా నీటి పారుదల పనులు | ,, | 38.70 |
| (iii) భూమి అభివృద్ధి | ,, | 44.50 |
| (iv) ఎరువులు, రసాయనిక ఎరువులు | ,, | 43.00 |

| | | | |
|---|---|---|---|
| (v) | మేలురకం విత్తనాలు | ,, | 21.00 |
| (vi) | సస్యరక్షణ | ,, | — |
| (vii) | పై పద్దుల క్రింద ఉత్పత్తికి వీలు కల్పించ బడిన తరువాత మేలురకం వ్యవసాయ విధానాలు అవలంబించటానికి | .. | 89.60 |
| | | | 427 40 |
| | ఆహారేతర పంటలవల్ల తగ్గింపు | ,, | 11.30 |
| | | | 416.10 |
| | | 000 | |
| | చిన్న తరహా నీటి పారుదల పనులు | ఎకరాలు | |
| | నీటి పారుదల కల్పించబడుతున్న భూమి | ,, | వివరాలు అందు బాటులో లేవు |
| | విత్తనాల క్షేత్రాలు | సంఖ్య | 188 |
| (i) | భూమి స్వాధీనంచేసుకోబడినట్టి వాటిసంఖ్య | — | — |
| (ii) | వ్యవసాయ కార్య కలాపాలు ప్రారంభించ బడినట్టి వాటి సంఖ్య | — | — |
| (iii) | విత్తనాల ఉత్పత్తి ప్రారంభమయిన వాటి సంఖ్య | — | — |
| | ఎరువులు | | |
| | | 000 | |
| (i) | పట్టణాల్లో గోతి ఎరువు ,, | టన్నులు | 245.16 |
| (ii) | గ్రామాల్లో గోతి ఎరువు | ,, | ప్రతి పంచాయతీ లోను 75 టన్నులు |

| | | |
|---|---|---|
| (iii) పచ్చి ఎరువులు | ,, | 0.40 |
| రసాయనిక ఎరువులు | 000 | |
| (i) అమ్మోనియం సల్ఫేటు | టన్నులు | 148.40 |
| (ii) సూపర్ ఫాస్ఫేటు | ,, | 47.60 |
| (iii) యూరియా | ,, | 19.50 |
| (iv) అమ్మోనియం నైట్రేటు | ,, | 27.50 |
| (v) కాల్షియం అమ్మోనియం నైట్రేటు | ,, | 8.00 |
| రాష్ట్ర ప్రభుత్వంచే భూములలో స్థిరపరచే బడేటటువంటి భూములు లేని కుటుంబాలు | సంఖ్య | వివరాలు అందు బాటులో లేవు |

2. పశుగణాభివృద్ధి

కీలక గ్రామ పథకం

| | | |
|---|---|---|
| కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రాలు | సంఖ్య | 11 |
| కీలక గ్రామ కేంద్రాలు | ,, | 66 |

3. సహకారం

చిన్నతరహా సంఘాలు

| | | |
|---|---|---|
| పటిష్ఠం చేయబడేవి | ,, | 1,000 |
| క్రొత్తవి | ,, | 1,000 |
| సహకార వ్యవసాయసంఘాలు | ,, | 12 |

| | | |
|---|---|---|
| సహకార వ్యవసాయసంఘాలు | విస్తీర్ణం ఎకరాలలో | 3,376 |
| సహకార ఏజెన్సీలద్వారా యివ్వ | రూ॥ లక్షలలో | |
| బడే వ్యవసాయ ఋణం | సంవత్సరానికి | |
| స్వల్పకాలిక ఋణాలు | ,, | 1,320 |
| మధ్యకాలిక ఋణాలు | ,, | 130 |
| దీర్ఘకాలిక ఋణాలు | ,, | 171 |
| మార్కెటింగు ఫైనాన్సు | ,, | 450 |

4. సామాజికాభివృద్ధి బ్లాకులు (జాతీయ విస్తరణ సేవా కేంద్రాలతో సహా) సంఖ్య

| | | |
|---|---|---|
| | సంఖ్య | మొదటిదశ బ్లాకులు 26 |
| | | రెండవదశ బ్లాకులు 20 |
| జనాభా | మిలియన్లు | 1,675 |
| ఉపయోగం పొందే గ్రామాలు | సంఖ్య | 1,600 |

5. పెద్దతరహా, మధ్య తరహా నీటిపారుదల పనులు

| | | |
|---|---|---|
| | 000 | |
| సంభవమయ్యే అదనపు నీటి పారుదల | ఎకరాలు | 418 |
| నీటి పారుదల కల్పించబడే భూమి | ,, | 418 |

6. విద్యుచ్ఛక్తి

| | | |
|---|---|---|
| | 000 | |
| అదనపు ఇన్స్టాల్డు కెపాసిటి | కిలోవాట్లు | 29,750 |
| 33 కె.వి. కంటె శక్తివంతమైన ట్రాన్సు మిషను లైన్లు | మైళ్లు | 290 |
| 33 కె.వి. అంత కంటె తక్కువ శక్తివంతమైన ట్రాన్సు మిషను లైన్లు | ,, | 400 |
| విద్యుతీకరణం చేయబడే పట్టణాలు, గ్రామాలు | సంఖ్య | 200 |

7. వరద నివారణ

| | | |
|---|---|---|
| | 000 | |
| అదనంగా రక్షణ కల్పించబడే భూమి | ఎకరాలు | 48 |

8. రోడ్లు

| | | |
|---|---|---|
| నిర్మించబడే కంకర రోడ్లు | మైళ్లు | 29.4 |

9. విద్య

| | | |
|---|---|---|
| సంస్థలు | సంఖ్య | |
| ప్రాథమిక పాఠశాలలు, జూనియరు బేసిక్ పాఠశాలలు కలుపుకొని | ,, | 1,600 |
| జూనియరు బేసిక్ పాఠశాలలు | ,, | 419 |
| మాధ్యమిక పాఠశాలలు, సీనియరు బేసిక్ పాఠశాలలు కలుపుకొని | ,, | 32 |
| సీనియరు బేసిక్ పాఠశాలలు | ,, | — |
| ఉన్నతపాఠశాలలు | ,, | 18 |
| హైయ్యర్ సెకండరీ పాఠశాలలు | ,, | 10 |
| బహుళార్థ సాధక పాఠశాలలు | ,, | 4 |
| సాంకేతిక విద్య—డిగ్రీ/డిప్లొమా | ,, | -- |
| వివిధ తరగతుల్లో చేర్చుకోబడే విద్యార్థులు | సంఖ్య | డిప్లొమా 1,150 |
| | | డిగ్రీ 360 |
| I నుండి V వ తరగతి వరకు | ,, | 50,000 |
| VI నుండి VIII వ తరగతి వరకు | ,, | 20,910 |
| IX నుండి XI వ తరగతి వరకు | ,, | 6,900 |
| ఉపాధ్యాయులకు శిక్షణ | | |
| శిక్షణపాఠశాలల్లో (బేసిక్ నాన్‌బేసిక్ కలుపుకొని) చేర్చుకోబడేవారి సంఖ్య | సంఖ్య | 2,250 |

| | | |
|---|---|---|
| శిక్షణ కళాశాలల్లో (బేసిక్, నాన్ బేసిక్) | | |
| కలుపుకొని చేర్చుకోబడెవారి సంఖ్య | సంఖ్య | 200 |
| **10.** ఆరోగ్యం | | |
| ఆరోగ్య కేంద్రాలు | సంఖ్య | |
| సామాజికాభివృద్ధి కార్యక్రమం క్రింద / ఇతర కార్యక్రమం క్రింద | ,, | 20 |
| కుటుంబ నియంత్రణ కేంద్రాల | | |
| i పట్టణ కేంద్రాలు | ,, | 15 |
| ii గ్రామీణ కేంద్రాలు | ,, | 44 |
| శిక్షణ సౌకర్యాలు | | |
| i డాక్టర్లు | ,, | 450 |
| ii నర్సులు | ,, | 120 |
| iii దాయీలు | ,, | 720 |
| iv సహాయక నర్సు-మంత్రసానులు | ,, | 90 |
| v మంత్రసానులు | ,, | 158 |
| 11. గృహ నిర్మాణం | | |
| పారిశ్రామిక గృహవసతి | | |
| నిర్మించ బడిన యూనిట్లు | ,, | 1,365 |
| తక్కువ ఆదాయం గలవారికి గృహనిర్మాణం | ,, ఆర్. సి. ఎస్ | 680 |
| నిర్మించ బడిన యూనిట్లు | ,, డి. టి. పి. | 180 |
| **12.** కార్మికులు, కార్మిక సంక్షేమం | | |
| వృత్తి పనివారికి శిక్షణ | ,, వివరాలు అందుబాటులో లేవు | |

| | | |
|---|---|---|
| శిక్షణ కేంద్రాలు | ,, | — |
| శిక్షణ యివ్వబడినవారి సంఖ్య | ,, | 1,816 |
| **18. వెనుకబడిన తరగతుల సంక్షేమం** | | |
| షెడ్యూల్డు తెగలు | | |
| స్కాలరు షిప్పులు | ,, | 2,465 |
| సహాయం చేయబడిన కుటుంబాలు | ,, | 637 |
| తెరవబడిన వైద్యాలయాలు | ,, | — |
| నిర్మించబడిన రోడ్లు | మైళ్ళు | 78 |
| షెడ్యూల్డు కులాలు | | |
| స్కాలరు షిప్పులు | సంఖ్య | 4,900 |
| సహాయం చేయబడిన కుటుంబాలు | ,, | 850 |
| విముక్త జాతులు | | |
| స్కాలరు షిప్పులు | ,, | — |
| పునరావాసం కల్పించబడిన కుటుంబాలు | ,, | 275 |
| ఇతర వెనుకబడిన తరగతులు | | |
| స్కాలరు షిప్పులు | ,, | 5780 |
| సహాయం చేయబడిన కుటుంబాలు | ,, | — |

## మొదటి పట్టిక

### 1959-60 సంవత్సరపు ప్రణాళికలో కేటాయించబడిన మొత్తం వివరాలు

(రూపాయలు లక్షలలో)

| | | 1959-60లో కేటాయింపు | | | |
|---|---|---|---|---|---|
| వరుస సంఖ్య | అభివృద్ధి కార్యక్రమం వివరం | ఆంధ్ర | తెలంగాణా | ఆంధ్రప్రదేశ్ | మొత్తం ప్రణాళిక కేటాయింపుకు శాతం |
| | వ్యవసాయకార్యక్రమాలు | 687.162 | 373.080 | 1,060 222 | 25.23 |
| 1. | వ్యవసాయోత్పత్తి | 120.710 | 47.180 | 167.890 | 4.00 |
| 2. | చిన్నతరహా నీటిపారుదలపనులు | 105.81 | 69.19 | 175.000 | 4.16 |
| 3. | భూమి అభివృద్ధి | 5.300 | — | 5.300 | 0.13 |
| 4. | పశు గణాభివృద్ధి | 66.062 | 21.470 | 87.532 | 2.08 |
| 5. | పాడిపరిశ్రమ, పాలసరఫరా | 12.550 | 15.940 | 28.490 | 0.68 |
| 6 | అడవులు | 16 520 | 21.720 | 38 240 | 0.91 |
| 7. | భూసారరక్షణ | 13 810 | 6.060 | 19.870 | 0.47 |
| 8. | మత్స్య సంవర్ధన | 15.710 | 7.290 | 23.000 | 0.55 |
| 9. | సహకారం, గిడ్డంగులు, మార్కెటింగు | 81.370 | 58.270 | 139.640 | 3.32 |
| 10. | వివిధ విషయాలు | 3.000 | 1.360 | 4.360 | 0.10 |
| 11. | సామాజికాభివృద్ధి, జాతీయ విస్తరణ సేవా కార్యక్రమాలు | 240.850 | 119.150 | 360.000 | 8.57 |
| 12. | పంచాయతీలను పటిష్ఠంచేయటం | 5.450 | 5.450 | 10.900 | 0.26 |
| | నీటిపారుదల, విద్యుచ్ఛక్తి | 994.960 | 711.090 | 1,706.050 | 40.60 |
| 13. | బహుళార్థ సాధక ప్రాజెక్టులు | 445.000 | 255.000 | 700.000 | 16.66 |

| | | | | |
|---|---|---|---|---|
| 14. పెద్దతరహా, మధ్యతరహా నీటిపారుదల పనులు | 242.470 | 265.220 | 507.690 | 12.08 |
| 15. విద్యుచ్ఛక్తి | 307.490 | 190.870 | 498.360 | 11.86 |
| పరిశ్రమలు | 2 1 9.720 | 75.410 | 295.130 | 7.02 |
| 16. పెద్దతరహా, మధ్యతరహా పరిశ్రమలు | 83.850 | — | 83.850 | 1.99 |
| 17. గ్రామీణ పరిశ్రమలు, చిన్న తరహా పరిశ్రమలు | 88.750 | 54.630 | 143.380 | 3.41 |
| 18. చేనేత పరిశ్రమలు | 47.120 | 20.780 | 67.900 | 1.62 |
| రవాణా | 145.920 | 64 430 | 210.350 | 5.01 |
| 19. రోడ్లు | 116.090 | 64.430 | 180.520 | 4.30 |
| 20. రోడ్డు రవాణా | 29.830 | — | 29.830 | 0.71 |
| సాంఘిక కార్యక్రమాలు | 514.980 | 361.826 | 876.806 | 20.86 |
| 21. విద్య | 188.670 | 134.610 | 323.280 | 7.69 |
| 22. వైద్యం | 88.060 | 61.940 | 150.000 | 3.57 |
| 23. ప్రజారోగ్యం | 46.540 | 30.390 | 76.930 | 1.83 |
| 24. గ్రామీణ, పట్టణ నీటిసరఫరా | 16.340 | 33.280 | 49.620 | 1.18 |
| 25. గృహ నిర్మాణం | 46.17 | 66 08 | 112.250 | 2.67 |
| 26. కార్మికులు, కార్మిక సంక్షేమం | 16.510 | 14.050 | 30.560 | 0.73 |
| 27. వెనుకబడిన తరగతుల, షెడ్యూల్డు కులాలసంక్షేమం | 40.920 | 14.350 | 55.270 | 1.32 |
| 28. షెడ్యూల్డు తెగలసంక్షేమం | 48.160 | 5.666 | 53.826 | 1.28 |
| 29. స్త్రీ సంక్షేమం | 4.110 | 1.460 | 5.570 | 0.13 |
| 30. సాంఘిక సంక్షేమం | 19.500 | — | 19.500 | 0.46 |
| వివిధవిషయాలు | 49.250 | 4.710 | 53.960 | 1.28 |
| 31. రాజధాని అభివృద్ధి | 20.000 | — | 20.000 | 0.48 |

| | | | | |
|---|---|---|---|---|
| 32. మునిసిపల్ రోడ్లు అభివృద్ధిపనులు | 11.590 | — | 11.590 | 0.28 |
| 33. రేడియోప్రసారం | 4.860 | 1.670 | 6.530 | 0.15 |
| 34. ప్రచారం | 3 760 | 3.040 | 6.800 | 0.16 |
| 35. అర్థగణాంకశాఖ | 9.040 | — | 9.040 | 0.21 |
| మొత్తం | 2611.972 | 1590.546 | 4202.518 | 100.00 |

# వ్యవసాయోత్పత్తి

మేలురకం విత్తనాల అభివృద్ధి, పంపకం

(విత్తనాల క్షేత్రాలు, విత్తనాల స్టోరులు)

వ్యవసాయోత్పత్తిని అధికం చేసే ఉద్దేశంతో ప్రతి బ్లాకులోను ఒక విత్తనాల క్షేత్రాన్ని ఏర్పాటు చేయడానికి, విత్తనాల స్టోరును నిర్మించడానికి సంబంధించిన పథకం భారత ప్రభుత్వం వారి ప్రోత్సాహంతో ప్రారంభించబడింది. ప్రాథమిక విత్తనాల క్షేత్రాల నిర్వహణ కోసం రిజిస్టరైన ఉత్పత్తి దారులకు పంపకం చేసేటందుకు కావలసిన రకాల విత్తనాలను ఉత్పత్తి చేసుకోవడంలో ఈ విత్తనాల క్షేత్రాలు ఉపయోగపడతాయి. రిజిస్టరైన ఉత్పత్తి దారులు, డిపార్టుమెంటు వారికట్టుదిట్టమైన పర్యవేక్షణ క్రింద తమభూములలో అసలు విత్తనాలను పండిస్తారు. అందులో నూటికి 50 వంతులు ఉత్పత్తి దారులనుండి సేకరించబడి రైతులకుపంపకం చేసేటందుకు అనేక విత్తనాల స్టోరుల్లో నిల్వ చేయబడతాయి. ఈ సంవత్సరపు ప్రణాళికలో, ఆంధ్ర ప్రాంతంలో 129 విత్తనాల క్షేత్రాలను, అదేసంఖ్యలో విత్తనాల స్టోరులను నెలకొల్పడానికి రూ. 42. 29 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రూ. 5.27 లక్షల మొత్తం 17 విత్తనాల క్షేత్రాలను, 17విత్తనాల స్టోరులను నెలకొల్పడానికి ఈ జిల్లాకు కేటాయించ బడింది.

## తగ్గింపు ధరలకు విత్తనాల పంపకం

ఈ పథకం క్రింద, మేలురకం వరి, జొన్న, గోధుమ, మొక్కజొన్న, పప్పుధాన్యాలవిత్తనాలు రిజిస్టరైన ఉత్పత్తి దారులనుండి కొనుగోలు చేయబడి తగ్గింపు రేట్లకు వ్యవసాయదారులకు పంపిణీచేయబడతాయి. వరి, గోధుమ, మొక్కజొన్నమణుగు ఒక్కంటికి రూ. 2 చొప్పునా, జొన్న మణుగు ఒక్కంటికి రూ. 1 చొప్పునా ఆతగ్గింపు రేట్లుంటాయి. ఈ పథకం, తెలంగాణాప్రాంతంలో

1956–57 లగాయతు అమలు జరుప బడుతున్నది. ఈపథకం క్రింద చేకూరే లాభాలను ఆంధ్ర ప్రాంతానికి కూడా విస్తరింప చేయడానికి ఈ సంవత్సరం తలపెట్టబడింది. అందుకోసం 1959–60 ప్రణాళికలో రూ. 7.53 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రూ. 5.22 లక్షల మొత్తం, ఆంధ్ర ప్రాంతంలో విత్తనాల పంపిణీకి, రూ. 2.31 లక్షల మొత్తం తెలంగాణా ప్రాంతంలో పంపిణీకి వినియోగింప బడతాయి. ఈ పథకంవల్ల కలిగే లాభాలు ఈ జిల్లాలోని రైతులకు కూడా చేకూరుతాయి.

## జపాను వరి రకాలను భారత వరి పైరులతో కలపడంద్వారా మేలురకం వరి విత్తనపు రకాలను ఉత్పత్తిచేయడం

పంట దిగుబడిని ఎక్కువగానిచ్చే జపాను వరి రకాలను మేలు రకం భారతీయ వరి రకాలతో కలపడం ద్వారా వివిధ రకాల భూములకు తగివుండే మేలు రకం వరి విత్తనాలను రూపొందించటానికి యీ పరిశోధన పథకం ఉద్దేశించ బడింది. సామర్లకోట లోని వ్యవసాయ పరిశోధన కేంద్రంలో 1956–57లో యీ పరిశోధన పథకం అమలుపరచబడింది. ఒక రీసెర్చి అసిస్టెంటు, ఒక ఫీల్డు మెన్ యిందుకు నియమించ బడినారు. ఈ సంవత్సరం యీ పథకాన్ని కొనసాగించడానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు రు. 0.08 లక్ష కేటాయించ బడింది.

## చీడలు, తెగుళ్ల నివారణ

పంటలకు చీడలు, తెగుళ్లు పట్టకుండా నివారణ చర్యలు తీసికోవడానికి వ్యవసాయశాఖ డిపోలలోని సాధన సామాగ్రిని పెంపు చేసేటందుకు స్ప్రేయర్లను, డస్టర్లను కొనాలని ఈ పథకం ఉద్దేశిస్తున్నది. ప్రతి జిల్లా హెడ్ క్వార్టరులోను నియమించబడిన ప్లాంటు ప్రొటెక్షను అసిస్టెంట్లకు సలహా నిచ్చేటందుకు మైకాలజీ కొకరు, ఎంట మోలజీకి ఒకరు మొత్తం ఇద్దరు ప్లాంటు ప్రొటెక్షను ఆఫీసర్లు నియమింపబడ్డారు. 1957–58లో మొబైల్ ప్లాంటు ప్రొటెక్షను సర్వీసు కూడా ప్రారంభించ బడింది. అందుకు 8 మొబైలు వ్యానులు కూడ సరఫరా చేయ

బడ్డాయి. ప్రస్తుతం అవి ఆంధ్ర ప్రాంతంలో పని చేస్తున్నాయి. ఈ పథకం క్రింద నియమించబడిన సిబ్బందిని, మొబైలు ప్లాంటు ప్రొటెక్షన్ సర్వీసును కొనసాగించేటందుకు 70 విద్యుచ్ఛక్తి స్ప్రేయర్లను, 500 చేతి డస్టర్లను కొనడానికి రూ. 5.42 లక్షల మొత్తం ఈ సంవత్సరపు ప్రణాళికలో కేటాయించ బడింది. అందులో రూ. 0.49 లక్ష మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది.

## జిల్లా సర్వీసు కేంద్రాలను స్థాపించడం

రైతులవద్ద, వ్యవసాయ శాఖవద్ద మరమ్మతు అవసరమయిన స్థితిలో వ్యవసాయ యంత్రాలు ఉన్నాయి. వీటిని మరమ్మతు చేయడంలో వీరికి తోడ్పడడానికి, తద్వారా ఉపయోగంలో లేకుండా ఉన్న యంత్రాల సంఖ్యను జిల్లాలలో తగ్గించడానికిగాను జిల్లాలలో సర్వీసు స్టేషనులను స్థాపించడానికి ప్రతిపాదించబడింది. అదే ప్రకారం 1957–58లో ఒక కేంద్రం కాకినాడలోను, 1958–59లో నాలుగు కేంద్రాలు చిత్తూరు, నెల్లూరు, నిజామాబాదు, వరంగల్లులలోను—మొత్తం 5 కేంద్రాలను స్థాపించడం జరిగింది. ఈ సంవత్సరం రు. 1.47 లక్షల వ్యయంతో ఈ కేంద్రాలు కొనసాగించబడతాయి. ఇందులో రు. 0.35 లక్ష కాకినాడలోని కేంద్రానికిగాను ప్రత్యేకించబడింది.

## అద్దె కొనుగోలు పద్ధతిమీద వ్యవసాయ పనిముట్ల పంపిణి

చెరకు రసం తీసే యంత్రాలు, గట్లుపోసే యంత్రాలు, ధాన్యాన్ని నూర్చే యంత్రాలు వంటి ఆధునిక వ్యవసాయ పనిముట్లను నగదు చెల్లించి కొనుక్కోవడం సన్నకారు రైతులకు కష్టం. అందువల్ల అటువంటి పనిముట్లను కొని ఆంధ్ర ప్రాంతంలోని అవసరమున్న సన్నకారు రైతులకు అద్దె కొనుగోలు పద్ధతి మీద పంపిణీ చేయడానికి ఈ పథకం ఉద్దేశిస్తున్నది. ఈ పనిముట్లు ఆయిలు యింజన్లు, ఎలక్ట్రిక్ మోటారు సెట్ల మాదిరి గానే ఇవ్వబడతాయి. వ్యక్తిగత పూచీ మీద ప్రతి రైతుకు పనిముట్ల రూపంలో రూ. 800/-ల గరిష్ఠ పరిమితి వరకు ఋణం ఇవ్వబడుతుంది. దీనిమీద సాలుకు నూటికి రూ. 4 వడ్డీ వసూలు చేయబడుతుంది. ఈ మొత్తం 4 సమాన వాయిదాలలో వసూలు చేయబడుతుంది.

ఈ పథకం 1957–58, 1958–59 సంవత్సరాలలో అమలు జరపబడింది. ఈ సంవత్సరం కూడా కొనసాగింప బడుతుంది. అందుకు రూ. 1.00 లక్ష మొత్తం కేటాయించబడింది. అందులో రూ. 0.10 లక్ష మొత్తం ఈ జిల్లాలో వినియోగింప బడుతుంది.

### పట్టణాలలో గోతి ఎరువు తయారీ, పంపకం

గోతి ఎరువును ఎక్కువగా తయారుచేసి, పంపకం చేయడం కోసం మున్సిపాలిటీలు, మేజరు పంచాయతీలకు ఈ పథకం క్రింద ఋణాలు ఇవ్వబడతాయి. ఆంధ్ర ప్రాంతంలోని స్థానిక సంస్థలకు ఋణాలు ఇవ్వటానికి ఈ సంవత్సరపు ప్రణాళికలో రూ. 3.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఋణ సహాయం ఈ జిల్లాలోని స్థానిక సంస్థలకు కూడా లభ్యమౌతుంది. ఈ జిల్లాలో 14,000 టన్నుల గోతి ఎరువు ఉత్పత్తి చేయబడుతుందని, అది 2,500 ఎకరాల్లో ఉపయోగించ బడుతుందని తద్వారా 250 టన్నుల పంట అదనంగా ఉత్పత్తి చేయ బడుతుందని ఆశించబడుతున్నది.

### స్థానికంగా లభ్యమయ్యే చెత్తా చెదారాలతో ఎరువు తయారీ

గ్రామాలలో ప్రస్తుతం ఉత్పత్తి చేయబడుతున్న ఎరువు పరిమాణాన్ని అధికం చేయడమే ఈ పథకం యొక్క ఉద్దేశం. స్థానికంగా లభ్యమయ్యే చెత్తా చెదారాలను నిలువచేసి ఆధునిక పద్ధతుల మీద గోతి ఎరువు తయారు చేయబడుతుంది. మొదట్లో ఈ పథకాన్ని బ్లాకు ప్రాంతాలలో అమలు పరచి, తరువాత రెండవ ప్రణాళిక ఆఖరయ్యే సరికి రాజ్యం అంతా విస్తరింప చేయడానికి ఉద్దేశింప బడింది. 1957–58, 1958–59 సంవత్సరాలలో రాజ్యంలోని 56 బ్లాకుల్లో ఈ పథకం అమలు పరచబడింది. స్థానికంగా లభ్యమయ్యే చెత్తా చెదారంతో ఎరువును తయారు చేసుకోవడానికి గల విధానాలలో 12,505 మంది వ్యవసాయదారులకు శిక్షణ ఇవ్వబడింది. ఇద్దరు ఫీల్డు మెన్యూరియల్ ఆఫీసర్లు, 20 మంది కంపోస్టు ఇన్స్పెక్టర్లు, 20 మంది ఫీల్డుమెన్లు, ఒక అప్పర్ డివిజన్ గుమాస్తా, ఇద్దరు, లోయరు డివిజను గుమాస్తాలు, ముగ్గురు టైపిస్టులు, 4గురు జవానులతో కూడిన

ప్రత్యేక సిబ్బంది ఈ పథకం క్రింద నియమించ బడింది. పై సిబ్బందిని కొనసాగించడానికి, మరి 47 బ్లాకులకు ఈ పథకాన్ని విస్తరింప చేయడానికి ఈ సంవత్సరపు ప్రణాళికలో రూ. 4.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఈ 47 బ్లాకులలో 30 ఆంధ్ర ప్రాంతంలోను, 17 తెలంగాణా ప్రాంతంలోను ఉంటాయి. సుమారు 18,000 మంది వ్యవసాయదారులకు ఈ సంవత్సరం శిక్షణ ఇవ్వబడునుందని ఆశింపబడుతున్నది. ఈ జిల్లాలోని రైతులకు కూడా ఈ పథకంవల్ల లాభం చేకూరుతుంది. ఈ సంవత్సరంలో ఈ పథకం క్రింది బ్లాకులకు విస్తరింప చేయబడుతుంది.

1. తాళ్ళరేవు.

2. సుగారు ఏజెన్సీ.

మలమూత్రాదుల నుండి గోతి ఎరువును తయారుచేయడం

సపాయి సౌకర్యాలున్న గ్రామ పంచాయతీలలో మలమూత్రాదుల నుండి, చెత్తనుండి గోతి ఎరువును ఉత్పత్తి చేయడాన్ని ఈ పథకం ఉద్దేశిస్తున్నది. 1958–59 లో ఆంధ్ర ప్రాంతంలోని 66 పంచాయతీలకు, తెలంగాణా ప్రాంతంలోని 33పంచాయతీలకు మొత్తం 66 పంచాయతీలకు ఋణాలను ఇవ్వడానికి రూ. 2 00 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఈ సంవత్సరం ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలలోని పంచాయతీలకు ఋణాల క్రింద మరొక రూ. 2.00 లక్షలు ఇవ్వడానికి ఉద్దేశింప బడింది. అందులో కొంత మొత్తం ఈ జిల్లాలోని పంచాయతీలకు కూడా ఇవ్వబడుతుంది. సుమారు 8.0 టన్నుల గోతి ఎరువు ఉత్పత్తి చేయబడుతుంది. 160 ఎకరాల మేర యిది ఉపయోగించ బడుతుంది. దీనివల్ల ఈ జిల్లాలో అదనంగా 20 టన్నుల పంట పండుతుంది.

చేతి స్ప్రేయర్లు. చేతి డస్టర్లు తగ్గింపు ధరలకు పంపిణీ

పంటలకు పెద్ద ఎత్తున చీడలు పట్టినప్పుడు సాధ్యమైనంత త్వరలో సస్యసంరక్షణ చర్యలు తీసికోనేందుకు తమకు కావలసినన్ని స్ప్రేయర్లను, డస్టర్లను

వ్యవసాయదారులు, సహకార సంస్థలు, పంచాయతీలు మొదలైనవి కొనుక్కొనే టట్లు చేయడమే ఈ పథకం యొక్క ఆశయం. ఈ పరికరాలు అసలు ధరలో సగం రేటుకు సరఫరా చేయబడతాయి. మిగిలిన సగం రాజ్య కేంద్ర ప్రభుత్వాలు భరిస్తాయి. 1958–59లో 500 చేతి స్ప్రేయర్లు, డస్టర్లు కొనడానికి రూ. 0.60 లక్ష మొత్తం మంజూరుచేయబడింది. ఈ సంవత్సరపు ప్రణాళికలో మరి 500 స్ప్రేయర్లు, డస్టర్లను కొని సరపరా చేయడానికి రూ 0.90 లక్ష మొత్తం కేటాయించబడింది. అందులో 35 రూ.0 063 లక్ష వ్యయంతో ఈ జిల్లాకు సరఫరా చేయబడుతాయి.

## ఆంధ్ర ప్రదేశ్‌లో పండ్ల తోటల అభివృద్ధి పథకం

ప్రస్తుతం పండ్లతోటలున్న ప్రాంతాన్ని విస్తరింపచేయడం క్రొత్త ప్రాంతంలో పండ్ల తోటలు వేయడం ద్వారా ఫలోత్పత్తిని అధికం చేసే ఉద్దేశంతోను, వ్యవసాయోత్పత్తిని బహుముఖంగా పెంపు చేయడానికి ఫలోత్పత్తిని అభివృద్ధి చేసేటందుకు ప్లానింగు కమీషను వారు చేసిన సిఫార్సులను పురస్కరించుకొని ఈ పథకం 1957 58లో ప్రారంభించబడింది. ఈ పథకం క్రింద రైతులకు స్వల్పకాలిక ఋణాలు దీర్ఘకాలిక ఋణాలు ఇవ్వబడతాయి. పాత తోటల్ని పునరుద్ధరించడానికి ఎకరానికి రూ 65 చొప్పున స్వల్పకాలిక ఋణాలు ఇవ్వబడతాయి. క్రొత్తగా పండ్లతోటల్ని వేసుకోవడానికి దీర్ఘకాలిక ఋణాలు ఇవ్వబడుతాయి. ఇవి ఎకరానికి రూ. 150 నుండి 300 వరకు ఇవ్వబడతాయి. 1957-58, 1958-59 లలో సుమారు రూ. 11.00 లక్షల మొత్తం ఋణాలుగా పంపిణీ చేయబడింది. ఈ పథకాన్ని కొనసాగించడానికి ప్రణాళికలో ఈ సంవత్సరం రూ. 8.88 లక్షలమొత్తం ప్రత్యేకించబడింది. ఇందులో రూ. 1.36 లక్షల మొత్తం అవసరం వచ్చినప్పుడే జిల్లాలకు పంపిణీ చేసేనిమిత్తం కడపజిల్లా, అనంతరాజు పేటలోని ఫ్రూట్ టుస్పెషలిస్టువద్ద రిజర్వులో ఉంచబడింది. మిగిలిన మొత్తంలో రూ. 0.40 లక్ష ఈ పథకంక్రింద ఋణాలనిచ్చేటందుకుగాను ఈ జిల్లాలో వినియోగింప బడుతుంది.

## ప్రత్తి పంట అభివృద్ధి పథకం

నీడుభూముల్ని బంజరు భూముల్ని సాగు క్రిందకు తీసుకరావడం, ఆవరేతర పంటలకు బదులు ప్రత్తి పంటను వేయడం. రెండు పంటలను పండించడం, పంటకు పంటకు మధ్య ప్రత్తి పంట పండించడం, మేలు రకపు విత్తనాలను పంచడం, రసాయనిక ఎరువులను వాడడం వంటి సాగు పద్ధతులను అవలంబించి రెండవ ప్రణాళికా కాలంలో బేలుకు 392 పౌనులుండే సుమారు 20,000 బేళ్ల ప్రత్తిని అదనంగా ఉత్పత్తి చేయడానికి ఈ పథకం క్రింద ఉద్దేశింప బడింది. మొదటి మూడు సంవత్సరాలలో ఉత్పత్తి 12,000 బేళ్లకు పెరిగింది. ఈ సంవత్సరపు ప్రణాళికలో ఈ పథకం కోసం రూ. 1.40 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ మొత్తం ఈ దిగువ తెలుపబడిన ఉద్యోగుల క్రింద ఉంచబడుతుంది. వారు ఈ పథకం మీద అజ్మాయిషీ వహిస్తారు. వీరే విత్తనాలు మొదలైన వాటిని కొని పంపకం చేస్తారు.

| | | | రూ. లక్షలలో, |
|---|---|---|---|
| 1. | కాటన్ ఎక్స్టెన్షన్ ఆఫీసరు, వ్యవసాయశాఖ డైరెక్టరేటు | | 0.9190 |
| 2. | అసిస్టెంటు కాటన్ ఎక్స్టెన్షన్ ఆఫీసరు | ఆదిలాబాదు | 0.1495 |
| 3. | ,, ,, | కడప | 0.1743 |
| 4. | ,, ,, | గుంటూరు | 0.1572 |
| | | మొత్తం | 1.4000 |

ఈ జిల్లాలో 50 ఇంపీరియల్ మణుగుల ప్రత్తి గింజలు పంచబడతాయి. 5,280 ఎకరాల మేర ప్రత్తి పంట పండించబడుతుంది. తత్ఫలితంగా 1,457 బేళ్ల ప్రత్తి ఉత్పత్తి అవుతుంది.

### చెరకు పంటకు ఎక్కువగా ఎరువు వేసే పథకం

పంటదిగుబడి ఎక్కువ అయ్యేటందుకు చెరకుపంటకు ఎరువులను ఎక్కువగా వేయడాన్ని ప్రచారంలోకి తీసికొని రావడమే ఈ పథకం యొక్క ఉద్దేశం. ఈ

పథకం, ౧౯౫౮–౫౯ చివరి భాగంలో అమలు జరుప బడింది. ఆంధ్రలో 28 మంది, తెలంగాణాలో 12 మంది కామ్‌గార్ల ద్వారా వివిధ కేంద్రాలలో ఈపని జరుప బడుతూ ఉన్నది. ఈపథకాన్ని 1959–60 లో కొనసాగించ డానికి ఉద్దేశింప బడింది. అందుకు రూ. 0.30 లక్ష మొత్తం ప్రణాళికలో కేటాయించ బడింది. ఈ జిల్లాలో చెరకు పండించే వ్యవసాయదారులకు కూడా ఈ పథకం వల్ల లాభం చేకూరుతుంది.

## ఆంధ్రలో చెరకు పంట అభివృద్ధి

అభివృద్ధికార్య క్రమాలను విస్తృతంగా అమలు పరచడం మూలంగా చెరకు పంట దిగుబడిని, చెరుకు రసం యొక్క నాణ్యతను అభివృద్ధిచేసే ఉద్దేశంతో 1956-57లో ఈ పథకం చెరకు పండే శ్రీకాకుళం, విశాఖ పట్టణం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణ, చిత్తూరు, అనంతపురం జిల్లాలలో అమలు పరచబడింది. రెండవ ప్రణాళికాంతం నాటికి చెరకు ఉత్పత్తిని నాటికి 33⅓ పంతులు పెంచడమే ఈపథకం యొక్క అంతిమ లక్ష్యం. పైలయిన చోట్ల కొత్త ప్రాంతాలను చెరకు పంట క్రిందకు తీసుకు రావడం మూలంగా అధనంగా చెరకు పంట పండించుతుంది. పై జిల్లాల్లో ఈ పథకం 20 అభివృద్ధి కేంద్రాల్లోను, 5 మండల కేంద్రాల్లోను అమలులో ఉన్నది. ఈ సంవత్సరం ఈ కార్యక్రమం పై కేంద్రాలలో కొనసాగించ బడుతుంది. ఇందుకు ప్రణాళికలో రు. 3 07 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.50 లక్షలు ఈ జిల్లాలో పై కార్యక్రమం కొనసాగించడం కోసం ప్రత్యేకించ బడింది.

## పొగాకు పంట విస్తరణ

మేలు రకాల పొగాకును ఉత్పత్తిచేయడం కోసం పొగాకును పండించడం, శుభ్రపరచడం మొదలయిన విషయాలను గురించి ప్రదర్శన పూర్వకంగా వివరించడం ద్వారా రైతులకు పైవిషయంలో విజ్ఞానాన్ని కలుగ చేసేటందుకు గాను ఈ పథకం 1956–57లో కృష్ణా, తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలలో అమలు పరచబడింది. ఒక అసిస్టెంటు టొబాకో ఎక్స్‌టెన్షన్ ఆఫీసరు, 12 మంది ఫీల్డు అసిస్టెంట్లు, ఒక హెడ్‌క్లర్కు, ఒక లోయరు డివిజను గుమాస్తా, ఒక టైపిస్టు,

36 మంది మేస్త్రీలు, ముగ్గురు జవానులు, ఒక డ్రైవరుతో కూడిన ఎక్స్‌టెన్షన్ సిబ్బంది నియమించబడింది. 1957–59సం॥లలో ఈ పథకం కొనసాగించబడింది. ఈ సంవత్సరం కొనసాగించబడుతుంది. ఇందుకోసం రు. 0.77 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.29లక్ష ఈ జిల్లాకోసం ప్రత్యేకించబడింది.

## ప్రాంతీయ ప్రాతిపదిక పై ఆంధ్రలో పప్పుధాన్యాల అభివృద్ధి

పప్పుధాన్యాలు ప్రత్యేకంగాను ఇతరతృణధాన్యాలతో కలిసి ఆంధ్రప్రదేశ్ అంతటా పండింప బడుతున్నాయి. ప్రస్తుతం రాజ్యంలో పప్పు ధాన్యాలవిషయమై పనిచేసేపరిశోధనకేంద్రం ఏదీలేదు. అందువల్ల త్వరితగతిని సత్ఫలితాలను పొందడానికి, వివిధమండలాలకు తగిఉండే పప్పుధాన్యాల రకాలను ఉత్పత్తిచేసే ఉద్దేశంతో వివిధకేంద్రాల అవసరాలను తీర్చడానికి ప్రాంతీయ ప్రాతిపదిక పై పప్పు ధాన్యాల కోసం అభివృద్ధి పనులను ప్రారంభించడం అవసరం అని భావించబడింది. ఈ ఉద్దేశంతోనే ఈ పథకం 1958–59లో ముగ్గురు రిసెర్చి అసిస్టెంట్లు, నలుగురు ఫీల్డుమెన్లతో సామర్లకోట, లాం, అనంతపురంలోని పరిశోధన కేంద్రాలలో ప్రారంభించ బడింది. ఈ సంవత్సరంలో పథకాన్ని కొనసాగించడానికి ప్రణాళికలో రు. 0.08 లక్ష మొత్తం కేటాయించ బడింది. అందులో రూ. 0.03 లక్ష మొత్తం, ఈ జిల్లాలోని సామర్లకోట కేంద్రంలో ఈ పథకాన్ని కొనసాగించడానికి ప్రత్యేకించ బడింది.

## జీడి గింజల అభివృద్ధి

ఈ రాజ్యంలోని బంజరు భూముల్లో జీడి తోటలువేసే ఉద్దేశంతో క్రొత్తగా ఎంపిక చేయబడ్డ ప్రాంతాలలో జీడిగింజలను నాటడానికిగాను 15,000 పౌనులు మంచి రకం గింజలు సాగు చేయడానికి తలపెట్టబడింది. జీడి తోటలను విస్తరింప చేయడానికి తగు ప్రాంతాలను ఎంపిక చేయడం కోసం శ్రీకాకుళం, తూర్పు గోదావరి, గుంటూరు జిల్లాలలోని ప్రాంతాలను సర్వేచేయడానికి తల పెట్టబడింది. ఈ పథకం క్రింద, అదనంగా మరికొన్ని ప్రాంతాలలో జీడితోటల్ని వేయడానికి వీలుగా ఎకరానికి రూ. 100 లు చొప్పున రైతులకు ఋణాలు మంజూరు చేయబడతాయి.

పథకం, 1958–59 చివరి భాగంలో అమలు జరుప బడింది. ఆంధ్రలో 28 మంది, తెలంగాణాలో 12 మంది కామ్‌గార్‌ల ద్వారా వివిధ కేంద్రాలలో ఈపని జరుప బడుతూ ఉన్నది. ఈపథకాన్ని 1959–60 లో కొనసాగించ డానికి ఉద్దేశింప బడింది. అందుకు రూ. 0.30 లక్ష మొత్తం ప్రణాళికలో కేటాయించ బడింది. ఈ జిల్లాలో చెరకు పండించే వ్యవసాయదారులకు కూడా ఈ పథకం వల్ల లాభం చేకూరుతుంది.

## ఆంధ్రలో చెరకు పంట అభివృద్ధి

అభివృద్ధికార్యక్రమాలను విస్తృతంగా అమలు పరచడం మూలంగా చెరకు పంట దిగుబడిని, చెరుకు రసం యొక్క నాణ్యతను అభివృద్ధిచేసే ఉద్దేశంతో 1956-57లో ఈ పథకం చెరకు పండే శ్రీకాకుళం, విశాఖ పట్టణం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణ, చిత్తూరు, అనంతపురం జిల్లాలలో అమలు పరచబడింది. రెండవ ప్రణాళికాంతం నాటికి చెరకు ఉత్పత్తిని నూటికి 33⅓ వంతులు పెంచడమే యీ పథకం యొక్క అంతిమ లక్ష్యం. వీలయిన చోట్లా క్రొత్త ప్రాంతాలను చెరకు పంట క్రిందకు తీసుక రావడం మూలంగా అదనంగా చెరకు పంట పండి చెందుతుంది పై జిల్లాల్లో ఈ పథకం 20 అభివృద్ధి కేంద్రాల్లోను, 5 మండల కేంద్రాల్లోను అమలులో ఉన్నది. ఈ సంవత్సరం ఈ కార్యక్రమం పై కేంద్రాలలో కొనసాగించ బడుతుంది. ఇందుకు ప్రణాళికలో రు. 3 07 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.50 లక్షల ఈ జిల్లాలో పై కార్యక్రమం కొనసాగించడం కోసం ప్రత్యేకించ బడింది.

## పొగాకు పంట విస్తరణ

మేలు రకాల పొగాకును ఉత్పత్తిచేయడం కోసం పొగాకును పండించడం. శుభ్రపరచడం మొదలయిన విషయాలను గురించి ప్రదర్శన పూర్వకంగా వివరించడం ద్వారా రైతులకు పీటివిషయంలో విజ్ఞానాన్నికలుగ చేసేటందుకు గాను ఈ పథకం 1956–57లో కృష్ణా, తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలలో అమలు పరచబడింది. ఒక అసిస్టెంటు టొబాకో ఎక్స్‌టెన్షన్ ఆఫీసరు, 12 మంది ఫీల్డు అసిస్టెంట్లు, ఒక హెడ్ క్లర్కు, ఒక లోయరు డివిజను గుమాస్తా, ఒక టైపిస్టు,

36 మంది మేస్త్రీలు, ముగ్గురు జవానులు, ఒక జీపు డ్రైవరుతో కూడిన ఎక్స్టెన్షన్ సిబ్బంది నియమించబడింది. 1957–59సం లలో ఈ పథకం కొనసాగించబడింది. ఈ సంవత్సరం కొనసాగించ బడుతుంది. ఇందుకోసం రు. 0.77 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.29లక్ష ఈ జిల్లాకోసం ప్రత్యేకించబడింది.

## ప్రాంతీయ ప్రాతిపదికపై ఆంధ్రలో పప్పుధాన్యాల అభివృద్ధి

పప్పుధాన్యాలు ప్రత్యేకంగానూ ఇతరతృణధాన్యాలతోకలిపీ ఆంధ్రప్రదేశ్ అంతటా పండింప బడుతున్నాయి ప్రస్తుతం రాజ్యంలో పప్పు ధాన్యాలవిషయమై పనిచేసేపరిశోధక కేంద్రం ఏదీలేదు. అందువల్ల త్వరితగతిని సత్ఫలితాలను పొందడానికి, వివిధమండలాలకు తగిఉండే పప్పుధాన్యాల రకాలను ఉత్పత్తిచేసే ఉద్దేశంతో వివిధకేంద్రాల అవసరాలను తీర్చడానికి ప్రాంతీయ ప్రాతిపదికపై పప్పు ధాన్యాల కోసం అభివృద్ధి పనులను ప్రారంభించడం అవసరం అని భావించబడింది. ఈ ఉద్దేశంతోనే ఈ పథకం 1958–59లో ముగ్గురు రిసెర్చి అసిస్టెంట్లు, నలుగురు ఫీల్డుమెన్లతో సామర్లకోట, లాం, అనంతపురంలోని పరిశోధన కేంద్రాలలో ప్రారంభించ బడింది. ఈ సంవత్సరంలో పథకాన్ని కొనసాగించడానికి ప్రణాళికలో రు. 0.08 లక్ష మొత్తం కేటాయించ బడింది. అందులో రూ. 0.03 లక్ష మొత్తం, ఈ జిల్లాలోని సామర్లకోట కేంద్రంలో ఈ పథకాన్ని కొనసాగించడానికి ప్రత్యేకించ బడింది.

## జీడి గింజల అభివృద్ధి

ఈ రాజ్యంలోని బంజరు భూముల్లో జీడి తోటలువేసే ఉద్దేశంతో క్రొత్తగా ఎంపిక చేయబడ్డ ప్రాంతాలలో జీడిగింజలను నాటడానికిగాను 15,000 పౌనులు మంచి రకం గింజలు సాగు చేయడానికి తలపెట్టబడింది. జీడి తోటలను విస్తరింపచేయడానికి తగు ప్రాంతాలను ఎంపిక చేయడం కోసం శ్రీకాకుళం, తూర్పుగోదావరి, గుంటూరు జిల్లాలలోని ప్రాంతాలను సర్వేచేయడానికి తల పెట్టబడింది. ఈ పథకం క్రింద, ఆదనంగా మరికొన్ని ప్రాంతాలలో జీడితోటల్ని వేయడానికి వీలుగా ఎకరానికి రూ. 100 లు చొప్పున రైతులకు ఋణాలు మంజూరు చేయబడతాయి.

ఒక క్యాషునట్ డెవలప్‌మెంటు ఆఫీసరను, నలుగురు అసిస్టెంట్లను, ఒక అప్పరు డివిజను గుమాస్తాను, 5 గురు జవానులను నియమించడం ద్వారా 1958-59లో ఈ పథకం అమలు పరచబడింది. 3,000 ఎకరాలమేర జీడితోటలు వేయడానికి ఋణాలు ఇవ్వబడ్డాయి. ఈ సంవత్సరపు ప్రణాళికలో ఈ పథకాన్ని కొనసాగించడానికి 6,000 ఎకరాలమేర జీడితోటల్ని వేయడానికిగాను రూ. 6.11 లక్ష మొత్తం కేటాయించబడింది, అందులో జిల్లాల ఆవసరపు అవసరాల ఏవైనా ఉంటే వాటికోసం, హెడ్ క్వార్టర్సులో రూ 0.12 లక్ష మొత్తం ప్రత్యేకించి ఉంచబడింది. సిబ్బంది కర్మ్యోఖర్చులసంటి వాటికోసం రూ. 0.11 లక్ష మొత్తం కేటాయించబడింది. మిగిలిన మొత్తంలో రూ. 1.28 లక్షలు 1.260 ఎకరాలమేర జీడితోటల్ని వేయడానికిగాను ఈ జిల్లాకు ఋణాలరూపంలో ఇవ్వబడతాయి.

చెరకు పంటకు చీడలు, తెగుళ్ళు తగలకుండా రక్షణకల్పించడం

చెరకు పంటకు తగిలే చీడలు, తెగుళ్ళలో చెరకు మొవ్వుచచ్చుట, కాటుక తెగులు ముఖ్యమైనట్టివి. ఈ తెగుళ్ళను అదుపులో పెట్టడానికి సక్రమమైన చర్యలను సకాలంలో తీసుకోవడం అవసరం. సకాలంలో నివారణ చర్యలను తీసుకోవడానికి వీలుకల్పించే సదుపాయం ప్రతి మండల కేంద్రానికి విద్యుచ్ఛక్తితో నడుపబడే స్ప్రేయర్లను పిచికారీలు, డస్టర్లను (పొడిచల్లే సాధనాలు) సరఫరాచేయడానికి, ఇన్‌సెక్టిసైడల్, ఫంగిసైడల్ స్ప్రేయర్ల ఉపయోగాన్ని ప్రదర్శనపూర్వకంగా తెలియచేయడానికి ప్రతిపాదించబడింది. ఈ రసాయనిక మందులు తగ్గింపు ధరలకు సరఫరా చేయబడతాయి. 1957-58లో ఈ పథకం ప్రారంభించబడింది. 1959-60లో కొనసాగించబడుతుంది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 0.24 లక్ష కేటాయించబడింది. ఈ పథకం అమలులో ఉన్న 7 జిల్లాలలోని 15,800 ఎకరాల భూమిలో పై చర్యలు తీసుకోబడతాయి. పై మొత్తంలో రు. 0.086 లక్ష ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది. ఈ జిల్లాలో 2,870 ఎకరాల భూమికి ఈ పథకంవల్ల ప్రయోజనం చేకూరుతుంది.

ఆంధ్రలో పోకతోటల పెంపకం

రాజ్యంలో ప్రస్తుతం ఉత్పత్తి అవుతున్న పోకచెక్కలు రాజ్యం యొక్క జనాభా అవసరాలకు సరిపడగాలేవు ఇందువల్ల ఆంధ్రలో పోకతోటలను పెంచు

తున్నవారికి తగుప్రోత్సాహం యిచ్చేటందుకుగాను ఈపంట బాగాపండడానికి అనువుగా ఉండే ప్రదేశాల్లో ప్రదర్శన క్షేత్రాలను ఏర్పాటు చేయడానికి ప్రతిపాదింపబడింది. ఒక్కొక్క ప్రదర్శన క్షేత్రపు విస్తీర్ణం 10 సెంట్లుఉంటుంది. 1957-58 సంవత్సరపు ఉత్తర భాగంలో ఈ పథకం క్రింద 10 కేంద్రాలలో ప్రారంభించబడింది. 1958-59లో యీ పథకం కొనసాగించబడింది.

| కేంద్రం ఏర్పాటు చేయబడిన గ్రామం పేరు | తాలూకా | జిల్లా |
|---|---|---|
| 1. కోడూరు | హిందూపురం | అనంతపురం |
| 2 హొన్నికెల | మడకసిర | ,, |
| 3. అంగనవాడి | అనకాపల్లి | విశాఖపట్టణం |
| 4. నరసాపూరు | నరసాపూరు | పశ్చిమగోదావరి |
| 5. బంగనపల్లి | ,, | ,, |
| 6. తాటిపాక | రాజోలు | తూర్పుగోదావరి |
| 7. నందంపూడి | అమలాపురం | ,, |
| 8. ఊటుకూరు | కొవ్వూరు | నెల్లూరు |
| 9. కలూరు | కర్నూలు | కర్నూలు |
| 10. కవిటి | ఇచ్ఛాపురం | శ్రీకాకుళం |

ఈప్రదర్శన క్షేత్రాలను కొనసాగించడం కోసం ఈసంవత్సరపు ప్రణాళికలో రు. 0.03 లక్ష కేటాయించ బడింది.

## కొబ్బరి తోటల విస్తరణ పథకం

కొబ్బరితోటలను పెంచడానికి సంబంధించిన వివిధవిషయాలకు సంబంధించి చేయబడిన పరిశోధనల ఫలితాలను గురించి సొష్ఠవమైన ప్రచార వ్యవస్థ సహాయంతో తీవ్ర ప్రచారం చేయడంద్వారాను, కొబ్బరితోటల పెంపకపు దార్లకు ఎంపిక చేయబడినట్టి వ్యాధి రహితమైన మేలురకం మొక్కలను సరఫరా చేయడం ద్వారాను కొబ్బరితోటలను విస్తారంగా పెంచడానికి యీ పథకం ఉద్దేశించ బడింది. ఒక కోకోనట్ డెవలప్ మెంటు ఆఫీసరు, 5 గురు అసిస్టెంట్లు, 15 గురు ఫీల్డు మెన్‌లు. 10 మంది మేస్త్రీలు, ముగ్గురు అప్పరు డివిజను గుమాస్తాలు, 7 గురు లోయరు డివిజను గుమాస్తాలు, ఇద్దరు టైపిస్టులు 8 మంది జవానులు, ఒక జీప్పుడ్రయివరు, ఒక క్లీనరుతో కూడిన సిబ్బందిని నియమించడం ద్వారా యీ పథకం 1958-59 లో సోంపేట, అంబాజి పేట, సామర్లకోట, నరసాపూరు, రుద్రూరు కేంద్రాలలో అమలుపరచబడింది. ఈ సంవత్సరం కూడ యీ పథకం కొనసాగించ బడుతుంది. ఇందుకు రు 1.75 లక్షల మొత్తం ప్రణాళికలో కేటాయించబడింది. ఇందులో రు 0.70 లక్ష యీ జిల్లాలోని అంబాజిపేట, సామర్లకోటలలోని కేంద్రాల కొనసాగింపుకుగాను ప్రత్యేకించ బడింది. ఈ కేంద్రాలలో యీ సంవత్సరం 80,000 కొబ్బరికాయలు ఉత్పత్తి చేయబడతాయని ఆశించ బడుతున్నది

## సామర్లకోట, అనకాపల్లి, మార్టేరులలో కొబ్బరిమొక్కల ఉత్పత్తిని అధికం చేయడానికి సంబంధించిన పథకం

కొబ్బరి తోటలు పెంచేవారికి మేలురకం కొబ్బరి మొక్కలను సరఫరాచేసే ఉద్దేశంతో వాటి ఉత్పత్తిని అధికం చేయడమే ఈ పథకం యొక్క ఉద్దేశ్యం సామర్లకోట, అనకాపల్లి, మార్టేరులలో ఈ పథకం 1958-59లో ప్రారంభించ బడింది. రు. 0 37 లక్షవ్యయంతో ఈ సంవత్సరంలో ఇది కొనసాగించబడుతుంది. ఇందులో రు. 0.20 లక్ష ఈ జిల్లాలోని సామర్ల కోటలో ఉన్న కేంద్రానికిగాను ప్రత్యేకించ బడింది. ఈ కేంద్రంలో ఈ సంవత్సరం 80,000 కాయలు ఉత్పత్తి చేయబడతాయని ఆశించబడుతున్నది.

## నూనెగింజల అభివృద్ధి పథకం

నూనెగింజల ఉత్పత్తిని అధికం చేయడానికి ఈ పథకం ఉద్దేశించబడింది. ఈ పథకం క్రింద మేలు రకం విత్తనాలను వాడడంలోను, తగినంత ఎరువును వేయడంలోను, సస్యసంరక్షణ చర్యలను తీసికోవడంలోను తీవ్రమైన ప్రచారం చేయబడుతుంది. ప్రదర్శన పూర్వకంగా కూడ రైతులకు వివరింప బడుతుంది. ఒక పైరుకు మరొక పైరుకు మధ్య ఈ పంటను పండించే విషయమై కూడ ప్రచారం చేయడం, ప్రదర్శన పూర్వకంగా వివరించడం జరుగుతుంది. రాజేంద్రనగర్ లోని ఆయిలు సీడ్సు స్పెషలిస్టు పర్యవేక్షణక్రింద ఆంధ్ర జిల్లాలు తొమ్మిదింటి లోను, తెలంగాణా జిల్లాలు అయిదింటి లోను 1958—59లో ఈ పథకం అమలు జరుపబడింది. 1958—59లో క్రింద తెలుపబడిన సిబ్బంది కూడ నియమింప బడింది.

| | |
|---|---|
| అసిస్టెంటు ఆయిల్ సీడ్సు డెవలప్ మెంటు ఆఫీసర్లు | 2 |
| అసిస్టెంట్లు | 11 |
| ఫీల్డు మెన్లు | 22 |
| అప్పర్ డివిజను గుమాస్తాలు | 4 |
| లోయరు డివిజను గుమాస్తాలు | 16 |
| టైపిస్టులు | 8 |
| జీపు డ్రైవర్లు | 2 |
| జవానులు | 17 |
| వాచ్ మెన్లు | 2 |

ఈ పథకాన్ని 1959—60 లో కొనసాగించడానికి ఈ సంవత్సరపు ప్రణాళికలో రూ. 2.71 లక్షల మొత్తం కేటాయింప బడింది. ఈ పథకం క్రింద లాభం చేకూరే 14 జిల్లాలలో ఈ జిల్లా కూడ ఒకటి.

## కొబ్బరి తోటల అభివృద్ధి పథకం (ఆంధ్ర ప్రదేశ్) క్రింద కొబ్బరి చెట్లకు తగిలే తెగుళ్ళను గురించి పరిశీలించడం

కొబ్బరి చెట్లకు తగిలే తెగుళ్ళవల్ల విస్తారమైన నష్టం వాటిల్లు తున్నది. ఈ తెగుళ్ళను కనిష్ఠ పరిమితికి తగ్గించేటందుకు తగిన నివారణ పద్ధతులను రూపొందించడం కోసం రాజ్యంలో కొబ్బరిచెట్లకు తగిలే తెగుళ్ళనుగురించి పరిశీలన జరపడానికి ఈ పథకం ఉద్దేశించబడింది. ఈ పథకం క్రింద జరిగే కార్యక్రమం దిగువ ఇవ్వబడింది.

(ఎ) వివిధరకాలయిన తెగుళ్ళు ఎంతెంతవరకు తగులుతాయన్న విషయాన్ని నిర్ణయించడం కోసం ఆంధ్రప్రదేశ్‌లో కొబ్బరి తోటలున్న ప్రాంతాన్ని సర్వేచేయడం.

(బి) చెట్లకు తగిలే తెగుళ్ళకు కారణభూతమైన క్రిమికీటకాదులను వేరుపరచి చెట్లకు తెగుళ్లు తగలకుండా చూడటం.

(సి) చెట్లకు తగిలే తెగుళ్ల లక్షణాలను పరిశీలించడం.

(డి) తెగుళ్లుతగలని చెట్లనుగురించి తెగుళ్ళుతగిలిన చెట్లనుగురించి వివరమైన పరిశీలనలు జరపటం.

(ఇ) అంటు వ్యాధుల నివారణకు మందులు వాడటం.

(ఎఫ్) తెగుళ్లకు కారణములైన క్రిములను గురించి పరిశీలనల జరపడం.

(జి) పంగిసైడులు మొదలైన వాటిని వాడటం మూలంగా వ్యాధి నివారణ చర్యలు తీసుకోవడం, ఎరువులు మొదలైన వాటిని వాడటం మూలంగా నేలనుసారవంతం చేయడం.

ఈపథకం తూర్పుగోదావరిజిల్లాలోని రాజోలులో 1958–59లో అమలు పరచబడింది. ఒకఅసిస్టెంటు మైకాలజిస్టు, ఒకఅసిస్టెంటు, ఇద్దరు ఫీల్డుమెన్‌లు ఒక గుమస్తా, ఒక అటెండరు, ఇద్దరు జవానులు నియమించబడినారు. ఈ సంవత్సరం ఈ పథకం కొనసాగించబడుతుంది. ఇందుకు రు. 0.35 లక్ష కేటాయించబడింది.

## ఫీల్డుమెన్లు, డెమాన్‌స్ట్రేషను మేస్త్రీలకు శిక్షణ

ఆధునిక వ్యవసాయ పద్ధతులలో ఆరు నెలలపాటు ఫీల్డుమెన్లకు, డెమాన్‌స్ట్రేషను మేస్త్రీలకు శిక్షణ ఇవ్వడానికి ఈ పథకం ఉద్దేశింపబడినది. ఆధునిక వ్యవసాయ పద్ధతులనుగురించి ప్రదర్శనలను ఏర్పాటు చేయడానికి, తీవ్రమైన ప్రచారం జరపడానికి వారు వ్యవసాయశాఖలో నియమించబడతారు రెండవ పంచవర్షప్రణాళిక మొదటి రెండు సంవత్సరాలలో, ఆంధ్ర ప్రాంతంలోని ఈ క్రింది ఐదు కేంద్రాల లోను 197 గురు డెమాన్‌స్ట్రేషను మేస్త్రీలకు శిక్షణ ఇవ్వబడింది.

1. చెరకు పరిశోధన కేంద్రం — అనకాపల్లి
2. వ్యవసాయ పరిశోధన కేంద్రం — సామర్లకోట
3. వ్యవసాయ పరిశోధన కేంద్రం — మార్టేరు
4. కాలేజీ ఫారం — బాపట్ల
5. వ్యవసాయ పరిశోధన కేంద్రం — నంద్యాల

1958–59లో ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలనుండి వచ్చిన 178 మంది డెమాన్‌స్ట్రేషను మేస్త్రీలు, 178 మంది ఫీల్డుమెన్లు ఆంధ్ర ప్రాంతంలోని పై 5 కేంద్రాలలోను తెలంగాణా ప్రాంతంలోని ఈక్రింది 3 కేంద్రాలలోను శిక్షణ కోసం చేర్చుకోబడ్డారు.

1. గవర్నమెంటు మెయిన్‌ఫారం — రాజేంద్రనగర్
2. గవర్నమెంటు మెయిన్‌ఫారం — వరంగల్లు
3. గవర్నమెంటు ఎక్స్‌పెరిమెంటల్ స్టేషన్ — రుద్రూరు

శిక్షణ కార్యక్రమం ఈ సంవత్సరం కూడా కొనసాగింపబడుతుంది. 178 మంది డెమాన్‌స్ట్రేషను మేస్త్రీలు, మరొక 178 ఫీల్డుమెన్‌లు చేర్చుకోబడతారు. అందుకోసం ప్రణాళికలో రూ. 0 81 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ మొత్తంలో రూ. 0.09 లక్ష. ఈ జిల్లాలోని సామర్లకోటలో ఉన్న వ్యవసాయ పరిశోధన కేంద్రంలో 20 మంది డిమాన్‌స్ట్రేషను మేస్త్రీలకు, 20 మంది ఫీల్డుమెనులకు శిక్షణ ఇవ్వడం కోసం వినియోగింపబడుతుంది.

## ఆయిలు ఇంజన్లకు సంబంధించి వ్యవసాయ దారులకు శిక్షణ నిచ్చే పథకం

ఈ పథకం తెలంగాణాలో అమలు పరచబడింది. ఆయిలుఇంజన్లను నిర్వహించడం, నడపడానికి సంబంధించిన విషయాలను గురించి వ్యవసాయ దారులకు శిక్షణ నిచ్చేటందుకు ఆంధ్ర ప్రాంతానికి 1958—59లో ఈ పథకం విస్తరింప చేయబడింది. ఈ పథకాన్ని కొనసాగించడానికి, 420 మంది వ్యవసాయ దారులకు శిక్షణ ఇచ్చేటందుకు ఈ సంవత్సరపు ప్రణాళికలో రూ. 0.16 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఈజిల్లాలోని రైతులు కూడా ఈ శిక్షణ వల్ల లాభం పొందుతారు.

## సిబ్బందికి సంబంధించిన సమగ్ర పథకం

వ్యవసాయ శాఖకు సంబధించిన ప్రణాళికా పథకాలను కట్టు దిట్టంగా పర్యవేక్షించడానికి, విజయవంతంగానిర్వహించడానికిగాను ప్రధాన కార్యాలయం లోను, జిల్లాలలోను అదనంగా పర్యవేక్షక సాంకేతిక సిబ్బందిని గుమాస్తాలను నియమించడానికి తలపెట్టబడింది. ఇది 1956—57 నుండి కొనసాగుతూ వస్తున్న పథకం. ప్రణాళికలోని మొదటి మూడు సంవత్సరాలలోను నియమించ బడిన అదనపు సిబ్బందిని కొనసాగించడానికి రూ. 2.93 లక్షల మొత్తం ఈ సంవత్సరపు ప్రణాళికలో కేటాయించబడింది. అందులో కొంత మొత్తం ఈజిల్లాలో ఇది వరకు నియమించబడిన సిబ్బందిని కొనసాగించడానికి వినియోగించ బడుతుంది.

## అంబాజి పేటలో మండల క్రిమి పోషక కేంద్రం స్థాపన

కొబ్బరి తోటలను పెంచే ప్రాంతాలలో చీడలను అరికట్టేటందుకు కొబ్బరి తోటల పెంపకపుదార్లకు అవసరమైనన్ని "క్రిములను"(పారసైట్స్) రాజోలులో ఉన్న క్రిమిపోషక ప్రయోగశాల సరఫరా చేయలేక పోతున్నందువల్ల మరొక క్రిమిపోషక కేంద్రాన్నితూర్పు గోదావరి జిల్లాలోని అంబాజి పేటలో 1956—57లో స్థాపించడానికి ప్రతి పాదించబడింది. పరిపాలన సంబంధమయిన కారణాల వల్ల యీ కేంద్రాన్ని ప్రణాళిక యొక్క మొదటి రెండు సంవత్సరాల్లో స్థాపించడానికి వీలు లేక పోయింది. 1958—59లో యీ పోషక కేంద్రం స్థాపించబడింది.

ఈ సంవత్సరం యిది కొనసాగించ బడుతుంది. ఇందుకు రు. 0.10 లక్ష కేటాయించ బడింది.

## ఆంధ్రప్రదేశ్‌లో నలగర్ కమిటీ సిఫార్సులను అమలు పరచడానికి నామ మాత్రపు కేటాయింపు

భారత ప్రభుత్వం వారు 1957–58లో అగ్రికల్చరల్ అడ్మినిస్ట్రేటివ్ కమిటీ అనే ఒక కమిటీని ఏర్పాటుచేశారు. రాజ్యాలలో వ్యవసాయ సంస్థలను స్థాపించే విషయం గురించి, వ్యవసాయశాఖకు చెందిన అన్ని వర్గాల ఉద్యోగులు కూడ తమకు అప్పజెప్పబడిన కార్యక్రమాన్ని బాధ్యతతో నిర్వహించేటందుకు వీలుగా తగిన అధికారాలను కలిగియుండటం కోసం అన్ని స్థాయిాలలోని ఉద్యోగులకు అధికారాలను అప్పగించే పద్ధతుల్ని గురించిసిఫార్సు చేయడానికి ఈ కమిటీ నియమించబడింది. కమిటీనివేదిక ఇటీవలే అందింది. దానిని పరిశీలించిసిపార్సులను అమలు పరచడానికిగాను వివరమైన ప్రతిపాదనలకు తుదిరూప మియబడే వరకు 1959–60 ప్రణాళికలో రూ. 1.00 లక్ష మొత్తం నామమాత్రంగా కేటాయించ బడింది.

## వ్యవసాయోత్పత్తి సూచీలను తయారుచేయడం

రాజ్యంలోని వ్యవసాయ ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన వివిధ సూచీలను తయారుచేయడానికి యీ పథకం క్రింద ప్రతిపాదింపబడింది. వ్యవసాయోత్పత్తికి, పొలాలలో పంటల ధరలకు, వ్యవసాయ కూలీకి సంబంధించిన సూచీలు యిందులో ఉంటాయి. ఈ పథకం 1957–58లో అమలు పరచబడి 1958–59లో కొన సాగింపబడింది. ఈ పథకం ఈ సంవత్సరం కూడా కొన సాగించడం కోసం రూ. 0.06 లక్ష మొత్తం కేటాయించబడింది.

## పట్వారీల పనిమీద సరియైన పర్యవేక్షణ

భూమి విస్తీర్ణపు వివరాలు మొదలైన వాటిని రికార్డు చేయడంలోను, రాజ్యంలో ఎన్నిఎకరాలమేర ఏయే పంట పండుతున్నది సరిఅయిన అంచనాలను తయారుచేసు కోవడానికి గాను జిల్లా స్థాయిలో ముఖ్యమైన పంటలు పండే భూమి

విస్తీర్ణపు వివరాల విషయంలో సర్దుబాటులు చేయడంలోను పట్వారీలు కరణాలు మొదలైన వారిమీద తగు పర్యవేక్షణను జరిపించడం ఈ పథకం ఉద్దేశం. అవసర మయ్యే సిబ్బందిని నియమించడంద్వారా రాజ్యంలోని జిల్లాలన్నిటిలోను ఈ సంవత్సరం ఈ పథకాన్ని అమలు పరచడానికి ఉద్దేశింప బడింది. అందుకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రూ. 0.35 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఈ రంగంలో జరిగే పనిని రెవిన్యూ ఇన్స్పెక్టర్లు చూస్తుంటారు. దానిని తాసిల్దార్లు, ఈ పథకం క్రింద నియమింపబడిన ఎకనామిక్ ఇన్వెస్టిగేటర్లు పర్యవేక్షిస్తారు. ప్రణాళిక పర్యవేక్షణ, వివరాల వర్గీకరణ పథకజన విషయాలమీద అర్థగణాంక శాఖ అజ్మాయషీ వహిస్తుంది.

## విస్తరణ శిక్షణ కేంద్రాలు

ఇంతకు ముందు గ్రామ సేవకులుగా నియమించడానికి ఎంపిక చేయబడ్డ విద్యార్థులు ఒకసంవత్సరం ప్రాతిపదిక వ్యవసాయవిధానాలలోను, 6మాసాలపాటు విస్తరణ పద్ధతులలోను మొత్తం 18 మాసాలపాటు శిక్షణపొందేవారు. ఈ రెండు కోర్సులు వేరువేరుగావే పరిగణింపబడేవి. కోర్సును విజయవంతంగా పూర్తిచేసిన అభ్యర్థులకు వేర్వేరు సర్టిఫికేట్లు ఇవ్వబడుతుండేవి. శిక్షణ స్థాయిని పెంచే ఉద్దేశంతో ఈ రెండు కోర్సులను ఏకీకృతం చేయడానికి నిర్ణయింపబడింది. ఆ ప్రకారం రాజ్యంలోని నాలుగు విస్తరణ శిక్షణ కేంద్రాలను, ఐదు బేసిక్ వ్యవసాయ పాఠశాలలను గ్రామసేవక శిక్షణ కేంద్రాల నబడే 8 ఏకీకృత సంస్థలుగా మార్చటం ద్వారా వాటిలో 1958 అక్టోబరు లగాయతు ఈ ఏకీకృత కోర్సు ప్రవేశపెట్టబడింది. ఈ ఎనిమిది గ్రామసేవక శిక్షణ కేంద్రాలు, తూర్పు గోదావరి జిల్లాలోని సామర్లకోటలోను, పశ్చిమ గోదావరి జిల్లాలోని గోపన్నపాలెం లోను, చిత్తూరు జిల్లాలోని కాళహస్తిలోను, గుంటూరు జిల్లాలోని బాపట్లలోను, కర్నూలు జిల్లాలోని నంద్యాలలోను విశాఖపట్టణం జిల్లాలోని అనకాపల్లిలోను ఉక్కోట్టకట్టి, హైదరాబాదు జిల్లాలోని రాజేంద్రనగర్‌లో రెండు నెలకొల్ప బడ్డాయి. ఈసంవత్సరంలో ఈ శిక్షణ కేంద్రాలలో ఆంధ్రప్రాంతానికిచెందిన511 మంది, తెలంగాణా ప్రాంతానికిచెందిన 116 మంది మొత్తం 627 మంది శిక్షణ పొందుతారు. గ్రామసేవకులకు శిక్షణ గరిపేటందుకు సామర్లకోట, రాజేంద్ర

నగర్‌లలో ఒక్కొక్కటి చొప్పున ప్రస్తుతం రెండు గృహ శాస్త్రబోధనా విభాగా లున్నాయి. ఒక్కొక్కదానిలో 20 మంది శిక్షణ పొందడానికి వీలుంది. క్రొత్తగా బ్లాకులు ప్రారంభించడంవల్ల అవసరమయ్యే శిక్షణ పొందిన గ్రామ సేవ..లకోసం ప్రస్తుతంఉన్న రెండు సంస్థల్లోను అభ్యర్థుల సంఖ్యను 1958–59లో ఒక్కొక్క దానిలో 20 మండి 40 వరకు పెంచడం జరిగింది. సంవత్సరానికి 40 మంది గ్రామ సేవకులకు శిక్షణ ఇచ్చేటందుకు వీలుగా కాళహస్తిలో మరొక గృహశాస్త్ర బోధనా విభాగం స్థాపించబడింది. ఈ సంవత్సరంలో 120 మంది గ్రామ సేవి కలు శి గృహశాస్త్ర బోధనా విభాగాలలోను శిక్షణ పొందుతారు

సామర్లకోట, రాజేంద్రనగర్‌లలోని గ్రామ సేవికల శిక్షణ కేంద్రాలకు రెండు వర్కుషాపు విభాగాలు అనుబంధింపబడి ఉన్నాయి. మేలు రకం వ్యవ సాయ పనిముట్లను మరమ్మతు చేయడంలోను, ఉత్పత్తి చేయడంలోను ప్రతి సం వత్సరం ఒక్కొక్క విభాగంలో 20 మంది గ్రామ శ్రామికుల బాలురకు శిక్షణ ఇవ్వడానికి ఇవి ఉద్దేశింప బడ్డాయి. ఇంతవరకు సామర్లకోట వర్కుషాపు విభా గంలో 60మంది రాజేంద్రనగర్ విభాగంలో 27మంది మొత్తం 87మంది పనివా రికి శిక్షణ ఇవ్వబడింది. ఈ సంవత్సరంలో ఈ రెండు విభాగాలలోను మరి 40 మంది శిక్షణ పొందుతారని ఆశింప బడుతున్నది. ఈ సంవత్సరపు శిక్షణ కార్య క్రమం కోసం 1959–60 ప్రణాళికలో రూ. 9.16 లక్షల మొత్తం కేటాయిం చబడింది.

# చిన్నతరహా నీటిపారుదల పనులు

## బకాయి పనులు

బకాయి పనుల నిర్వహణ నిమిత్తం 1959–60 సంవత్సరానికి యీ జిల్లాకు రు. 0.08 లక్ష కేటాయించబడింది. ఈ పనుల వివరాలు క్రింద యివ్వ బడినాయి.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయింపు మొత్తం (రూపాయలు, లక్షలలో) |
|---|---|---|
| 1. | వేమగిరి పంపింగు పథకం | 0.08 |

## వరదగట్ల నిర్మాణం

ఈ సంవత్సరం మూడు వరదగట్లు రు 1.70 లక్షల వ్యయంతో నిర్మించ బడతాయి.

| | | కేటాయించబడిన మొత్తం రూపాయలు లక్షలలో |
|---|---|---|
| 1. | కాకినాడ నుండి యానాంకు వరకు వరదగట్టు నిర్మాణం | 0.30 |
| 2. | యానాం నుండి చల్లపల్లికి వరదగట్టు నిర్మాణం | 0.10 |
| 3. | కందికుప్ప నుండి ఎన్.కోట్రుపల్లికి వరదగట్టు నిర్మాణం | 1.30 |

## చెరువుల అభివృద్ధి పథకం

రెండవ ప్రణాళికా కాలంలో, 9,469 ఎకరాల క్రొత్త ఆయకట్టుకు, 29,545 ఎకరాల ప్రస్తుత ఆయకట్టుకు లాభం కలుగచేయడానికి గాను ఆంధ్ర జిల్లాలలో క్రొత్తగా చిన్నతరహా నీటిపారుదలపనులను ప్రారంభించడానికి, కొన్ని చెరువులను పునరుద్ధరించడానికి ఉద్దేశింపబడింది ఈ పథకం క్రింద ఈ సంవత్సరానికి రూ. 13.12 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఈ పథకం క్రింద చేకూరే లాభాలు ఈజిల్లాకు కూడా లభ్యమౌతాయి.

## ఫిల్టర్ పాయింటు బావులు

ఈ పథకం క్రింద వ్యవసాయదారుల పొలాలలో ఫిల్టర్ పాయింటు గొట్టపు బావులు త్రవ్వబడతాయి. వారికి ఫిల్టర్ పాయింట్లు ఇతర పరికరాలు సరఫరా చేయబడతాయి. ట్యూబులకు, సరఫరా చేయబడిన పరికరాలకు అయ్యే ఖర్చులంతా పూర్తిగావసూలు చేయబడుతుంది. అవసరమయ్యే పంపింగు యంత్రాలను కొనడానికి వీలుగా ప్రతి వ్యక్తికి రూ. 2,500 గరిష్ట మొత్తం వరకు ఋణాలు మంజూరు చేయబడతాయి. ఋణాలు, ప్రభుత్వంవారు అప్పుడప్పుడు నిర్ణయించే వడ్డీతో 5 సమాన వాయిదాలలో రైతులనుండి వసూలు చేయ బడతాయి. 1959–60 లో 140 ఫిల్టర్పాయింట్లను త్రవ్వడానికిగాను ఋణాలి ివ్వడానికి రూ. 3.50 లక్షల మొత్తం కేటాయించ బడింది.అందులో రూ. 1,175

లక్షల మొత్తం 47 ఫిల్టరు పాయింటు బావులను త్రవ్వడానికి ఋణాలు మంజూరు చేసే నిమిత్తం ఈ జిల్లాకు కేటాయించ బడింది.

## అద్దె కొనుగోలు పద్ధతిమీద అయిలు ఇంజన్ల ఎలక్ట్రిక్ మోటార్ల పంపిణీ

నీటి పారుదల కోసం నీటిని తోడుకోవడానికి గాను ఆయిలు ఇంజన్లు, ఎలక్ట్రిక్ మోటారు పంపుసెట్లు కొనుక్కోవడానికి శక్తి లేని రైతులకు అవి సరఫరా చేయ బడుతున్నాయి, ఆయిలు ఇంజన్లకు రూ. 4.000, ఎలక్ట్రిక్ మోటార్లకు రూ. 2,000 గరిష్ట మొత్తం ఋణాలు యివ్వ బడతాయి. ఈ మొత్తం 5 నుండి 7 వాయిదాలలో వసూలుచేయ బడుతుంది. ఇందుపై నూటికి రు. 4 వడ్డీ రు. 3/—లు సెంటేజి చార్జి లెక్క కట్టబడుతుంది. ఈ సంవత్సరంలో 122 ఆయిలు ఇంజన్లు, 155 ఎలక్ట్రిక్ మోటారు పంపుసెట్లు సరఫరాచేసే నిమిత్తం ప్రణాళికలో రూ. 8.0 లక్షల మొత్తం కేటాయించబడింది. పై కేటాయింపులో రూ. 0.58 లక్ష మొత్తం, 10 ఆయిలు ఇంజన్లు, 9 ఎలక్ట్రిక్ మోటార్ల సరఫరా కోసం ఈ జిల్లాకు కేటాయించబడింది.

## గొట్టపు బావుల పథకం

భారత ప్రభుత్వం వారి సహాయంతో టి.సి.ఎం కార్యక్రమం క్రింద ఆంధ్ర ప్రాంతంలో 25 ప్రయోగాత్మక గొట్టపు బావులను త్రవ్వడానికి ఈ పథకం క్రింధ తలపెట్ట బడింది. 1958–59 లో 15 ప్రయోగాత్మక గొట్టపు బావులు త్రవ్వ బడ్డాయి. ఈ సంవత్సరంలో రూ. 10.27 లక్షల మొత్తం పథకాన్ని కొనసాగించడానికి కేటాయించ బడింది. పవర్ డ్రిల్లు పథకాన్ని అమలుపరచడానికి ఈ పథకంక్రింద పవర్ డ్రిల్లును కొనడం, అసిస్టెంటు ఇంజనీర్లను నియమించడం జరుగుతుంది. సహాయకసిబ్బందికి, ఉపకరణాల తయారీ, మరమ్మతుల వర్కుషాపులను నెలకొల్పడానికి ఈ పథకంలో ఏర్పాటు ఉన్నది. దీనివల్ల కలిగే ప్రయోజనాలు ఈ జిల్లాకు కూడా లభ్యమౌతాయి.

## ఆర్టీజియన్ బావులను త్రవ్వడం కోసం ఋణాలను మంజూరు చేయడానికి సంబంధించిన పథకం

చేతితో ఉపయోగింప బడే బోరింగు సెట్లు, పవరు డ్రిల్లుల సహాయంతో ఆర్టీజియన్ బావులను త్రవ్వడం కోసం యీ పథకం క్రింద ప్రతి వ్యక్తికి రు.

4,500/—లు చొప్పున ఋణాలు మంజూరు చేయబడతాయి. 1959–60 ప్రణాళికలో రు. 1.04 లక్షల మొత్తం 35 ఆర్టిజియన్ బావులను త్రవ్వడం కోసం ఋణాలను మంజూరు చేసేటందుకు ప్రత్యేకించబడింది. ఇందులో రు 0.52 లక్ష యీజిల్లాలో 2 ఆర్టిజియన్ బావులను త్రవ్వుటకు ఋణాలను మంజూరు చేయడానికిగాను ప్రత్యేకించ బడింది.

### క్రొత్త బావుల సబ్సిడీ పథకం

వ్యవసాయోత్పత్తిని అధికం చేసేటందుకు నీటి పారుదల బావులను త్రవ్వుకొనేటందుకు రైతులకు సబ్సిడీ రూపంలో ఈ పథకంక్రింద బావి ఒక్కింటికి రూ. 750లు చొప్పున ఇవ్వబడుతుంది. 1959–60లో ఆంధ్ర ప్రాంతంలో 1,750 బావులను త్రవ్వడానికిగాను సబ్సిడీలక్రింద రూ.13.125 లక్షల మొత్తం కేటాయించ బడింది. పై కేటాయింపులో, రూ. 0.375 లక్ష మొత్తం 50 బావులను త్రవ్వడానికిగాను ఈ జిల్లాకు కేటాయించ బడింది.

### చిన్న తరహా నీటి పారుదల అభివృద్ధి పనుల పథకం

ఈ జిల్లాలో, ప్రత్యేకించి ప్రభుత్వం వారు స్వాధీన పరుచుకొన్న ఎస్టేట్లలో ఉన్న, పాడుపడిన, గండ్లు పడిన చిన్న చెరువులను పునరుద్ధరించి, అభివృద్ధిపరచే ఉద్దేశంతో రూ. 1.25 లక్షల మొత్తం, చిన్నతరహా నీటిపారుదల పనుల పునరుద్ధరణకు, అభివృద్ధికి ఈ జిల్లాకు కేటాయించ బడింది.

## భూమి అభివృద్ధి

### ట్రాక్టర్లు, బుల్ డోజర్లతో భూమిని బాగుచేయడానికి పథకం

బుల్ డోజర్ల గిరాకీ ఎక్కువగా వుండడం వల్ల, రైతులకు అద్దెకు ఇవ్వడానికి గాను రెండవ ప్రణాళికలో బుల్ డోజర్లను కొనడానికి తలపెట్టబడింది. విదేశీమారకం ద్రవ్యం ఇబ్బందివల్ల ఇంతవరకు బుల్ డోజర్లను కొనడానికి వీలు లేక పోయింది. అయితే ఈ సంవత్సరం 5 బుల్ డోజర్లను కొనడానికి తల పెట్ట బడింది. అందుకోసం ప్రణాళికలో రూ. 5.30 లక్షల మొత్తం కేటాయించ బడింది. అవి ఈ జిల్లాలోని రైతులకు కూడా అద్దెకు లభ్యమౌతాయి.

# పశు గణాభివృద్ధి

## కీలక గ్రామ పథకం

పశుగణాభివృద్ధి కోసం ఎంపిక చేయబడ్డ ప్రాంతాలలో కట్టుదిట్టమైన కృషి జరిపేటందుకు ఈ పథకం క్రింద ఉద్దేశింపబడింది. ఆబోతులకు విత్తుకొట్టడం, కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రాల అజ్మాయిషీ క్రింద దూడల పెంపకం, సబ్సిడీ మీద దూడలను పోషించడం, సహకార పద్ధతుల మీద పశు గ్రాసపు పంటలను అభివృద్ధి పరచడం ఈ పథకంలో చేరి ఉంటాయి. 1957–59లలో ఆంధ్ర దేశంలో 10 కీలక గ్రామ కేంద్రాలు స్థాపించబడ్డాయి. మరో 9 కేంద్రాలను స్థాపించడానికి, ఇదివరకే ప్రారంభింప బడిన కేంద్రాలను కొనసాగించడానికి ప్రతిపాదింప బడింది. అందుకోసం 1959–60 ప్రణాళికలో రూ. 11.107 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈమొత్తంలో రూ.0.900లక్ష ఈ జిల్లాలో కొత్తగాఒకకీలక గ్రామ కేంద్రాన్ని స్థాపించడానికి, ఒక పట్టణ కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రాన్ని స్థాపించడానికి, పాత కేంద్రాన్ని కొనసాగించడానికి గాను ప్రత్యేకించబడింది.

## జిల్లా రాజ్య పశు ప్రదర్శనాలు

పశువులను పెంచే వారిలో ఉత్సాహాన్ని రేకెత్తించేటందుకు, శాస్త్రీయ పద్ధతులలో దూడలను పెంచడం, పోషించడం గురించి ప్రజలకు తెలియ జెప్పడానికి గాను రాజ్య ప్రదర్శనాలను, జిల్లా ప్రదర్శనాలను ఏర్పాటు చేయడంకోసం ఈ పథకం ఉద్దేశించబడింది. 1959–60లో 6 ప్రదర్శనాలను జరపడానికి ఈ జిల్లాకు రూ. 0.036లక్ష మొత్తం కేటాయించబడింది.

## కోళ్ల పెంపకపు విస్తరణ అభివృద్ధి కేంద్రాలు

భారతప్రభుత్వంవారు ప్రారంభించిన పైలెట్ ప్రాజెక్టుఅభివృద్ధి పథకంక్రింద ఆంధ్ర ప్రాంతంలో 1957–59 లలో 12 కోళ్ల పెంపకపు విస్తరణ కేంద్రాలు ప్రారంభించబడ్డాయి. ఇదివరకే ప్రారంభింపబడిన కేంద్రాలను కొనసాగించడమే కాకుండ 1959–60 లో మరి 4 విస్తరణ కేంద్రాలను ప్రారంభించ

డానికి కూడా తలపెట్టబడింది, అందుకు ప్రణాళికలో రూ. 2.76 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రూ. 0.587 లక్ష మొత్తం ఒక విస్తరణ కేంద్రాన్ని కొత్తగా స్థాపించడానికి, పాత కేంద్రాన్ని కొనసాగించడానికి గాను ఈ జిల్లాకు కేటాయించబడింది.

## వివిధరకాల పశువుల సరఫరా

స్థానికంగాఉండే పశుగణాన్ని అభివృద్ధిపరచే ఉద్దేశంతో రెండవ ప్రణాళికా కాలంలో రైతులకు తగ్గింపు రేట్లకు అంటే అసలుఖరీదులో సగానికి ఆబోతులను, దున్నపోతులను, మేకలను, మేకపోతులను, పందులను, పోతుపందులను పొట్టేళ్లను, విదేశీ కోడిపుంజుల్ని, పెట్టల్ని గ్రుడ్లను పంపిణీచేయడానికి ఉద్దేశింపబడింది. 1959–60లో ఈ జిల్లాలో పంచదలచిన పశువుల సంఖ్య, అందుకు కేటాయించిన డబ్బు వివరాలు ఈ దిగువ తెలుపబడ్డాయి.

| | సంఖ్య | కేటాయించిన మొత్తం (రూ. లక్షలలో) |
|---|---|---|
| 1. ఆబోతుల సరఫరా | 9 | 0.0945 |
| 2. దున్నపోతులు | 10 | 0.105 |
| 3. మేక పోతులు | 3 | 0.009 |
| 4. ఆడమేకలు | 9 | 0.008 |
| 5. పోతు పందులు | 5 | 0.0133 |
| 6. ఆడపందులు | 3 | 0.003 |
| 7. పొట్టేళ్లు | 6 | 0.005 |
| 8. విదేశీ కోడిపుంజులు | 170 | 0.020 |
| 9. విదేశీ కోడిపెట్టలు | 170 | 0.020 |
| 10. విదేశీజాతి గ్రుడ్లు | 400 | 0.004 |

## ఉన్ని ప్రదర్శన యూనిట్ల ఏర్పాటు

ప్రస్తుతం అనంతపురం, నెల్లూరు, కాకినాడలలో మూడు ఉన్ని ప్రదర్శన యూనిట్లు పని చేస్తున్నాయి. గొర్రెలను మేపడం, పెంచడం, నిర్వహించడానికి

సంబంధించిన విషయాలను గురించి యీ యూనిట్లు ప్రచారం చేస్తాయి. ప్రతి యూనిట్టు ఒక అసిస్టెంటు సర్జను, ఇద్దరు స్టాక్ మెన్‌ల అజమాయిషీక్రింద నిర్వహింపబడు తున్నది. 1959–60 లో ప్రస్తుతమున్న మూడు యూనిట్లకు అదనపు సిబ్బందిని నియమించడానికి, నంద్యాల, విజయవాడ, విశాఖపట్టణం, ఆదోని పట్టణాలలో యింకా 4 క్రొత్త యూనిట్లను ఏర్పాటు చేయడానికి, యింతేకాక అదనంగా మినిస్టీరియల్ సిబ్బందిని నియమించడంద్వారా షీప్ అండ్ గోట్ డెవలప్‌మెంట్ ఆఫీసర్ కార్యాలయాన్ని పటిష్ఠం చేయడానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు గాను 1959–60 ప్రణాళికలో రు. 0.94 లక్ష కేటాయించ బడింది. ఇందులో రు. 0.052 లక్ష యీ జిల్లాకు కేటాయించ బడింది.

## జిల్లా పశువైద్య శాఖ కార్యాలయాల్లోను, ప్రధాన కార్యాలయంలోను అదనపు సిబ్బంది నియామకం

పని ఎక్కువ కావడం వల్ల అవసరమైన అదనపు సిబ్బందిని ప్రధాన కార్యాలయంలోను, చింతలదీవి ప్రభుత్వ పశుగణ క్షేత్రంతో సహా జిల్లా పశువైద్యశాఖ కార్యాలయాల్లోను నియమించడానికి తల పెట్టబడింది. అందుకు 1959–60 ప్రణాళికలో రూ. 0.72 లక్ష మొత్తం కేటాయించబడింది. ఆ మొత్తంలో ఈ జిల్లాకు రూ. 0.052 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## గాళ్ళ వ్యాధి నిర్మూలనా పథకం

దేశంలో గాళ్ల వ్యాధిని నిర్మూలించే ఉద్దేశంతో భారత ప్రభుత్వం వారు వ్యాధిరాకుండా పశువులన్నిటికి టీకాలు వేయడానికి ఒక పథకాన్ని ప్రారంభించారు. ఈ టీకాల ఉద్యమం ద్వారా టీకాలు వేయబడకుండా మిగిలిపోయిన పశువులకోసం గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, అనంతపురం, కర్నూలు జిల్లాలలో టీకాలు వేయడానికి మరొక పథకం క్రిందా మంజూరు చేయబడింది. ఆ చరణలో ఎదురయ్యే చిక్కులు, మందు దొరకకపోవడం వంటి వాటి కారణంగా యీ పని పూర్తి చేయడానికి వీలు లేకపోయింది. అందువల్ల యీ తదుపరి ఉద్య

మాన్ని పై జిల్లాలలో కొనసాగించడానికి, మామూలు టీకాల ఉద్యమం ఈ సంవత్సరం పూర్తి కాగలదని ఆశింపబడుతున్న కృష్ణానదికి ఉత్తర భాగపు జిల్లాలలో కూడా దీనిని ప్రారంభించడానికి తలపెట్టబడింది. ఈ పథకాన్ని అమలు పరచేటందుకు 1959–60 ప్రణాళికలో రూ. 1.95 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0 297 లక్ష ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## క్లినికల్ లేబరేటరీలను స్థాపించడం

రసాయనిక పరీక్షల ద్వారా సకాలంలో వ్యాధులను కనిపెట్టి నిర్ధారణ చేయడం కోసం జిల్లా ప్రధాన పశు వైద్య ఆసుపత్రులలోను, రాజ్యంలోని పశుగణాభివృద్ధి క్షేత్రాలలోను క్లినికల్ లేబరేటరీలను ఏర్పాటు చేయడానికి ప్రతిపాదింప బడింది. 1957–58లో విశాఖపట్టణం, కాకినాడ, నెల్లూరు, చిత్తూరు, కర్నూలులలో ఉన్నప్రధాన పశు వైద్య ఆసుపత్రులలో 5 క్లినికల్ లేబరేటరీలు ఏర్పాటు చేయబడినాయి. 1959–60లో పశ్చిమ గోదావరి, కృష్ణ, అనంతపురం జిల్లాలలో యింకా 3 క్లినికల్ లేబరేటరీలను ఏర్పాటుచేయడానికి, యింతకు ముందు ప్రారంభించబడిన పాతలేబరేటరీలను కొనసాగించడానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 0.89 లక్ష కేటాయించ బడింది. ఇందులో రు. 0.034 లక్ష ఈ జిలాకు ప్రత్యేకించబడింది.

## సంచార పశువైద్యదళాలు, ప్రథమ చికిత్సా కేంద్రాలు, చిన్న తరహా పశువైద్య శాలలు, పశు వైద్య కేంద్రాలు

గ్రామీణ ప్రాంతాలలోను, పట్టణ ప్రాంతాలలోను పశువులకు ఉత్తమ వైద్యసహాయాన్ని కలుగ జేయడానికి, అంటు వ్యాధులను కట్టుదిట్టంగా నివారించడానికి కూడా ఈ పథకాలు ఉద్దేశింప బడ్డాయి. 1959–60 సంవత్సరంలో ఇది వరకే ప్రారంభించ బడిన పాతవైద్యశాలలను, సంచారవైద్యదళాలను ప్రథమ చికిత్సా కేంద్రాలను కొనసాగించడమే కాకుండా ఈ జిల్లాలో రూ. 0 528 లక్ష వ్యయంతో 5 పశు ప్రథమ చికిత్సాకేంద్రాలను, రెండు

చిన్నతరహా పశువైద్యశాలలను ఒక పశువైద్య కేంద్రాన్ని ప్రారంభించడానికి తలపెట్టబడింది.

### పెద్ద తరహా పశువైద్యశాలల్లో లోయరు డివిజను గుమస్తాల నియామకం

1958–59లో నియమింప బడిన9 లోయర్ డివిజను గుమస్తాల ఉద్యోగాలను కొనసాగించడానికి 1959–60 ప్రణాళికలో రూ. 0.08 లక్ష మొత్తం కేటాయించబడింది. అందులో రూ.0 01 లక్ష ఒక లోయరు డివిజను గుమస్తాను కొనసాగించడానికి ఈ జిల్లాకు కేటాయించబడింది.

### జిల్లా వెటర్నరీ ఉద్యోగులకు జీపులు

పనిని తనఖీ చేయడానికి, సిబ్బందిని సిద్ధంగా ఉంచేటందుకు తరుచుగాను, హాటాత్తుగాను జిల్లా వెటర్నరీ ఉద్యోగులు వెళ్లి చూడ్డానికి వీలుగా ఉండేటందుకు జిల్లా వెటర్నరీ ఉద్యోగులకు జీపులుండడం అవసరం. అందుచేత 1959–60 ప్రణాళికలో రూ. 0.54 లక్ష మొత్తం కేటాయించబడింది. అందులో రూ. 0 141 లక్ష మొత్తం ఇదివరకే సరఫరా చేయబడిన జీపు నిర్వహణకుగాను ఈ జిల్లాకు కేటాయించ బడింది.

### వెటిరినరి కాంపౌండర్లకు శిక్షణ

వెటిరినరీ కాంపౌండర్ల కొరతను తీర్చటం కోసం 1959–60లో 360 మంది అభ్యర్థులకు 6 శిక్షణ కేంద్రాలలో రెండు జట్లుగా శిక్షణ యివ్వటానికి ప్రతిపాదింప బడింది. ప్రతి కేంద్రంలోను 60 మందికి శిక్షణ యివ్వబడుతుంది. ఈ పథకానికి గాను 1959–60 సంవత్సరానికి చేయబడిన కేటాయింపు మొత్తం రు. 0.50 లక్షలో రు. 0.09 లక్ష యీ జిల్లాలో 60 మందికి శిక్షణ యివ్వడం కోసం ప్రత్యేకించబడింది.

### పందుల పెంపకం

ఈ పథకం క్రింద, ఆంధ్ర ప్రాంతంలో మూడు పందుల పెంపకపు అభివృద్ధి బ్లాకులతో ఒక ప్రాంతీయ పందుల పెంపకపు యూనిటు జాతిపందుల పెంపకం కోసం స్థాపించబడింది. ఈ యూనిటు లాభదాయకమైన పందుల పెంపకంగురించి రైతులకు తెలియ జెప్పడానికి ఒక నమూనా కేంద్రంగా పనిచేస్తుంది. 1959–60లో ఆంధ్రలో మర్రి 6 పందుల పెంపకపు అభివృద్ధి కేంద్రాలను స్థాపించడానికి తలపెట్టబడింది. అందులో రెండు కేంద్రాలు ఈ జిల్లాలో స్థాపించ బడుతాయి. అందుకోసం రూ. 0.20 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## రీజినల్ డిప్యూటీ డైరెక్టరు నియామకం

పశుగణాభివృద్ధిశాఖ యొక్క అభివృద్ధికార్యక్రమాలు రోజురోజుకు ఎక్కువయి పోతున్నాయి. రెండవ ప్రణాళిక క్రింద కూడ వివిధ పథకాలను బ్లాకు ప్రాంతాల్లోనే కాక ఇతర ప్రదేశాలలోకూడ అమలు పరచవలసిన బాధ్యత జిల్లా పశువైద్యశాఖాధికార్లది. పశుగణాభివృద్ధి శాఖ యొక్క వివిధకార్యక్రమాలమధ్య సమన్వయం చేకూర్చడానికి, ప్రణాళిక పథకాలు మొదలయిన వాటిని అమలు పరచడంలో జిల్లా పశువైద్య శాఖాధికార్లకు, యితర సిబ్బందికి సలహాల నిచ్చేటందుకు గాను రీజనల్ డిప్యూటీ డైరెక్టరును నియమించాలని తలపెట్టబడింది.

ఈ ఉద్దేశంతో రీజినల్ డిప్యూటీ డైరెక్టరు నియామకానికి మంజూరు యివ్వబడింది. రాజమండ్రిలో రీజనల్ డిప్యూటీ డైరెక్టరు ప్రధాన కార్యాలయాన్ని ఏర్పాటు చేయడానికి ప్రతిపాదింప బడింది. ఈ పథకానికయ్యే వ్యయం క్రింద 1959-60 సంవత్సరానికి ఈ జిల్లాకు రు. 0.39 లక్ష కేటాయించ బడింది.

## కేంద్ర కోళ్ళపెంపక క్షేత్రం

కోళ్ళ అభివృద్ధికి సంబంధించిన అన్ని సమస్యలను పరిశీలించడం కోసం ఈ పథకం క్రింద కాకినాడలో కోళ్ళ పెంపకానికి సంబంధించిన కేంద్ర పరిశోధన క్షేత్రం ఒకటి ప్రారంభించడానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు ప్రణాళికలో రు. 1.00 లక్ష కేటాయించ బడింది.

# అడవులు

## ఏజన్సీ అడవుల్లో రోడ్లు

ఆంధ్రలోని ఏజన్సీ ప్రాంతాల్లో రోడ్లను అభివృద్ధి పరచడానికి ఈ పథకం ఉద్దేశించ బడింది. 1959-60 సం. లో 77½ మైళ్ళ పొడవున రోడ్లను వేయడానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు ప్రణాళికలో రు. 3.97 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.67 లక్ష ఈ జిల్లాలో 16½ మైళ్ళ పొడవున రోడ్లను వేయ డానికి గాను ప్రత్యేకించ బడింది.

### ఏజన్సీ ప్రాంతాల్లో భవనాలు

ఎస్టేటు అడవుల మీద సరియైన నియంత్రణ జరగడానికి, అడవుల్లో చెట్లను అక్రమంగా పడగొట్టడాన్ని నిరోధించే టందుకు వీలుకలిగించే నిమిత్తం ఏజెన్సీ ప్రాంతాల్లో పనిచేస్తున్న అటవీశాఖకు చెందిన ఆఫీసర్లకు, తాబేదారి సిబ్బందికి 16 వసతి గృహాలను నిర్మించే నిమిత్తం 1959–60 సంవత్సరానికిరు. 0.785 లక్ష కేటాయించ బడింది.

### కలప రవాణా నియమావళి

కలపను దొంగి రవాణా చేయకుండా నివారించడానికిగాను కలపను ఒక చోటనుండి మరొక చోటకు చేర వేయడం మీద కట్టుదిట్టమైన పర్యవేక్షణ జరప డానికి ఈ పథకం ఉద్దేశింపబడింది. 1959–60లో ఆంధ్ర ప్రాంతపు డివిజన్లు అన్నిటిలోను లోను 80 మంది తానాదార్లు నియమింప బడతారు. ఇందుకు ప్రణాళికలో రూ. 0.85 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఆ మొత్తంలో రూ. 0.0262 లక్ష మొత్తం 6 మంది తానాదార్ల నియామకానికిగాను ఈ జిల్లాకు కేటాయించ బడింది.

## మత్స్య పరిశ్రమ

### అధికంగా చేప పిల్లలను సేకరించడం, పంపిణీ చేయడం.

చేప పిల్లలను, అందులోను త్వరితంగా పెరిగే వాటిని, అవి సమృద్ధిగా దొరికే గోదావరి కృష్ణానదుల నుండి, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు డెల్టా జిల్లాలలోని నీటి పారుదల కాలవల నుండి సేకరించి మత్స్య ఉత్పత్తిని అధికం చేయడానికి గాను రాజ్యంలోని జలాశయాల్లో నిల్వ చేయడానికి ఈ పథకం ఉద్దేశిస్తున్నది. 1957–58లో కొంత అదనపు సిబ్బం దిని నియమించడమే కాకుండా, సేకరణ కేంద్రాల నుండి నిల్వచేసే ప్రాంతాలకు చేరవేసేటందుకు 12 వ్యాన్లు కొనబడ్డాయి. ప్రస్తుతం ఉన్న సిబ్బందితోను, వ్యానులతోను 1959–60లో రెండు కోట్ల చేప పిల్లల్ని సేకరించడానికి తల పెట్టబడింది. అందుకోసం ప్రణాళికలో రూ. 1.93 లక్షల మొత్తం కేటా యించ బడింది. అందులో రూ. 0.50 లక్ష మొత్తం 50 లక్షల చేప పిల్లల్ని సేకరించడానికి గాను ఈ జిల్లాకు కేటాయించబడింది.

## చేపల మార్కెట్లు

రాజ్యంలోని చేపల మార్కెట్లలో ఎక్కువ భాగం పారిశుద్ధ్యమనేదే లేని పరిస్థితులలో అసహ్యాకరంగా ఉండే ప్రదేశాలలో ఉన్నాయి. పరిశుభ్రంగా చేపల మార్కెట్లను నిర్మించడం, నిర్వహించడం మామూలుగా లోకల్ బోర్డులు, మున్సిపాలిటీల బాధ్యతే అయినప్పటికీ వాటి ఆదాయ మార్గాలు తక్కువగా ఉండడంవల్ల వాటికి సబ్సిడీలను ఇచ్చి స్థానిక సంస్థలకు వాటి నిర్మాణం విషయంలో సహాయ పడడానికి తలపెట్టబడింది. 1959–60లో ఆంధ్ర ప్రాంతంలో 5 పెద్ద చేపల మార్కెట్లను, 5 చిన్న వాటిని నిర్మించడానికి లోకలు బోర్డులకు, మున్సిపాలిటీలకు సబ్సిడీ ఇవ్వడానికి గాను రూ. 1.23 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో ఈ జిల్లాలో ఒక మార్కెటు నిర్మాణానికి ప్రభుత్వం ద్రవ్య సహాయం చేస్తుంది.

## ఉప్పు సబ్సిడీ పథకం

అవసరానికి మించి లభ్యమయ్యే చేపలను పరిశుభ్రమైన పరిస్థితులలో నిలువ చేసుకొనేటందుకు బెస్తవారికి యీ పథకం క్రింద ఉప్పు తగ్గింపుధరలకు సరఫరా చేయబడుతున్నది. ఇందువల్ల వారు తమ కష్టానికి తగిన ప్రతిఫలం పొందడానికి వీలు చేకూరుతుంది. ప్రస్తుతం ఆంధ్రలోని కోస్తా జిల్లాలలో చేపలను శుభ్రపరిచే కేంద్రాలు 14 ఉన్నాయి. 1959–60లో వీటిని కొనసాగించడానికి ప్రతిపాదింపబడింది. ఇందుకు రు. 0.53 లక్ష ఖర్చవుతుంది. ఇందులో రు. 0.10 లక్ష యీ జిల్లాలో 600 టన్నుల చేపలను శుభ్రపరచడానికి గాను ప్రత్యేకించబడింది.

## మరనావల సరఫరా

బెస్తవారు తీరానికి దూరంగా అతిత్వరితంగా పోయి ఎక్కువగా చేపలు పట్టుకోవడానికి వీలుగా ఉండేటందుకు తగ్గింపు రేట్లకు అంటే అసలు ఖరీదులో 66 వంతుకు 1959–60లో రూ. 4.33 లక్షల వ్యయంతో బెస్తవారికి, వారి సహకార సంఘాలకు 21 ఇంజన్లు అమర్చబడిన నావలు ఈ పథకం క్రింద పంచి

పెట్టడానికి ఉద్దేశింప బడింది. ఈ 21 నావల్లో 10 నా వలు ఈ జిల్లాలో పంచి పెట్టబడతాయి.

## కొత్తరకం నైలాను వలలు

ప్రస్తుతం బెస్తలు ప్రత్తితోను, జనుముతోను చేసిన వలలను వాడుతున్నారు. ఇవి అంత మన్నికగా లేవు. తరచు చేపలు వలలు తెంపుకుని పోవడం కూడా జరుగుతున్నది. తత్ఫలితంగా బెస్తలు వారు పడ్డ శ్రమకు తగిన ఫలితం పొందడం లేదు. నైలాను వలలు బాగా పని చేస్తున్నట్లు కనుగొనబడింది. అందువల్ల 200 నైలాను వలలను అసలు ఖరీదుతో 33⅓%కు 1959–60లో బెస్తలకు పంపకం చేయడానికి ఉద్దేశింప బడింది. వీటి ఖరీదు చేపలు పట్టని సీజను వదలి 5 సంవత్సరాల కాల పరిమితితో తేలిక వాయిదాలలో వారి నుండి వసూలు చేయబడుతుంది. ఆ 200 వలలలో 50 వలలు ఈ జిల్లాలో పంపిణీ చేయబడతాయి.

## బెస్తవారికి దుంగల సరఫరా

పేదరికంవల్ల, ఖరీదు అధికం కావడంవల్ల బెస్తలు తాము మొదట్నుంచి వాడుతున్న దుంగలు పాతవై పోయినప్పటికి క్రొత్తవాటిని కొనుక్కో లేక పోతున్నారు. అందువల్ల అసలు ఖరీదులో 75 శాతానికి 1959-60లో320 దుంగలను ఈ పథకం క్రింద పంపిణీ చేయడానికి ఉద్దేశింప బడింది. ఈ ఖరీదు 5 సంవత్సరాల కాల పరిమితితో తేలిక వాయిదాల మీద వసూలు చేయబడుతుంది. అందులో 60 దుంగలు ఈ జిల్లాలో పంపిణీ చేయబడతాయి.

## చెరువులలో చేపల అభివృద్ధికి సంబంధించిన పథకం

ప్రభుత్వానికిచెందిన చెరువులలో సర్వేజరిపిన మీదట శాస్త్రీయ పద్ధతులలో చేపలను పెంచడానికి యీపథకం ఉద్దేశించబడింది. ఎప్పుడూ నీరుఉండే చెరువుల్లో చేపలను నిలువచేసి తద్వారా వాటి ఉత్పత్తిని అధికం చేయడానికి ప్రతిపాదింపబడింది. 200 చెరువులను సర్వేచేసి వాటిలో చేపలను అభివృద్ధి చేయడం కోసం ప్రణాళికలో యీ సంవత్సరానికి రు. 1.23 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో 100 చెరువులు యీ జిల్లాలో అభివృద్ధి చేయబడతాయి.

### బెస్త వారికి శిక్షణ కేంద్రం

కోస్తా ప్రాంతాలలో ఉండే బెస్తవారు యంత్రాలమర్చిన పడవలను నడు పుటలో శిక్షణపొందినట్టివారు కారు. ఈకారణంగా సముద్రాల్లో చేపలుపట్టడానికి వెళ్లే బెస్తవారికి తడవకు 20 మందికి చొప్పున రెండు తడవలుగా కాకినాడలో శిక్షణ యివ్వడానికి ప్రతిపాదింపబడింది. 1958-59లో 20 మంది బెస్త వారికి కాకినాడలోని శిక్షణ కేంద్రంలో శిక్షణ యివ్వబడింది. ఇంకా 40 మంది బెస్త వారికి శిక్షణ యివ్వడం కోసం 1959-60 సంవత్సరానికి రు. 0.68 లక్ష కేటా యించబడింది.

### పడవల నిర్మాణపు కేంద్రం

చిన్న పడవలను నిర్మించేటందుకు ప్రస్తుతం రాజ్యంలో ఏ విధమైన నిర్మాణ కేంద్రం గాని లేదు పడవలను ఎక్కువ చేయడం పడవలకు యంత్రాలను-సమ కూర్చడం వల్ల ఎక్కువగా కావలసిన పడవల అవసరాలను తీర్చడానికి, తూర్పు గోదావరి జిల్లాలో రూ. 1.00 లక్ష వ్యయంతో 1958-59లో ఒక నిర్మాణ కేంద్రం నెలకొల్పబడింది. ఈ సంవత్సరంలో రూ. 1.00 లక్ష మొత్తం, ఈ కేంద్రాన్ని నిర్వహించడానికి, 60 పడవలను తయారు చేయడానికి ప్రణాళికలో కేటాయించ బడింది. అందులో 12 పడవలు ఈ జిల్లాకు సరఫరా చేయబడ తాయి.

### త్వరిత రవాణా సౌకర్యాలు

పట్టిన చేపలు ఎక్కువభాగం చెడిపోకుండా నివారించేటందుకు 1957-59 లలో 10 వ్యానులు, 2 కారియర్ పడవలు కొనబడ్డాయి. ప్రస్తుతం రవాణా సౌకర్యాలు లేని రోడ్డుమీద నడపబడే ఈ వ్యానులకు ప్రతి సంవత్సరం అయ్యే ఖర్చుకోసం 1959-60లో రూ. 1.00 లక్ష మొత్తం ప్రత్యేకించబడింది. ఆ 14 వ్యానులలోను ఒకటి ఈ జిల్లాకు లభ్యమౌతుంది.

## సహకారం గిడ్డంగులు మార్కెట్లు

### గ్రామీణ పరపతి సంఘాల విస్తరణ

ఇది కొనసాగుతూ వస్తున్న పథకం. అఖిల భారత గ్రామీణ పరపతి పరి శీలన సంఘం వారి సిఫార్సులకు అనుగుణంగా రాజ్యంలోని గ్రామీణ పరపతి సం

ఘాలను పునర్వ్యవస్థీకరించడం, పటిష్ఠంచేయడం, విస్తరింపచేయడం యీపథకం యొక్క ఉద్దేశాలు. సహకార శాఖలో సిబ్బందిని పటిష్ఠం చేయడం, సెంట్రల్ బ్యాంకులు, పెద్దతరహా సంఘాలు నియమించిన అదనపు పర్యవేక్షక నిర్వాహక సిబ్బందికయ్యే ఖర్చుకు ద్రవ్య సహాయం చేయడం ద్వారా రెండవ ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాలలో యీ పథకం అమలు పరచ బడింది.

సహకార సంఘాలు గ్రామీణ ప్రజల నాధారంగా చేసికొని నిర్వహింప బడాలనే సహకార విధానానికి సంబంధించిన జాతీయాభివృద్ధి మండలి తీర్మానం దృష్ట్యా ఈ సంవత్సరంలో అదనంగా పెద్ద తరహా సంఘాలు, గ్రామీణబ్యాంకులు స్థాపింప బడవు కాని ఆంధ్ర ప్రాంతంలో ప్రస్తుతం వున్న 500 చిన్న సంఘాలను పటిష్ఠం చేయడమే కాకుండా క్రొత్తగా 350 చిన్న తరహా సంఘాలను కూడ ఏర్పాటుచేయడానికి ఉద్దేశింపబడింది. నూటికి 82 గ్రామాలు, నూటికి 38 మంది గ్రామీణ ప్రజలు ఈ పథకం క్రిందకు ఈ సంవత్సరం తీసికొనిరాబడతారు. స్వల్ప కాలిక, మధ్యకాలిక ఋణాలు కూడా ఇవ్వబడతాయి. రు. 1,020 లక్షల వరకు స్వల్ప కాలిక ఋణాలు, రు. 100 లక్షల వరకు మధ్య కాలిక ఋణాలు ఇవ్వబడతాయి. పరిపాలన శాఖనుండి ఆడిటుశాఖను వేరుచేయాలనే పథకాన్ని అమలు పరచడానికి కూడా ఈ సంవత్సరం ఉద్దేశింపబడింది. రిజిస్ట్రారుకు ఆర్థిక సలహాదారు అని వ్యవహరింపబడే ఒక జాయింటు రిజిస్ట్రారు కూడా హెడ్ క్వార్టర్సులో నియమింపబడతారు. ఆయన గ్రామీణ పరపతి పథకంపై ప్రత్యేకంగా అజ్మాయిషీ వహిస్తారు.

ఈ జిల్లాలో అమలు జరుపబడే కార్యక్రమం క్రింది విధంగా ఉంటుంది. 100 క్రొత్త చిన్నతరహా సంఘాలు ఏర్పాటుచేయబడతాయి. ప్రస్తుతమున్న 34 చిన్నతరహా సంఘాలను పటిష్ఠంచేయడం, పాత సంఘాలలో 13,600 మంది సభ్యులను, క్రొత్త సంఘాలలో 5,000మంది సభ్యులను చేర్పించడం, రు. 170 లక్షల వరకు స్వల్ప కాలిక ఋణాలను, రు. 20 లక్షలవరకు మధ్యకాలిక ఋణాలను ఇవ్వడం జరుగుతుంది

పై కార్యక్రమాన్ని అమలు పరచడానికి రు. 1, 18,504 ల మొత్తం ఈ జిల్లాకు కేటాయించ బడింది. ఆ మొత్తం ఈ క్రింది విధంగా వినియోగింప బడుతుంది.

| | | |
|---|---|---|
| | | రూపాయలు |
| 1. | చిన్నతరహా సంఘాలకు సబ్సిడీలు | |
| (ఎ) | 1958–59లో ప్రారంభించబడిన సంఘాలు | 5,300 |
| (బి) | 1959–60లో ఏర్పాటుచేయబడే క్రొత్త సంఘాలు | 4,000 |
| 2. (ఎ) | పెద్దతరహాసంఘాలకు సబ్సిడీ | 12,000 |
| (బి) | గ్రామీణ బ్యాంకుల కోసం సీనియర్ ఇనస్పెక్టర్లకయ్యే ఖర్చు | 3,500 |
| 3. | ఈ క్రింది వాటికిగాను సెంట్రల్ బ్యాంకులకు సబ్సిడీ | |
| (ఎ) | ఇది వరకు నియమించ బడిన పాత సూపరు వైజర్లు | 12,000 |
| (బి) | 1959–60 లలో నియమించబడే క్రొత్తసూపరువైజర్లు | 4,800 |
| 4. | అదనపు సిబ్బందికి ఖర్చు | |
| (ఎ) | ప్రణాళికలోని మొదటి రెండు సంవత్సరాలలో నియమించబడ్డ క్రెడిట్ సీనియరు ఇనస్పెక్టర్లు, జూనియరు ఇనస్పెక్టర్లు | 7,090 |
| (బి) | అమలాపురంలోని క్రొత్త సర్కిలుకు 1957–58లో నియమించబడిన సిబ్బంది | 26,500 |
| (సి) | కో–ఆపరేటివు సబ్ రిజిస్ట్రార్స్ ఫార్ క్రెడిట్ | 12,600 |
| (డి) | కో–ఆపరేటివు సబ్ రిజిస్ట్రారులు (సి. డి.), టైపిస్టులు, జవానులు | 15,900 |
| (ఇ) | ఆడిట్టును వేరు చేయడానికి సిబ్బంది | 8,344 |
| (ఎఫ్) | 1959–60 లో డిప్యూటీ రిజిస్ట్రార్ల సర్కిళ్లలో ప్రతి దానిలోను నియమించబడే ఒక్కొక్క జూనియర్ ఇనస్పెక్టరు | 3,670 |

(అ) మలాపురంలోని క్రొత్త సర్కిలుకు ఒక సీనియరు ఇనస్పెక్టరు, ఒక జూనియరు ఇనస్పెక్టరు — 2,800

మొత్తం 1,18,504

## భూమి తనఖా బ్యాంకుల అభివృద్ధి

భూమికి శాశ్వత అభివృద్ధిపనులు చేయడానికి, నీటిపారుదల సౌకర్యాలను ర్పాటు చేసుకోవడానికి, బాగుచేయడానికి, తదితర పనులకు ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులద్వారా 25 సంవత్సరాలలో చెల్లించుకోదగ్గ వీలుండే దీర్ఘ కాలిక ఋణాలును ఇవ్వడం ఈ పథకం యొక్క ఉద్దేశం, ఈ సంవత్సరం రు. 24.00 లక్షల వరకు ఈ జిల్లాలో దీర్ఘ కాలిక ఋణాలు ఇవ్వబడతాయి. ఈ సంవత్సరం ఈ జిల్లాకు కేటాయించిన రు. 3,400 ల మొత్తం ఈ క్రింది విధంగా వినియోగింప బడుతుంది.

| | | రూపాయలలో |
|---|---|---|
| 1. | ప్రణాళికలోని మొదటి మూడు సంవత్సరాలలో ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులలో నియమింప బడిన అదనపు సూపరువైజర్ల కయ్యే ఖర్చు | 1,200 |
| 2. | ఈ సంవత్సరంలో నియమింపబడే అదనపు సూపరువైజర్లకయ్యే ఖర్చు. | 2,200 |
| | మొత్తం | 3,400 |

## సహకార పద్ధతులపై క్రయవిక్రియాల అభివృద్ధి

ఇది కొనసాగుతూ వస్తున్న పథకం. సహకార పద్ధతులపై వ్యవసాయోత్పత్తుల క్రియవిక్రయాలను అభివృద్ధి పరచడానికి ఉద్దేశింపబడింది. వ్యవసాయ దారులకు, ప్రత్యేకించి చిన్నరకం, మధ్య రకం ఉత్పత్తి దార్లకు ఈ పథకం క్రింద

స్టోరేజి, గిడ్డంగి, మార్కెటింగు సౌకర్యాలు కలుగచేయడమే యీ పథకం యొక్క లక్ష్యం. క్రియ విక్రయ సంఘాల ద్వారా రసాయనిక ఎరువులను అవసరమయ్యే ఇతర పదార్థాలను సరఫరా చేయడమే కాకుండా వ్యవసాయోత్పత్తులమీద రైతులకు స్వల్పకాలిక ఋణాలు కూడా ఇవ్వబడతాయి. గ్రామ స్థాయిలో ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘాలకు మండీ కేంద్రాలలో పని చేస్తున్న మార్కెటింగు సంఘాలకు సన్నిహిత సంబంధాల్ని చేకూర్చడానికి కూడా ఈ పథకం క్రింద ఉద్దేశించబడింది.

ఈపథకం యొక్క పై ఆశయాలనుసాధించడానికి రాజ్యప్రభుత్వపు వాటాతోను, శిక్షణపొందిన సిబ్బందితోను ప్రాథమికక్రయవిక్రయ సంఘాలనుపునర్వ్యవస్థీకరించడానికి, పటిష్టం చేయడానికి రెండవ ప్రణాళికలో ఏర్పాటు చేయబడింది. అంతే కాకుండా మండీ కేంద్రాలలో ప్రధాన గిడ్డంగులను, గ్రామస్థాయిలో సహాయక గిడ్డంగులను నిర్మించడానికి, ప్రత్తి జిన్నులు, నూనె మిల్లులు, చెరకు గానుగలు వంటి ప్రాసెసింగు యంత్రాలను స్థాపించటానికి, సంఘాలకు ఆర్థిక సహాయం చేయటానికి కూడ ఏర్పాటు చేయబడింది. ఈ సంవత్సరంలో ఈ జిల్లాలో అమలు జరుపబడే కార్యక్రమం ఈ క్రింద వివరింపబడింది.

(రూపాయలులక్షలలో)

| | | |
|---|---|---|
| 1. | వ్యవసాయోత్పత్తిపై ఋణాలను ఇవ్వడం | 80.0 |
| 2. | క్రయవిక్రయ సంఘాలచే నిర్మించబడే గిడ్డంగులు (సంఖ్య) | 8 |
| 3. | పెద్దతరహా సంఘాలచే నిర్మించబడే గిడ్డంగులు (సంఖ్య) | 6 |
| 4. | నెలకొల్పబడే ప్రాసెసింగు యంత్రాలు సంఖ్య | 1 |

పై కార్యక్రమాన్ని అమలు పరచడానికి ఈ జిల్లాకు రు. 5.299 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఈ దిగువ తెలిపిన విధముగా ఆ మొత్తం విని యోగింప బడుతుంది.

(రూ. లక్షలలో)

| | | |
|---|---|---|
| 1. | ప్రాథమిక క్రయవిక్రయ సంఘాలకు వాటా మూలధన విరాళం | 1.400 |
| 2. | జిల్లా క్రయ విక్రయ సంఘాలకు వాటా మూల ధన విరాళం | 0.400 |
| 3. | ప్రాథమిక క్రయ విక్రయ సంఘాలకు మేనేజీరియల్ సిబ్బంది నియామకానికి సబ్సిడీ | |
| (ఏ) | గత 3 సంవత్సరాలలో సిబ్బందిని నియమించిన సంఘాలకు | 0.095 |
| (బి) | 1959–60లో సిబ్బందినినియమించే సంఘాలకు | 0.094 |
| 4. | పెద్ద తరహా సంఘాలకు గిడ్డంగులు | |
| (ఏ) | గత సంవత్సరాలలో ప్రారంభించిన గిడ్డంగుల నిర్మాణాన్ని పూర్తి చేయడానికి | 0.560 |
| (బి) | 1959–60లో ప్రారంభింప బోయే క్రొత్త గిడ్డంగులు | 0.920 |
| 5. | క్రయవిక్రయ సంఘాలకు గిడ్డంగులు | |
| (ఏ) | పాత గిడ్డంగులను పూర్తి చేయడానికి | 1.050 |
| (బి) | క్రొత్త గిడ్డంగుల నిర్మాణానికి | 0.750 |
| 6. | ప్రోసెసింగు యంత్రాల స్థాపనకు | 0.030 |
| | మొత్తం | 5.299 |

## సహకార పద్ధతులపై కొబ్బరివ్యాపారం

భారత కేంద్ర కొబ్బరి సంఘమువారిచే ఈ పథకం సూచింపబడింది. కొబ్బరికాయలు అత్యధిక సంఖ్యలో ఉత్పత్తి అయ్యే తూర్పుగోదావరి జిల్లాలోని అమలాపురం, రాజోలు, కొత్తపేట తాలూకాలలో కొబ్బరి కాయల ఉత్పత్తిదారులకు సౌకర్యాలను కలిగించడానికి, స్టోరేజి, మార్కెటింగు సౌకర్యాల్ని కలిగించడానికిగాను మూడు కొబ్బరి సహకార సంఘాలను ఏర్పాటు చేయడానికి ఈ పథకం క్రింద ఉద్దేశించ బడింది ప్రతి సహకార సంఘం లోను కొబ్బరిని ఎండించే "చూల" యంత్రాన్ని నెలకొల్పటానికి, ఈ సంఘాల ఉపయోగం కోసం జింకురేకులతో కప్పువేసిన గిడ్డంగులను నిర్మించడానికి, ఈ సంఘాల నిర్వహణ కోసం కొంత సర్వహణ సిబ్బందిని నియమించడానికి కూడ ఈ పథకం క్రింద ఉద్దేశించబడింది. సిబ్బంది నియామకం మొదలయిన వాటికిగాను ఈ మూడు సంఘాలకు రు. 0.78 లక్షవరకు 1958–59 లో ఆర్థిక సహాయం చేయ బడింది. 1958–59లో నియమించబడిన సిబ్బందిని కొనసాగించడం కోసం ఈ సంవత్సరం ప్రణాళికలో రు. 0 19 లక్ష కేటాయించ బడింది.

## లేబరు కాంట్రాక్టు, ఫారెస్టు కూపు సహకార సంఘాలు

రెండవప్రణాళికాకాలంలో 15 లేబరుకంట్రాక్టు, 15 ఫారెస్టుకూపుసహకార సంఘాలను నిర్వహించడానికి లేక పునరుద్ధరించడానికి ఈ పథకం ఉద్దేశిస్తున్నది. 1957–59లలో ఋణాలు, సబ్సిడిలు రూపంలో ఆర్థిక సహాయం చేసి, రకానికి 5 సంఘాలు చొప్పున ఏర్పాటు చేయడం లేక అభివృద్ధి పరచడం జరిగింది 1959.60 లో లేబరు, గ్రాంటులు రూపంలో ఆర్థిక సహాయం కలగ జేసి 5 ఫారెస్టు కూపుసహకార సంఘాలను 6 లేబరు కాంట్రాక్టు సంఘాలను పునరుద్ధరించడానికి, పటిష్ఠం చేయడానికి ఉద్దేశింపబడింది. అందుకోసం రూ.0.47లక్ష మొత్తం ఈ సంవత్సరపు ప్రణాళికలో కేటాయించబడింది. అందులో రూ. 5,000లు రాజ్య స్థాయిలో నియమింపబడే సాంకేతిక సిబ్బందికయ్యే ఖర్చుకోసం ప్రత్యేకించబడింది. మిగిలిన మొత్తం 0.42 లక్షలో రూ. 3,200లు ఆర్థిక సహాయం చేయడానికి ఈ జిల్లాలో వినియోగింప బడతాయి. ఈ మొత్తం ఒక లేబరు కాం

ట్రాక్టు సంఘాన్ని పునరుద్ధరించడానికిగాను గ్రాంటుగా రూ. 1,200లు ఋణంగా రూ. 2,000లు ఇవ్వబడుతాయి.

## పరిశోధన, పరిశీలన, గణాంక వివరాలు

ఈ పథకం క్రింద సహకార శాఖలో ఒక ప్రత్యేక విభాగం ఏర్పాటు చేయబడుతుంది. సహకారశాఖ ద్వారా అమలు జరుపబడ్డ వివిధ పథకాలవల్ల ప్రజలకు కలిగిన లాభాలను, ఆ పథకాల నిర్వహణలో తెలియవచ్చిన లోటు పాట్లను పరిశీలించడానికి, సూత్రవిధానాలను రూపొందించటానికి, ఏవైనా లోటు పాట్లు ఉంటే వాటిని సరిదిద్దుకోనేటందుకు మార్గాన్ని సూచించటానికి ఈ విభాగం కృషి చేస్తుంది. 1957-58లో ఈ పథకం అమలు జరుపబడింది. గణాంక వివరాలను సేకరించి, సంకలనం చేయడం కోసం జిల్లాలలో 20 మంది సీనియరు ఇనస్పెక్టర్లను నియమించటం, ప్రధాన కార్యాలయంలో ఒక సెక్షను ఏర్పాటు చేయడం జరిగింది. ఈ పథకం 1957-59లో కూడా కొనసాగించబడింది. 1959-60లో, జిల్లాలోనిసిబ్బం దికి సలహాలనిచ్చి, అజ్మాయిషీ వహించడంకోసం రిజిస్ట్రారు ఆఫీసులో డిప్యూటీ రిజిస్ట్రారు గ్రేడులో ఒక స్టాటిస్టిషియనును, ఇద్దరు సీనియరు ఇన్స్పెక్టర్లను, ఇద్దరు జూనియర్ ఇన్స్పెక్టర్లను, ఇద్దరు జవానులను క్రొత్త సర్కిళ్ల కోసం 12 మంది సీనియర్ ఇన్స్పెక్టర్లను, ఒక్కొక్క సర్కిలు ఆఫీసుకు ఒక్కొ క్కరు చొప్పున 46 మంది లోయరు డివిజను గుమస్తాలను నియమించడానికి ఉద్దేశింపబడింది. క్రొత్త విధానాలను రూపొందించడానికి, వాటిని అమలు పెట్టడానికి కార్యక్రమాన్ని ఏర్పాటు చేయడానికి వీలుగా ఉండేటందుకు సహ కార శాఖలో పరిశోధన పరిశీలన ప్రచారం విభాగం కూడా నెల కొల్పబడింది. ప్రారంభంలో ఈ భాగానికి ముగ్గురు సహకార సబ్ రిజిస్ట్రార్లు, ముగ్గురు జవానులతో కూడిన కొద్దిపాటి సిబ్బందిని నియమించడానికి ఉద్దేశింప బడింది. పై కార్యక్రమాన్ని అమలు పరచడానికి ఈ సంవత్సరపు ప్రణాళికలో రూ. 1.70 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రూ. 0.34 లక్షు హెడ్ ఆఫీసులో నియమించడానికి ఉద్దేశింపబడిన సిబ్బందికయ్యే ఖర్చు క్రింద, ప్రచారం మొదలయినవాటి కయ్యే ఖర్చుక్రిందా ప్రత్యేకించ బడింది. మిగిలిన

రూ. 1.36 లక్షల కేటాయింపులోను రూ. 9,087ల మొత్తం ఈ జిల్లాలో నియమించబడే సిబ్బంది ఖర్చు క్రింద కేటాయించ బడింది.

## సభ్యులు, పంచాయతీదారులు మొదలైన వారికి శిక్షణ

ఈ పథకం, అఖిలభారత సహకార సమాఖ్య ద్వారా భారత ప్రభుత్వం వారు ప్రారంభించిన పథకపు పద్ధతిమీద రూపొందించబడింది. సహకార సూత్రావళి, వాటి ఆచరణ, లెక్కలను వ్రాసి యుంచడం, సంస్థల నిర్వహణ మొదలయిన విషయాలలో రెండు మూడు రోజులపాటు గ్రామీణ పరపతి సంఘాల సభ్యులకు, సుమారు ఒక వారం రోజులు పంచాయతీదారులకు, సుమారు 5 లేక 6 వారాల పాటు సంఘాల కార్య నిర్వాహకులకు, జీతం మీద పనిచేసే ఉద్యోగులకు శిక్షణ ఇవ్వడానికి ఈ పథకం ఉద్దేశిస్తున్నది. 1959–60లో ఈ జిల్లాలోని 1,000 మంది సభ్యులకు, 300 మంది పంచాయతీదార్లకు, 40 మంది కార్య నిర్వాహకులకు శిక్షణ ఇచ్చేటందుకు రూ. 5,856ల మొత్తం కేటాయించబడింది.

## సహకార వ్యవసాయం

సహకార వ్యవసాయ సంఘాలను ఏర్పాటు చేయడం ద్వారాను వాటా మూల ధనానికి, ఎద్దుల కొనుగోలుకు, భూమిని బాగు చేయడానికి, వ్యవసాయ పనిముట్ల కొనుగోలుకు ఋణాలు, గ్రాంటుల రూపంలో ఆర్థిక సహాయాన్ని కలుగజేయటం ద్వారాను భూమ లేని వ్యవసాయకూలీలకు పునరావాసం కల్పించడానికి ఈ పథకం క్రింద ఉద్దేశింప బడింది. ఈ సంవత్సరపు ప్రణాళికలో ఆంధ్ర ప్రాంతానికి రూ. 1.34 లక్షలు, తెలంగాణా ప్రాంతానికి రూ 0.88 లక్ష– మొత్తం రూ. 2.22 లక్షలు కేటాయించ బడ్డాయి. అందులో రూ. 0.28 లక్ష మొత్తం, సహకార వ్యవసాయానికి సంబంధించిన పనికోసం ప్రధాన కార్యాలయంలో నియమించబడిన సిబ్బంది కయ్యే ఖర్చు క్రింద వినియోగింప బడుతుంది. మిగిలిన మొత్తంలో రూ. 6,500లు ఈ సంవత్సరంలో ఏర్పాటుచేయబడ్డ క్రొత్త సంఘాలకు ఆర్థికసహాయాన్ని కలుగజేయడానికి ఈ జిల్లాకు కేటాయించబడినాయి.

ఈ జిల్లాలో ఈ సంవత్సరం 250మంది సభ్యులతో ఒక కొత్తసంఘం ఏర్పాటు చేయబడుతుంది. 500 ఎకరాలభూమి సాగుచేయబడుతుంది.

### రాజ్య గిడ్డంగి కార్పొరేషను

దేశంలో గిడ్డంగులను అభివృద్ధి పరచాలనే విషయాన్ని గురించి అనేక కమిటీలు, కమిషన్లు నొక్కి చెప్పాయి, పరపతి, పరపతేతర సంఘాల కార్యకలాపాలకు సంబంధాన్ని కలుగజేసే ముఖ్యమైన సంస్థలే గిడ్డంగులు. అందువల్ల, భారత ప్రభుత్వం వారు కేంద్రీ గిడ్డంగి కార్పొరేషనును స్థాపించారు. దీనికి అనుబంధంగా రాజ్య ప్రభుత్వాలను తమ తమ రాజ్యాలలో గిడ్డంగి సంస్థలను ఏర్పాటు చేయవలసిందిగా కేంద్ర ప్రభుత్వంవారు సలహా నిచ్చారు. ఇవి గిడ్డంగుల బోర్డు అధ్వర్యం క్రింద పని చేస్తాయి. గిడ్డంగి రసీదులు నెగోషియబుల్ ఇన్‌స్ట్రుమెంట్లుగా పరిగణింప బడతాయి. వాటినిధరావతుగా ఉంచుకొని బ్యాంకులు, గిడ్డంగులలో వ్యవసాయఫలసాయాన్ని దాచుకొనే వారికి పరపతిసౌకర్యాన్ని కలుగజేయ గలవు. అందువల్ల 1958–59లో రాజ్య గిడ్డంగి కార్పొరేషను ఈ రాజ్యంలో స్థాపించబడింది. కార్పొరేషనుకు వాటా మూలధనం క్రింద ప్రభుత్వం వారు రు. 2.50 లక్షల మొత్తం పెట్టుబడి పెట్టారు. ఈ సంవత్సరంలో ఆంధ్ర ప్రణాళికలో రు. 5 లక్షలు, తెలంగాణా ప్రణాళికలో, మరొక రు. 5 లక్షలు ఈ కార్పొరేషనుకు వాటా మూలధనం క్రింద పెట్టుబడి పెట్టడానికి కేటాయించారు. ఈ పథకం క్రింది ప్రయోజనాలు ఈ జిల్లాలోని రైతులకుకూడా లభ్యమౌతాయి.

## జాతీయ విస్తరణ సేవా కేంద్రాలు, సామాజికాభివృద్ధి కేంద్రాలు

1959 మార్చి నెలాఖరకు ఈ జిల్లాలో 6 మొదటిదశ బ్లాకులు, 9 రెండవ దశ బ్లాకులు, ఒక సామాజికాభివృద్ధి బ్లాకు, ప్రీ–ఎక్స్‌టెన్షన్ ఒక బ్లాకు ఉన్నాయి. వీటి మొత్తం వైశాల్యం 1941.54 చ. మై. ఈ బ్లాకులలో 678 గ్రామాలు ఉన్నాయి. ఇందు నివశించే జనాభా. 14,29,133. భారత ప్రభుత్వం వారి నిర్ణయం ప్రకారం 1959 ఏప్రిలునుండి కేటాయించ దగ్గ ప్రతి

బ్లాకులోను వ్యవసాయ రంగంలో ప్రత్యేకంగా పూర్వవిస్తరణ ప్రీ-ఎక్స్‌టెన్షన్ కార్యక్రమం ఒక సంవత్సరం పాటు అమలు జరిగి ఉండాలి. ఈ నిర్ణయాన్ని అనుసరించి ఈ జిల్లాలోని నుగూరు బ్లాకులో 2-10-1958 న పూర్వ విస్తరణ కార్యక్రమం ప్రారంభించ బడింది. 2-10-58వ తేదీన పూర్వవిస్తరణ కార్యక్రమం ప్రారంభించబడిన బ్లాకు మొదటిదశబ్లాకుగా 2-10-59వ తేదీన మార్పుచెందుతుంది. ఇంతేకాక కోరుకొండ సామాజికాభివృద్ధి బ్లాకు రెండవదశ బ్లాకుగా మార్పుచెందుతుంది. 1959-60లో ఈ రాజ్యానికి 36 ప్రీ-ఎక్స్‌టెన్షన్ బ్లాకులు కేటాయించబడ్డాయి. అందులో 18 బ్లాకులు 1 4-1959 వ తేదీన, తక్కినవి 2-10-1959 వ తేదీన ప్రారంభింప బడ్డాయి. ఇందులో శంకవరం, రంగంపేట బ్లాకులు ఈ జిల్లాలో ఉన్నాయి. శంకవరం బ్లాకు 1-4-1959వ తేదిన, రంగంపేట బ్లాకు 2-10-1959వ తేదీన ప్రారంభించ బడ్డాయి. ఆ విధంగా ఈ జిల్లాలో 1-4-1959వ తేదీనాటికి 6 మొదటి దశ బ్లాకులు, 11 రెండవ దశ బ్లాకులు, రెండు ప్రీ-ఎక్స్‌టెన్షన్ బ్లాకులు ఉన్నాయి. ఈ జిల్లాలో సామాజికాభివృద్ధి కార్యక్రమాన్ని అమలు పరచడం కోసం ఋణాల క్రింద రూ. 6,31,600లు గ్రాంటు క్రింద రు. 15,00,100లు—మొత్తం రు. 21,31,700లు ఈ సంవత్సరపు ప్రణాళికలో కేటాయించ బడ్డాయి. 1-4-1959వ తేదీనాటికి ఈ జిల్లాలో వున్న బ్లాకులను చూపే పటం ఈ ప్రక్క పుటలో ఇవ్వబడింది.

## పంచాయతీలను పటిష్ఠం చేయడం

### సిబ్బంది పథకం

పంచాయతీలను పటిష్ఠం చేసే ఉద్దేశంతో పంచాయతీ పాలనకు సంబంధించిన పర్యవేక్షక సిబ్బందిని, ఫీల్డు సిబ్బందిని 1958-59లో పునర్వ్యవస్థీకరించడం జరిగింది. జిల్లా పంచాయతీ ఆఫీసర్ల కార్యాలయాల్లోని సిబ్బందిని పెంచడంతో పాటు జిల్లా స్థాయిలో జిల్లా పంచాయతీ ఆఫీసరును, రెవిన్యూ డివిజను స్థాయిలో డివిజనలు పంచాయతీ ఆఫీసరును, తాలూకాస్థాయిలో (బ్లాకుప్రాంతాలుమినహా) డిప్యూటీ పంచాయతీ ఆఫీసరును, బ్లాకు స్థాయిలో పంచాయతీల ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్లను ఏర్పాటు చేయడం ద్వారా ఈ పునర్వ్యవస్థీకరణ జరిగింది. 1959-60 ప్రణాళికలో రు. 8.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులో



తూర్పుగోదావరి జిల్లా
1-4-59 తేదీనాటికి ఉన్న
సామాజిక కార్యవృద్ధి ప్రాంతాలు
మధ్యప్రదేశ్
ఒరిస్సా
విశాఖపట్నం జిల్లా
వరంగల్లు జిల్లా
ఖమ్మం జిల్లా
పశ్చిమ గోదావరి జిల్లా
సూచన
రాష్ట్ర సరిహద్దు
జిల్లా సరిహద్దు
తాలూకా సరిహద్దు
బ్లాకు సరిహద్దు
బ్లాకు కేంద్రం
మొదటిదశ బ్లాకులు
రెండవదశ బ్లాకులు
ప్రీ-ఎక్స్‌టెన్షన్ బ్లాకులు
తుని

రు. 0.120 లక్ష మొత్తం స్థానిక పరిపాలన శాఖ ఇనస్పెక్టరు జనరలు కార్యాలయంలో నియమించబడ్డ అదనపు సిబ్బందిని కొనసాగించడానికి, రు. 0.191 లక్ష మొత్తం ఇనస్పెక్టింగ్ ఆఫీసర్ల (పశ్చిమం, తూర్పు) కార్యాలయాలలో నియమింపబడిన సిబ్బందిని కొనసాగించడానికి ప్రత్యేకించ బడింది. ఖర్చు ఎక్కువ జరిగే జిల్లాలకు పంచేటందుకు రు. 0.524 లక్ష మొత్తం స్థానిక పరిపాలన ఇనస్పెక్టరు జనరలు వద్ద వుంచబడింది. మిగిలిన రు. 7.165 లక్షల మొత్తంలో రు. 0.4095 లక్ష మొత్తం 1958–59లో ఈ జిల్లాలో నియమింపబడిన సిబ్బందిని కొనసాగించడానికి కేటాయించబడింది.

### శిక్షణ పథకం

ఈ పథకం క్రింద, సామర్లకోట, రాజేంద్రనగరులలో వున్న రెండు ఎక్స్టెన్షన్ ట్రైనింగు సెంటర్లలోను, డిప్యూటీపంచాయతీ ఆఫీసర్లకు, పంచాయతీల ఎక్స్టెన్షన్ ఆఫీసర్లకు, డివిజనల్ పంచాయతీ ఆఫీసర్లకు పరిపాలక విషయాలలో శిక్షణ ఇవ్వడానికి ఉద్దేశింపబడింది. జట్టుకు 40 మంది ఉద్యోగుల చొప్పున జట్లు జట్లుగా ఈ శిక్షణ ఇవ్వబడుతుంది. ఈ శిక్షణ సుమారు రెండు మాసాలపాటు ఇవ్వబడుతుంది. మొత్తం మీద సుమారు 390 మంది ఆఫీసర్లకు 1959–60లో శిక్షణ ఇవ్వడానికి ఉద్దేశింపబడింది. అందుకు రు. 2.90 లక్షల మొత్తం ప్రణాళికలో కేటాయించబడింది. ఈ జిల్లాలోని ఆఫీసర్లకు కూడా ఈ పథకంక్రింద శిక్షణ ఇవ్వబడుతుంది.

## పెద్దతరహా మధ్యతరహా నీటి పారుదల పనులు

పెద్ద తరహా, మధ్యతరహా నీటిపారుదల పనులకోసం 1959–60లో రూ. 4.00 లక్షల మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది. వాటి వివరాలు ఈ దిగువ ఇవ్వబడ్డాయి.

| వరుస సంఖ్య. | ప్రాజెక్టు పేరు | 1959–60లో కేటాయింపు లక్షలలో | పని | నీటిపారుదల జరిగే విస్తీర్ణం ఎకరాలలో |
|---|---|---|---|---|
| 1. | తొర్రిగెడ్డ పంపింగు పథకం | 4.00 | పని కొనసాగింపుకు | — |

# విద్యుచ్ఛక్తి

## మాచ్‌కండ్ జల విద్యుచ్ఛక్తి పథకం

## బకాయి, క్రొత్త పనులు

1957–58 సంవత్సరానికి ముందుగా ఒక్కొక్కటి 17,000 కిలోవాట్ల శక్తిగల 3 విద్యుచ్ఛక్తి ఉత్పాదక యంత్రాలు (జనరేటింగ్ యూనిట్లు) పనిచేయడం ప్రారంభమయింది. 21,250 కిలోవాట్ల శక్తిగల మిగత రెండు ఉత్పాదక యంత్రాలను నెలకొల్పడం కూడ 1957–58లోనే ప్రారంభించబడింది. 21,250 కిలోవాట్ల శక్తి ఉండే ఆరవ ఉత్పాదక యంత్రంతో పాటు పై రెండు యంత్రాలు కూడ 1958–59లో పని చేయడం ప్రారంభమౌతుందని మొదట ఆశించబడింది. కాని మాచ్‌కండ్‌వద్ద జరిగిన సమ్మె మూలంగా 21,250 కిలోవాట్ల శక్తిగల నాలుగవ ఉత్పాదక యంత్రం మాత్రం 1959 జనవరిలో పనిచేయడం ప్రారంభమయింది. అయిదవ ఉత్పాదక యంత్రం 1959–60లో పనిచేయడం ప్రారంభమవుతుందని ఆశించబడుతున్నది. ఇతర కొదువ పనులతోపాటు ఆరవ ఉత్పాదక యంత్రాన్ని నెలకొల్పడానికి సంబంధించిన పని కూడ, నాలుగవ, అయిదవ ఉత్పాదక యంత్రాలను నెలకొల్పడానికి సంబంధించిన పనితోపాటు ఒకేసారి మొదలుపెట్టబడింది. 1959–60 సంవత్సరానికి చేయబడిన రు. 79.07 లక్షల మొత్తం కేటాయింపులో ఈ జిల్లా వాటా రు. 5.42 లక్షలు. ఈ కేంద్రం యిప్పుడు పూర్వపు ఆంధ్ర రాజ్యంలోని జిల్లాలయిన శ్రీకాకుళం, విశాఖపట్టణం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేస్తున్నది.

## ఎగువసీలేరు జల విద్యుచ్ఛక్తి పథకం

ప్రథమ దశక్రింద ఒక్కొక్కటి 60,000 కిలోవాట్ల శక్తిగల రెండు విద్యుచ్ఛక్తి ఉత్పాదక యంత్రాలను నెలకొల్పడం ద్వారా సీలేరు నది ఎగువ భాగంలో విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయడానికి యీ పథకం క్రిందఉద్దేశించబడింది. ఈ పథకానికి సంబంధించిన సవివిరమైన పరిశీలనలు జరపబడి

లను నెలకొల్పడానికి రవాణా సౌకర్యాలను ఏర్పాటు చేయడానికి సంబంధించిన ప్రాథమిక చర్యలు అమలు జరుగుతున్నాయి. ఈ సంవత్సరం యీ పథకానికి సంబంధించిన పనిని ప్రారంభించడానికి ప్రతిపాదింపబడింది. 1959–60 సంవత్సరానికి కేటాయించబడిన రు. 73.00 లక్షల మొత్తం క్యాంపులను నిర్మించడం, ఆనకట్టకు పునాదులను త్రవ్వడం, మట్టిగట్లు నిర్మించడం మొదలయిన పనులకుగాను వినియోగించబడుతుంది. ఇందులో ఈ జిల్లా వాటాగా రు. 10.43 లక్షల మొత్తం ప్రత్యేకించబడింది.

### గ్రామీణ విద్యుతీకరణ

ఈ పథకం కేవలం గ్రామీణ విద్యుతీకరణకే కాకుండా గరివిడిలోని ఫెర్రో మాంగనీసు ఫ్యాక్టరీ, నాగర్జునసాగరుకు సంబంధించిన పనులకు గూడా సరఫరా చేయడానికి ఉద్దేశింపబడింది. రూ. 10 లక్షలకు మించిన విస్తరణ పనులకు కూడా ఈ పథకం ఉద్దేశిస్తున్నది. 1959–60లో ఆంధ్రప్రాంతంలోని 100 గ్రామాల విద్యుతీకరణకు రూ. 100 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రూ. 8.0 లక్షల మొత్తం 8 గ్రామాల విద్యుతీకరణకుగాను ఈ జిల్లాకు కేటాయించబడింది.

## పెద్ద తరహా మధ్యతరహా పరిశ్రమలు

### రాజమండ్రిలోని ఆంధ్ర పేపరుమిల్లును అభివృద్ధిచేయడం

రాజమండ్రిలో ఉన్న ఆంధ్ర పేపరుమిల్లులో ప్రస్తుతం రోజుకు 10 టన్నుల కాగితం ఉత్పత్తి చేయబడుతున్నది. ఈ పేపరు మిల్లులో కాగితం ఉత్పత్తిని రోజుకు 50 నుండి 60 టన్నుల వరకు పెంచే ఉద్దేశంతో రెండవ ప్రణాళికా కాలంలో రు. 190 లక్షల ఖర్చుతో యీ పేపరు మిల్లును విస్తరింప చేయడానికి యీ పథకం ఉద్దేశించబడింది. ఈ మిల్లు విస్తరణ కార్యక్రమం కోసం కావలసిన యంత్రాలు, పరికరాల సరఫరాకు గాను స్టేట్ ట్రేడింగ్ కార్పొరేషనుతోను జర్మన్ డెమోక్రాటిక్ రిపబ్లికుతోను ప్రభుత్వంవారు జరుపుతున్న సంప్రదింపులు యింకా పూర్తి కాలేదు. 1958–59 సంవత్సరములో కేటాయించ

బడిన రు. 20 లక్షల్లోను రు. 2.40 లక్షలు మాత్రం ఈ మిల్లుకు చేయవలసిన ముఖ్యమైన అభివృద్ధిపనులకు, మరమ్మతులు మొదలయిన వాటికి, పరికరాల సరఫరాకు, భవనాల నిర్మాణానికి గాను ఖర్చుపెట్టడం జరిగింది. ఈ సంవత్సరం రు. 70.23 లక్షల మొత్తం కేటాయించ బడింది యంత్రాల కొనుగోలుకు, మిగిలిన పరికరాలను కొనుగోలుకు—వీటిలో కొన్నిటి సరఫరాకు గత సంవత్సరమే ఉత్తరువులు యివ్వబడినాయి—పైడబ్బు వినియోగించ బడుతుంది. ఈ మిల్లుకు కావలసిన యంత్రాలను, పరికరాలను సరఫరా చేసేటందుకు స్టేట్ ట్రేడింగ్ కార్పొరేషన్‌తోను, జర్మన్ డెమోక్రాటిక్ రిపబ్లిక్‌తోను లేక యితర సరఫరా దార్లతోను సంప్రదింపులు జరపడం పూర్తవుతుందని, యీ సంవత్సరం వీటిసరఫరాకు ఉత్తరువులు యివ్వబడుతాయని ఆశించబడుతున్నది.

## గ్రామీణ పరిశ్రమలు, చిన్నతరహా పరిశ్రమలు

### రాజమండ్రిలో సీమ సున్నం కణికలు (చాక్‌పీసులు), యితర ప్లాస్టరు వస్తువుల ఉత్పత్తి-శిక్షణ కేంద్రంస్థాపన.

పాఠశాలలకు, కళాశాలలకు, యితర విద్యాసంస్థలకు కావలసిన సీమసున్నపు కణికలను, యితర ప్లాస్టరువస్తువులను ఉత్పత్తి చేసేటందుకు 1956—57లో ఉత్పత్తి—శిక్షణ కేంద్రం ఒకటి రాజమండ్రిలో స్థాపించబడింది. ఈ కేంద్రంలో శిక్షణ ఆర్నెల్ల పాటు యివ్వబడుతుంది, తడవకు 6 మంది అభ్యర్థులు శిక్షణ నిమిత్తం చేర్చుకోబడుతారు. వీరికి ఒక్కొక్కరికి నెలకు రు. 20/—లు స్టయిఫండు యివ్వబడుతుంది. యింతవరకు 30 మంది అభ్యర్థులు ఈ కేంద్రంలో శిక్షణ పొందారు. 5,400 రూపాయల విలువ గల వస్తువులు ఈ కేంద్రంలో ఉత్పత్తి చేయబడినాయి.

ఈ కేంద్రాన్ని కొనసాగించడానికి, తడవకు 6 మందికి చొప్పున రెండు తడవలలో 12 మందికి శిక్షణ యివ్వడానికి గాను యీ సంవత్సరం ప్రణాళికలో రు. 0.22 లక్ష కేటాయించ బడింది. ఈ సంవత్సరం యీ కేంద్రం వల్ల రు. 15,000 లు రాబడి ఉంటుందని ఆశించ బడుతున్నది.

## కాకినాడలో తాటి పీచుతో బ్రష్షుల (కుంచెలు) తయారి

కాకినాడ తాటి పీచును ఎగుమతి చేసే ముఖ్య కేంద్రాలలో ఒకటి. ఇక్కడ తాటి పీచుతో బ్రష్షులను తయారు చేయడం కోసం ఒక ఉత్పత్తి-శిక్షణ కేంద్రం 1957–58లో అద్దె భవనాల్లో స్థాపించబడింది. ఈ కేంద్రంలో ఏటా 6గురు అభ్యర్థులకు శిక్షణ యివ్వడానికి సౌకర్యాలున్నాయి. వీరికి ఒక్కొక్కరికి నెలకు రు. 20లు స్టయిఫండు యివ్వబడుతుంది. 1958–59లో సానుర్లకోటలోని పారిశ్రామిక ఎస్టేటులో కట్టబడిన శాశ్వత భవనానికి యిప్పుడు యీ కేంద్రం మార్చబడింది. ఈ కేంద్రాన్ని కొనసాగించడానికి, యింకా ఆరుగురు అభ్యర్థులకు శిక్షణ యివ్వడానికి గాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.10 లక్ష కేటాయించ బడింది 1959–60లో యీ కేంద్రం వల్ల రు. 8000/-లు ఆదాయం ఉండగలదని ఆశించబడుతున్నది.

## రాజమండ్రిలో గ్రాఫైటు మూసల పరిశ్రమ

పాతపద్ధతులలో గ్రాఫైటు మూసలు రాజమండ్రిలో తయారుచేయబడుతున్నాయి. గ్రాఫైటును శుద్ధిచేయడానికి, గ్రాఫైటును మిశ్రమం చేసేపద్ధతులను ప్రామాణీకరించ డానికిగాను ఒక కేంద్రాన్ని రాజమండ్రిలో స్థాపించడానికి ప్రతిపాదింపబడింది. మూసల పరిశ్రమకు కావలసిన గ్రాఫైటును మిశ్రమం చేయడానికి సంబంధించిన పద్ధతులను గురించి ఈ కేంద్రంలో పరిశోధన జరపబడుతుంది. ఇంతేకాక మూసలను తయారుచేయడంలో ఉత్తమ పద్ధతులను గురించి కూడ ప్రదర్శన పూర్వకంగా తెలియ చేయడం జరుగుతుంది. ఆవము(కిల్న్), భవనాల నిర్మాణం 1958–59లో పూర్తిచేయబడింది. కావలసిన యంత్రాలు కూడ చాలవరకు సేకరించబడినాయి

దిగుమతిచేసుకోబడిన పరికరాల ఖరీదుకు, ఈ కేంద్రం పనిచేయడానికిగాను ఈ సంవత్సరం ప్రణాళికలో రు. 0.55 లక్ష కేటాయించబడినది. ఈ కేంద్రం ఈసంవత్సరం మధ్యలో పనిచేయడం ప్రారంభమవుతుందని ఆశించబడుతున్నది.

## ధవిళేశ్వరంలో కట్టడాలకు పనికొచ్చే ఇనుపసామాన్ల తయారి

టవరుబోల్టులు, గొళ్ళెములు, ఇనుపకొక్కములు, గడియలు, గుడిదెలు మొదలయినటువంటి భవనాల నిర్మాణానికి కావలసిన ఇనుప సామాన్లను తయారు

చేయడానికి, వీటిని తయారు చేయుడంలో పటూ 6 మంది శిక్షణ ఇవ్వడానికి గాను ధవళేశ్వరంలో ఒక కర్మాగారాన్ని స్థాపించడానికి ప్రతిపాదింపబడింది. శిక్షణపొందే అభ్యర్థులకు ఒక్కొక్కరికి నెలకు రు. 30/—లు స్టయిపెండుగా యివ్వడానికి కూడ ప్రతిపాదింపబడింది. ఈ కేంద్రానికి కావలసిన భవనాల నిర్మాణం 1958—59 లో పూర్తయింది. ఈ సంవత్సరంలో కేంద్రం పనిచేయడం ప్రారంభ మవుతుంది. 6 మంది అభ్యర్థులు శిక్షణపొందుతారు. ఇందుకు ప్రణాళికలో రు. 1.75 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ సంవత్సరం ఈ కేంద్రం వల్ల రు. 1.00 లక్ష వస్తుందని ఆశించబడుతున్నది.

## రాజమండ్రిలో రాతితూముల తయారి కేంద్రం

రాతితూముల తయారీకి గాను రాజమండ్రిలో ఒక చిన్న ఫ్యాక్టరీని నెల కొల్పడానికి ఈ పథకం ఉద్దేశించబడింది. ఈ పథకం వ్యాపార సరళిలో పరిశ్రమల శాఖచే నిర్వహింపబడుతుంది. ఈ కేంద్రంకొరకు పూర్వపు ఈస్ట్‌కోస్ట్ సిరామిక్స్ వారి ఆవరణ, భవనాలు స్వాధీనం చేసుకోబడినాయి. ఆవము (కిల్న్) నిర్మాణం, కావలసిన యంత్రాలను చాలవరకు కొనడం 1958—59 లోపూర్తయింది.

ఈ సంవత్సరం ఈ కేంద్రం పనిచేయడం ప్రారంభమవుతుంది. ఈ సంవత్సరం ప్రణాళికలో రు. 1.69 లక్షల మొత్తం కేటాయించబడింది. పైప్‌ప్రెస్ యంత్రాన్ని కొనడానికి, భవనాలకు కావలసిన మార్పులు చేయడానికి, కేంద్రం నిర్వహణకుగాను పైడబ్బువినియోగించబడుతుంది.

## రామచంద్రపురంలో ట్రంకుల (ఇనపరేకు పెట్టెలు) తయారికి సంబంధించిన పథకము

ఆధునిక పద్ధతులలో ట్రంకు పెట్టెలను తయారు చేయడానికి రామచంద్ర పురంలో చిన్న యూనిట్టునొకదాన్ని స్థాపించడానికి ఈ పథకం ఉద్దేశించబడింది.

ఈ సంవత్సరం ప్రణాళికలో రు. 0.32 లక్ష కేటాయించ బడింది. భూమి ఖరీదు, భవనాలనిర్మాణానికి, యంత్రాలు, పరికరాల కొనుగోలుకు, కేంద్రం నిర్వహణకుగాను పైడబ్బువినియోగించబడుతుంది.

## కాకినాడలో ఫోటో ఫ్రేములు (చిత్రములు), ఎలక్ట్రిక్ కేసింగులు, బండిచక్రాలు, కుర్చీలు, బల్లలు మొదలయిన కొయ్యసామగ్రి తయారీకి సంబంధించిన పథకం

ఆధునిక పద్ధతులలో ఫోటో ఫ్రేములు, ఎలక్ట్రిక్ కేసింగులు, బండి చక్రాలు, కుర్చీలు, బల్లలు మొదలయిన కొయ్యసామగ్రిని తయారు చేయడం కోసం కాకినాడలో ఒక కేంద్రాన్ని స్థాపించడానికి ప్రతిపాదింపబడింది. భూమి ఖరీదుకు, భవనాల నిర్మాణానికి, యంత్రాల కొనుగోలుకుగాను ఈ సంవత్సరం రు. 1.50 లక్షలమొత్తం కేటాయించబడింది. ఈ కేంద్రపు భవనాల నిర్మాణం పూర్తయిన తరువాత యీ సంవత్సరపు చివరిభాగంలో యీ కేంద్రం పనిచేయడం ప్రారంభిస్తుందని ఆశించబడుతున్నది.

## నంద్యాల, సామర్లకోటలలో రెండు జనరల్ ఇంజనీరింగు సర్వీసింగు వర్కుషాపులను స్థాపించడం.

నంద్యాల, సామర్లకోటలలో ఉన్న చిన్న తరహా పారిశ్రామికులకు సర్వీసింగు కేంద్రాలుగా ఉపయోగపడటం కోసం, అందును ముఖ్యంగా నంద్యాల, సామర్లకోటలలోని పారిశ్రామిక ఎస్టేటులలో తమపరిశ్రమలను నెలకొల్పుకొన్నట్టి పారిశ్రామికులకు ఉపయోగపడేటందు కోసం, రెండుజనరల్ ఇంజనీరింగు సర్వీసింగు వర్కుషాపులను నంద్యాలలోను, సామర్లకోటలోను స్థాపించడానికి ప్రతిపాదింప బడింది. ఈ కేంద్రాలు "టూల్‌రూము" లుగా ఉపయోగ పడతాయి. నంద్యాలలోను, సామర్లకోటలోను ఉన్నపారిశ్రామిక ఎస్టేట్లలో వీటిని నెలకొల్పడం జరుగుతుంది.

ఈ పథకాన్ని క్రొత్తగా రూపొందించడంవల్ల ఈ సంవత్సరం ప్రణాళికలో ఈ పథకానికి కేటాయింపేమీ చేయబడలేదు. అయినప్పటికీ, భవనాల నిర్మాణానికి, యంత్రాలు, పరికరాల కొనుగోలుకు గాను ఈ సంవత్సరం ఈ పథకానికి కావలసిన రు. 4.10 లక్షల మొత్తం యితర పథకాలలో సంభవమయ్యే

*మిగులు డబ్బునుండి సర్దుబాటు చేయడం జరుగుతుంది.

## పరిశ్రమలకు రాజ్యప్రభుత్వ సహాయ చట్టంక్రింద ఋణాలు

ప్రణాళికలో మొదటి 3 సంవత్సరాలలో పరిశ్రమలకు ప్రభుత్వ సహాయ చట్టం క్రింద చిన్నతరహా పరిశ్రమలకు ఋణాల రూపంలో రూ. 13.11 లక్షల మొత్తం పంచిపెట్టబడింది. ఈ సంవత్సరంలో పరిశ్రమలకు ఋణాలుగా మరొక రూ. 7 లక్షల మొత్తం ఇవ్వబడుతుంది. ఈ జిల్లాలోని పారిశ్రామికులకు కూడా ఈ పథకం క్రింద లాభం చేకూరుతుంది.

## పారిశ్రామిక శాఖను పటిష్ఠం చేయడం

రెండవ ప్రణాళికాకాలంలో పరిశ్రమల శాఖలో పనిబాగా పెరిగింది. అందువల్ల రూ. 7.95 లక్షల వ్యయంలో డైరెక్టరు కార్యాలయంలోను, జిల్లాల లోనూ కూడా సిబ్బందిని పెంచడానికి ఉద్దేశింపబడింది. రెండవప్రణాళికలో ఈ మొత్తం కేటాయించబడింది. మొదటి మూడు సంవత్సరాలలో రు. 3.45 లక్షల మొత్తం వ్యయంతో అదనపు సాంకేతిక సిబ్బంది, మినిస్టీరియలు సిబ్బంది కూడ నియమించబడింది. ఈ సంవత్సరంలో యింతకుముందు నియమించబడిన సిబ్బందిని కొనసాగించడానికి, మరికొంత అదనపు సిబ్బందిని నియమించడానికి ఆంధ్ర ప్రణాళికలో రూ. 2.25 లక్షల మొత్తం కేటాయించబడింది.

## బ్లాకుప్రాంతాల్లోని పారిశ్రామిక శాఖ ఎక్స్‌టెన్షన్ అఫీసర్ల జీతాలు.

బ్లాకు ప్రాంతాలలో నియమింపబడిన పారిశ్రామిక శాఖ ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్ల జీతాల క్రింద రెండవ ప్రణాళికలో రూ 10.17 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ సంవత్సరపు ప్రణాళికలో ఇందుకోసం రు. 3.00 లక్షల మొత్తం కేటాయించ బడింది.

---

* చిన్నతరహా పథకాలు చాలవాటికి యంత్రాల కొనుగోలుకుగాను ఈ సంవత్సరపు బడ్జెట్టులో డబ్బును కేటాయించడం జరిగింది. అయితే ఈ యంత్రాలను నేషనల్ స్మాల్ ఇండస్ట్రీస్ కార్పొరేషను ద్వారా 1959మార్చిలోనే ఖరీదు చేయడం జరిగినందువల్ల ఈ సంవత్సరపు బడ్జెట్టులో రు. 11.20 లక్షల మిగులు సంభవమయింది.

## పారిశ్రామిక ఎస్టేట్లు

### సామర్లకోటలో పారిశ్రామిక ఎస్టేటు

24 ఫ్యాక్టరీ భవనాల నిర్మాణం నిమిత్తం 1957–58లో 10.75 ఎకరాల సంస్థల స్వాధీనంలో చేసుకోబడింది. ఇందులో 14 భవనాల నిర్మాణం 1958–59లో మొదలు పెట్టబడి పూర్తి చేయడం జరిగింది. ఈ సంవత్సరం మిగిలిన 10 భవనాలనిర్మాణం పూర్తి చేయడానికి, ఈ పారిశ్రామిక ఎస్టేటును అన్ని విధాల పూర్తి చేయడానికిగాను రు. 4 00 లక్షల మొత్తం కేటాయించబడింది.

### పారిశ్రామిక, వాణిజ్యశాఖ అసిస్టెంటు డైరెక్టర్లకు జీపులు

—తలపెట్టినఅనేకపథకాలను త్వరితంగానుకట్టుదిట్టంగానుఅమలు పరచాలంటే సంబంధించిన అధికారులు తరచు పర్యవేక్షణ జరపడం, సాంకేతికసహాయం అందచేయడం అవసరం. ఈ అధికారులు త్వరితంగా పర్యటించడానికి వీలుగా వీరికి జీపులను సరఫరా చేయడం అవసరం అని భావింపబడింది. 1958–59 చివరకు ఆంధ్రప్రాంతంలోని పారిశ్రామిక, వాణిజ్యశాఖ అసిస్టెంటు డైరెక్టర్లందరికి జీపులు ఇవ్వబడ్డాయి. ఈ సంవత్సరంలో రూ. 0.30 లక్ష మొత్తం ఈ జీపుల నిర్వహణకు కేటాయించ బడింది. ఒక జీపు యీ జిల్లాలోని అసిస్టెంటు డైరెక్టరు క్రింద ఉన్నది.

### క్రొత్త పథకాలు

ఈ సంవత్సరంలో రాజ్యస్థాయిలోహస్తకళలకు సంబంధించిన ఈ క్రింది క్రొత్త పథకాలు అమలు పరచబడతాయి. వీటివల్ల వచ్చేలాభాలు ఆంధ్ర ప్రాంతంలోని జిల్లా లన్నిటికి లభిస్తాయి.

| పథకం పేరు | 1959–60లో కేటాయింపు (రూ. లక్షలలో) |
|---|---|
| హస్తకళలలో ఉపయోగించేటందుకు దేవాలయాలలోని డిజైనులను కాపీచేయడం | 0.05 |

విడివిడిగా ఉంటూ సహకార సంఘాలుగా
ఏర్పడ్డానికి వీలులేని పనివారికి గ్రాంట్లు, ఋణాలుయివ్వటం 0.05

పిఠాపురంలో వాయిద్య పరికరాల తయారీకి సంబంధించిన పథకం

పిఠాపురంలో వాయిద్య పరికరాల పరిశ్రమను స్థాపించడం కోసం ఈ సంవత్సరం ప్రణాళికలో రు. 0.05 లక్ష కేటాయించబడింది.

పట్టు పరిశ్రమ

తూర్పుగోదావరి జిలాలోని వెంకటాపురంలో కేంద్ర టస్సరు విత నాలక్షేత్రం స్థాపన

మేలురకం టస్సరు పురుగులను అధిక సంఖ్యలో ఉత్పత్తిచేసి పెంపకందార్లకు పంపకం చేయడానికి ఈ పథకం ఉద్దేశించబడింది. 1958–59లో టస్సరు పట్టుకాయలను ఎక్కువగా ఉత్పత్తి చేయడం జరిగింది. ఇలా ఉత్పత్తి చేయబడిన వాటి సంఖ్య 1,08, 308. సైంటిఫిక్ పరికరాలు, "రేరింగు", "గ్రెయినేజి" పరికరాలు ఖరీదు చేయబడినాయి. "రేరింగుహౌసు" నిర్మాణం 1958–59లో పి. డబ్ల్యు. డి. వారిచే ప్రారంభించబడింది. 1959–60లో దీని నిర్మాణం పూర్తవుతుందని ఆశించబడుతున్నది. 1958–59లో ఈ పథకం కోసం రు. 0.42 లక్ష ఖర్చుపెట్టబడింది. ఈ సంవత్సరం ఈ పథకాన్ని కొనసాగించడం కోసం రు. *0.17 లక్ష ఖర్చు పెట్టడానికి ప్రతిపాదించబడింది.

పట్టుపరిశ్రమ ప్రాంతాల్లో ప్రచారం

పట్టు పరిశ్రమపట్ల ప్రజలకు ఆసక్తి కలిగించడం కోసం పట్టుపరిశ్రమ ప్రాంతాల్లో ప్రచారం జరపడానికి సంబంధించిన పథకం అమలు జరపడం కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.01 లక్ష కేటాయించబడింది.

---

* ఈ సంవత్సరం ప్రణాళికలో యీ పథకంకోసం కేటాయింపేమీ చేయబడలేదు. అయినా ప్రణాళికా కార్యక్రమాన్ని పునః సవరించడం ద్వారా ఈ పథకానికి కావలసిన డబ్బు సమకూర్చబడుతుంది.

## పీచు పరిశ్రమ

## తాళ్ళరేవు, అంతర్వేది, కొమరగిరి పట్నంలలో పీచుపరిశ్రిమకు సంబంధించిన ఉత్పత్తి-శిక్షణ కేంద్రాలు

తాళ్ళరేవు, అంతర్వేది, కొమరగిరి పట్నంలలో మూడు ఉత్పత్తి-శిక్షణ కేంద్రాలు పీచు వస్తువులను తయారు చేయడంలో శిక్షణయివ్వడం కోసం స్థాపించబడినాయి. ప్రతి కేంద్రంలోను 12 మంది అభ్యర్థులు శిక్షణ పొందారు. ఈ సంవత్సరం ఈ కేంద్రాలను కొనసాగించడానికి, ప్రతి కేంద్రంలోను 12 మంది అభ్యర్థులకు శిక్షణ యివ్వడానికి ప్రతిపాదింపబడింది. ప్రతి కేంద్రానికి కేటాయించబడిన మొత్తం క్రింద యివ్వబడింది.

| | (రూపాయిలు, లక్షలలో) |
|---|---|
| తాళ్ళరేవు ఉత్పత్తి—శిక్షణ కేంద్రం | 0.21 |
| అంతర్వేది ఉత్పత్తి—శిక్షణ కేంద్రం | 0.19 |
| కొమరిగిరి పట్నం ఉత్పత్తి—శిక్షణ కేంద్రం | 0.15 |

## అమలాపురందగ్గర కుంచెలకు, చాపలకు పనికివచ్చే పీచును తయారు చేయడానికి సంబంధించిన పథకం

తూర్పు గోదావరి జిల్లా అమలాపురంలో కుంచెలు, చాపలకు కావలసిన పీచును తయారు చేయడం కోసం ఒక కేంద్రాన్ని స్థాపించడానికి ఈ పథకం ఉద్దేశించబడింది.

ఈ సంవత్సరం ప్రణాళికలో రు. 0.65 లక్ష భవనాల నిర్మాణానికి, యంత్రాల కొనుగోలుకు, పథకం కొనసాగింపుకుగాను కేటాయించబడింది.

## గ్రామీణ పరిశ్రమలు

## బెల్లం, ఖండసారి పథకాలు

ఈ పథకం క్రింద మంచిరకం, బెల్లాన్ని ఖండసారీని తయారు చేసేటందుకు రైతులు మేలురకం ఉపకరణాలను కొనుక్కోవడానికి గాను వడ్డీ

లేకుండా ఋణాలు ఇవ్వబడుతాయి. ఉత్పత్తి చేసే విధానాలు కూడా ప్రదర్శించి చూపబడుతాయి. ఈ ఋణాలు 5 సంవత్సరాలలో వసూలు చేయబడతాయి. ఈ పథకం అనకాపల్లి, చోడవరం, రామచంద్రపురం, చిత్తూరు, హిందూపురం తాలూకాలలో మొదటి ప్రణాళికా కాలం (1955)లో అమలు పరచ బడింది. బెల్లాన్ని, ఖండసారిని ఆధునిక పద్ధతులలో ఉత్పత్తి చేయడంలో శిక్షణ పొందిన ప్రత్యేక ఫీల్డు సిబందిని నియమించి ఈ పథకం అమలు పరచ బడింది. ఈ పథకం 1956-57, 1957-58లలో కొనసాగింప బడింది. కాని 1958-59లో అమలుపరచ బడలేదు, ఈ సంవత్సరంలో, ప్రస్తుతం అమలు జరుగుతున్న ప్రదేశాలలో కొనసాగిస్తూ, శ్రీకాకుళం జిల్లా పాలకొండ, పశ్చిమ గోదావరి జిల్లా తణుకు, కృష్ణాజిల్లాదివి, గుంటూరు జిల్లా రేపల్లె, చిత్తూరు జిల్లా చంద్రగిరి తాలూకాలకు ఈ పథకాన్ని విస్తరింప చేయటానికి ఉద్దేశింపబడింది. ఇప్పటికే ఈ పథకం క్రిందికి 30,000 ఎకరాల మేరవస్తుంది. ఈ పథకం క్రింది కార్యక్రమాలను క్రొత్త ప్రాంతాలకు విస్తరింప చేయటం వల్ల మరో 32,650 ఎకరాలమేర ఈ పథకం క్రిందికి వస్తుంది. ప్రస్తుతం పారిశ్రామిక శాఖ అజ్మాయిషీ క్రింద ఉన్న ఈ పథకాన్ని 1958 నవంబరులో ఏర్పాటు చేయబడ్డ ఆంధ్ర ప్రదేశ ఖాదీ, గ్రామీణ పరిశ్రమలబోర్డు అజ్మాయిషీకి మార్చడానికి తలపెట్టబడింది. ఈ పథకం కోసం ఈ సంవత్సరంలో రూ. 6.00 లక్షల మొత్తం కేటాయించ బడింది.

### కుటీర పరిశ్రమల ఋణాల నియమావళి క్రిందఋణ సహాయం

వడ్రంగం, కమ్మరం, నేత మొదలైన వివిధ కుటీర, గ్రామీణ ప్రరిశ్రమలు చేసుకుంటున్న పనివారికి ఆర్థిక సహాయాన్ని కలగ చేయాలనే ఉద్దేశంతో రెండవ ప్రణాళిక మొదటి రెండు సంవత్సరాలలో ఋణాలుగా రు. 1.64 లక్షల మొత్తం పంపిణీ చేయబడింది. 1958-59లో ఈ పథకం అమలు పరచ బడలేదు. ఈ సంవత్సరంలో రు. 2.00 లక్షల వరకు ఋణాలను ఇవ్వడానికి తలపెట్టబడింది. ఈ జిల్లాలోని పనివారికి కూడా ఈ పథకం క్రింద ఋణాలు ఇవ్వబడతాయి.

## పారిశ్రామిక సహకార వ్యవస్థలు

గ్రామీణ పరిశ్రమలు అన్నీ ఏకమై, వాటి ఉత్పత్తి విధానాలను మెరుగు పరచుకొని తద్వారా ఉత్పత్తిని అధికం చేసుకోవడానికి వీలు కలుగచేయడమే ఈ యొక్క పథకంఆశయం. ఇందుకోసం సహకారసంఘాలద్వారా దంపుడుబియ్యం పరిశ్రమను అభివృద్ధిపరచడానికి 10 కేంద్రాలను ప్రారంభించడం, కలంకారి అద్దకం పరిశ్రమకు నిర్వహణ మూల ధనం, సిబ్బంది చార్జీల క్రింద గ్రాంటులు ఇవ్వడం, మేలురకం పనిముట్లను కొనుక్కోవడానికి గుంటూరు కమ్మరి పనివారి సహకార సంఘానికి ఆర్థిక సహాయాన్ని కలుగచేయడం, పరికరాలు మొదలైనవి కొనుక్కోవడానికి కుటీర పారిశ్రామిక సహకార సంఘాలకు సబ్సిడీలనుఇవ్వడం మొదలయి నటువంటి పథకాలు రూపొందించబడ్డాయి. ఇంతవరకు రు. 2.72 లక్షల మొత్తం యీ పథకం క్రింద ఖర్చుపెట్టబడింది. ఈ సంవత్సరంలో యీ పథకం కొనసాగించబడుతుంది. ఇందుకు రు. 1.58లక్షల మొత్తం కేటాయించబడింది. క్రొత్తగా ఏర్పాటు చేయబడ్డ ఆంధ్రప్రదేశ్ ఖాదీ, గ్రామీణ పరిశ్రమల బోర్డు అజమాయిషీ క్రిందికి దీనిని మార్చడానికి ఉద్దేశింపబడింది.

# చేనేత పరిశ్రమ

## చేనేతపనివారి సంఘాలకు వాటామూలధనం, నిర్వహణమూలధనం క్రింద ఋణాలు

చేనేత కార్మికుల సంఘాలలో వాటాలుతీసికొని, సభ్యులు కావడానికి వీలు కలిగేటందుకు చేనేత కార్మికులకు ఋణాల నివ్వడానికి ఈ పథకం ఉద్దేశించబడింది. ఈ సంవత్సరపు ఆంధ్ర ప్రణాళికలో ఈ పథకంకోసం రూ. 2.25 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రూ. 0.25 లక్ష వాటా మూలధనం క్రింద అప్పులు ఇవ్వడానికి ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది. ఈ సంవత్సరం ఈ జిల్లాలో 400 క్రొత్తమగ్గాలు సహకార వ్యవస్థ క్రిందికి తీసికొని రాబడతాయని, 50 లక్షల గజాల గుడ్డ ఉత్పత్తి చేయబడుతుందని ఆశించ బడుతున్నది.

## ఆంధ్ర చేనేత కార్మికుల సహకార సంఘం మార్కెటింగు వ్యవస్థ విస్తరణ

మరికొన్ని విక్రయ కేంద్రాలను ప్రారంభించడం ద్వారాను, చేనేత బట్టల విషయంలో తీవ్రమైన ప్రచారం జరపడం ద్వారాను ఆంధ్ర చేనేత కార్మికుల

సహకార సంఘం కార్యకలాపాలను విస్తరింప చేయడానికి ఈ పథకం ఉద్దేశించ బడింది. ఈ పథకం కోసం ఈ సంవత్సరంలో 0.31 లక్ష మొత్తం కేటాయించ బడింది. అందులో రు. 0.33 లక్ష మొత్తం ఈ జిల్లాలో మరి మూడు విక్రయ కేంద్రాలను స్థాపించడానికి వినియోగించ బడుతుంది. ఈసంవత్సరంలో 10 లక్షల గజాల చేనేత బట్ట డిపోలద్వారా అమ్మబడుతుందని ఆశించబడుతున్నది.

## ఉత్పత్తి విధానాల అభివృద్ధి, నిర్వహణఖర్చు

అందరికినచ్చే డిజైన్లతో ఇంకా నాణ్యమైన మంచి రకాల బట్టను ఉత్పత్తి చేయడానికిగాను చేనేతపరిశ్రమ సాంకేతిక నైపుణ్యాన్ని మెరుగు పరచే ఉద్దేశంతో ఈ పథకం రెండవప్రణాళిక యొక్క మొదటి మూడుసంవత్సరాలలో అమలుపరచ బడింది. స్టాండర్డు రీడ్లు, వార్పింగు మిషన్లువంటి ఆధునిక పరికరాలు చేనేత కార్మికులకు సరఫరా చేయబడ్డాయి. ఈ సంవత్సరం ఆంధ్ర ప్రణాళికలో రు. 4.80 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులో రు. 0.47 లక్ష చేనేత కార్మికులకు 60 స్టాండర్డు రీడ్లను, 8 వార్పింగు మిషన్లను, 60 స్లేలను, ఒక ప్రెస్ మిషనులను సరఫరా చేయడానికి, బట్ట నాణ్యాన్ని పెంపొందించడం కోసం, నియమించబడ్డ ముగ్గురు సాంకేతిక సహాయకులను కొనసాగించ డానికి గాను ప్రత్యేకించ బడింది

## ము ద రా

చేనేత బట్టల విక్రయాన్ని ప్రోత్సహించేటందుకు, తద్వారా ఉత్పత్తిని పెంచేటందుకు ఆంధ్ర చేనేత సహకార సంఘం, ప్రాథమిక చేనేత కార్మికుల సహకార సంఘాల విక్రయ శాలలచే అమ్మబడే చేనేత వస్త్రాల అమ్మకం మీద ముదరా ఇవ్వబడుతున్నది. అమ్మకం మీద రూపాయకు 6 న. పై. లు మామూలుగా ముదరా ఇవ్వబడుతుంది. కాని సంఘాలలోనిల్వ ఉండి పోయిన సరకును విక్రయించడానికి వీలుగా అప్పుడప్పుడు ప్రత్యేక ముదరాకూడా ఇవ్వబడుతున్నది.

ఈ సంవత్సరపు ప్రణాళికలో ఈ పథకం కోసం రు. 35.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులో రు. 4.00 లక్షలు ఈ జిల్లాలో ముదరా ఇవ్వడానికి వినియోగించ బడతాయి.

## పట్టు చేనేత పరిశ్రమ అభివృద్ధి

ఆంధ్ర ప్రాంతంలో పట్టు చేనేత పరిశ్రమకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.08 లక్ష కేటాయించ బడింది. ఇందులో రు. 0.06 లక్ష ఈ జిల్లాలో క్రింది వాటి కోసం వినియోగించ బడుతుంది.

1. సహకార వ్యవస్థక్రిందకు అదనంగా 50 మగ్గాలను తేవడం.
2. ఒక మార్కెటింగు డిపోను స్థాపించడం.
3. సిల్కు ప్రోసెసింగు ఫ్యాక్టరీని స్థాపించడం.
4. గుడ్డ నాణ్యతను సరిచూసేటందుకు టెక్నికల్ అసిస్టెంటును నియమించడం.

ఈ జిల్లాలో 0.40 లక్ష గజాల పట్టుగుడ్డను ఉత్పత్తి చేయడం జరుగుతుందని ఆశించబడుతున్నది.

## రోడ్లు

### ప్రభుత్వ రోడ్లు (బకాయి పనులు)

ఆంధ్రప్రాంతంలోని బకాయిరోడ్డు పనులను కొనసాగించడానికి 1959–60 సంవత్సరానికి రు. 2.93 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0.101 లక్ష ఈ క్రింది కార్యక్రమాల కోసం ఈ జిల్లాకు కేటాయించ బడింది.

| వరుస సంఖ్య | పని వివరము | 1959–60లో కేటాయించబడిన మొత్తం (రూ. లక్షలలో) |
|---|---|---|
| 1. | కె. ఎన్. ఎఫ్. రోడ్డులో 48/4– 54–4 మైళ్ళ మధ్య దుమ్ము రేగకుండా చేయడం. | 0.050 |
| 2. | కపిలేశ్వరపురం రేవునుండి కొత్తపేటకు రోడ్డు నిర్మాణం. | 0.050 |
| 3. | అంబాజిపేట–గంటి కొత్తపేటరోడ్డు మై. 11/3 వద్ద వంతెనను పునర్నిర్మించడం. | 0.001 |

## ప్రభుత్వరోడ్లు (క్రొత్తపనులు)

ఆంధ్ర ప్రాంతంలో ఈ పథకం కోసం 1959–60లో రు. 41.69 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులో రు. 18.454 లక్షల మొత్తం, ఈ జిల్లాలోని క్రింది పథకాల కోసం ప్రత్యేకించ బడింది.

| వరుస సంఖ్య | పనివివరము | 1959–60లో కేటాయించబడిన మొత్తం (రూ. లక్షలలో) |
|---|---|---|
| 1. | రాజమండ్రి–కాకినాడ రోడ్డు మీద రాజమండ్రి, కాకినాడ డివిజన్లలో వంతెనలను, కల్వర్టులను వెడల్పుచేసి పటిష్ఠం చేయడం. | 0.060 |
| 2. | రాజమండ్రి–కాకినాడ రోడ్డు కాలువగట్టు మీద సోలోపుగట్లను రక్షించడం. | 1.100 |
| 3. | మండపేట–అలమూరు రోడ్డు మీద తగు "రీచి" లలో తారు వేయడం. | 0.195 |
| 4. | భూమిని స్వాధీనం చేసుకొని బ్యాంకు కెనాలు వెంబడి కొత్తపేట వంతెననుండి ముక్తేశ్వరంరోడ్డు వరకు రోడ్డు నిర్మించడం. | 0.300 |
| 5. | ద్వారపూడినుండి సామర్లకోట కాలువమీద కట్టబడిన ఉండూరు వంతెనవరకున్న రోడ్డులో మై. 0/1 వద్ద దృఢంగా లేని వంతెనను పునర్నిర్మించడం. | 0.750 |
| 6. | రాజమండ్రి–గోకవరం రోడ్డు మై. 17/3–4 వద్దనున్న వంతెనను పునర్నిర్మించడం. | 0.049 |
| 7. | ఆర్యావటం గ్రామం దగ్గర కె.ఎన్.ఎఫ్. రోడ్డు మై. 0/6 వద్ద "బై పాస్" రోడ్డు నిర్మించడం. | 0.200 |

| | | |
|---|---|---|
| 8. | అంబాజిపేట–గంటి కొత్తపేట రోడ్డు మై. % నుండి4/0 వరకు తారువేయడం. | 0.250 |
| 9. | సామర్లకోట–గోకవరం రోడ్డుమీద %—4/0 మైళ్ల మధ్య సిమెంటు కాంక్రీటు వేయడం. | 0.550 |
| 10. | భద్రాచలంవద్ద గోదావరి నదిమీద వంతెననిర్మించడం. | 15.000 |

## ప్రభుత్వం స్వాధీనంచేసుకున్న రోడ్ల స్థాయిని పెంచడం

ఇంతకు ముందు ప్రభుత్వం వారు స్వాధీన పరచుకొన్న జిల్లాబోర్డు రోడ్ల స్థాయిని పెంచేటందుకు 1959–60 ప్రణాళికలో రూ. 20.00 లక్షల మొత్తం కేటాయించబడింది, అందులో రూ. 1.67 లక్షల మొత్తం ఈ జిల్లాలోని ఈ క్రిందిరోడ్ల స్థాయిని పెంచడం కోసం కేటాయించ బడింది.

| వరుస సంఖ్య | పథకం పేరు | 1959–60లో కేటాయించబడిన మొత్తం (రూ. లక్షలలో) |
|---|---|---|
| 1. | రాజవరం–అంకం పాలెం–పెదగట్ల పాడు–గంటి గన్నవరం–పొదలాడ రోడ్డు మీద కంకరవేయని ప్రాంతాల్లో కంకర వేయడం; బండ్ల బాటను, వంతెనలను, కల్వర్టులను పటిష్టం చేయడం; మద్రాసు డిస్ట్రిక్టు రోడ్ల స్థాయికి ఈ రోడ్లు స్థాయిని పెంచడం. | 0.52 |
| 2. | రాజమండ్రి–చినకొండపూడి రోడ్డు మీద మై. 1/8 నుండి మై. 15/0 వరకు వంతెనలను, కల్వర్టులను నిర్మించడం. | 0.20 |
| 3. | పొదలాడ–గన్నవరం రోడ్డు మీద వంతెనలను, కల్వర్టులను నిర్మించడం. | 0.20 |
| 4. | యానాం–ద్రాక్షారామం రోడ్డునువెడల్పుచేసి పటిష్టం చెయ్యడం | 0.25 |

5. వల్లూరు—కోరింగ కెనాలు రోడ్డుకు అభివృద్ధి పనులు 0.50

ఈ పథకం క్రింద ఈ జిల్లాలో క్రింది జిల్లా బోర్డు రోడ్లనుకూడ స్వాధీనంచేసుకోవడానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు కేటాయింపే మీ అవసరం లేదు.

| వరుస సంఖ్య | రోడ్డు పేరు | పొడవు, మైళ్ళలో మై. ఫ. అ. |
|---|---|---|
| 1. | కాట్రేవులపల్లి—బిక్కవోలు రోడ్డు ఎం. డి. ఆర్. 0—0—0. నుండి 13—6—60 వరకు | 13—6—60 |
| 2. | ఎల్లవరం—తిమ్మాపురంరోడ్డు ఎం. డి. ఆర్. 4—2—0 నుండి 11—5—175 వరకు | 7—3—175 |
| 3. | రాజవరం—కతుంగ—పెదగట్లపల్లి—గంటిగన్నవరంరోడ్డు | |
| (ఎ) | పెదగట్లపల్లి మీదుగా పి. పి. రోడ్డు మై. 1/1 నుండి కతుంగ వరకు (ర్యాలినుండి కల్లింగవరకు) | 4—4—140 |
| (బి) | తాటిపూడి—అంకంపాలెం రోడ్డు మై. 20/3 నుండి కల్లింగవరకు | 1—4—407 |
| (సి) | వనతవాడ వి. ఆర్. | 0—3—120 |
| (డి) | వలి చెరువునుండి రాజన్యం పంచాయతీ సరిహద్దు వరకు | 0—3—120 |
| (ఇ) | వెలి చెరువు వి. ఆర్. | 0—3— 39 |
| (ఎఫ్) | రోడ్డు చేరికలనుండి బి. కె. రోడ్డు మై. 2/5 వరకు | 1—2—342 |

4. కె. యస్. జి. రోడ్డు మై. 57/1 నుండి బెండమూర్లంక ఎం. డి. ఆర్. 0—0—0 నుండి 9—2—0 వరకు 9—2—0

## రోడ్డు ప్రక్క చెట్లు

రోడ్డు ప్రక్కచెట్లను అభివృద్ధిపరచడానికిగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో ఈ జిల్లాకు రూ. 0.06 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## ఇతర రోడ్లు (బకాయి పనులు)

మొదటి ప్రణాళికాకాలంలో ప్రారంభించబడి ముగించబడకుండా ఉన్నటువంటి పి. డబ్ల్యు. ఆర్. డి. పనులను పూర్తిచేయడానికి గాను ఆంధ్రప్రాంతంలోని జిల్లా బోర్డులకు పూర్తి గ్రాంట్లను ఇవ్వడానికి 1959—60లో రూ. 15 00 లక్షల మొత్తం ఈ పథకం క్రింద కేటాయించబడింది. అందులో రు. 0.50 లక్ష యీ జిల్లాకు కేటాయించబడింది.

## ఇతర రోడ్లు (క్రొత్తవి)

క్రొత్తపి. డబ్ల్యు. ఆర్. డి. పనులు ప్రారంభించడానికిగాను ఆంధ్రప్రాంతంలోని జిల్లా బోర్డులకు ఈ పథకం క్రింద సగం గ్రాంట్లు ఇవ్వబడతాయి. మిగిలిన సగం భాగాన్ని జిల్లా బోర్డులు, ఈ రోడ్లవల్ల లాభం పొందేవారు భరించాల్సి ఉంటుంది. 1959-60లో క్రొత్త పనులకు గాను ఆంధ్ర ప్రాంతంలోని జిల్లా బోర్డులకు గ్రాంట్లు ఇవ్వడం కోసం రూ. 6.00 లక్షలు కేటాయించ బడ్డాయి. అందులో రు. 0.40లక్ష మొత్తం యీ జిల్లాకు కేటాయించబడింది.

## గ్రామ ప్రణాళికలలో రోడ్లు

ఈ పథకం క్రింద కల్వర్టులు, వంతెనలనిర్మాణం, క్రొత్తగా గ్రామాలలోను, గ్రామాల మధ్య రోడ్లు వేయడం జరుగుతున్నది. జిల్లా కలెక్టర్లు ఈ పథకం క్రింద చేయవలసిన పనులను నిర్ణయించి నిర్వహిస్తారు. అయ్యే ఖర్చులో సగం ప్రభుత్వం వారు భరిస్తున్నారు. మిగిలింది వాటివల్ల లాభం పొందే

వారు భరిస్తున్నారు. 1959–60 లో ఈ పథకం క్రింద ఆంధ్ర ప్రాంతంలో రూ. 15.00 లక్షల మొత్తం ఖర్చు పెట్టడానికి ఉద్దేశించ బడింది. అందులో రు. 1.413 లక్షల మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

జాతీయ రహదార్ల మళ్ళింపు పథకము;
రాజ్యప్రభుత్వం వాటా

గోదావరినది యొక్క రెండుశాఖల మీద వంతెనల నిర్మాణానికి, తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాల మీదుగా మదరాసు–కలకత్తా రోడ్డు (జాతీయ రహదారి నెం. 5) మళ్ళింపుకి తలపెట్ట బడిన పథకాని కయ్యే ఖర్చులో సగం వంతు ఖర్చునుభరించేటందుకు, భారత ప్రభుత్వం సూచించి నట్టుగా తక్కువ జల దారితోకాక రాజ్యప్రభుత్వం తలపెట్టినట్లుగా పూర్తి జలదారితో గోదావరి నది శాఖ అయిన గౌతమి మీద వంతెన కట్టుటకు అగు రు. 10 లక్షల అదనపు ఖర్చును భరించేటందుకు రాజ్యప్రభుత్వం అంగీకరించింది. ఈ పథకాని కయ్యే ఖర్చుకు రాజ్య ప్రభుత్వం వాటా క్రింద 1959–60 ప్రణాళికలో రు. 4.88 లక్షల మొత్తం కేటాయించ బడింది.

## విద్య

### ప్రాథమిక విద్య

ప్రాథమిక విద్యాభివృద్ధికోసం ఈ జిల్లాకు రు. 10.318 లక్షల మొత్తం కేటాయించ బడింది. అది క్రింది విధంగా వినియోగించ బడుతుంది.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయించ బడిన మొత్తం (రూ. లక్షలలో) |
|---|---|---|
| | కొనసాగింపు పథకాలు | |
| 1. | 1958–59లో బేసిక్ శిక్షణ పాఠశాలలకు అనుబంధించబడిన ప్రీ–బేసిక్ సెక్షన్లు (ఒక సెక్షను) | 0.020 |

| | | | |
|---|---|---|---|
| 2. | 1956–57లో తెరవబడిన ప్రాథమిక పాఠశాలలు, నియమించబడిన అదనపు ఉపాధ్యాయులు. | | |
| (ఎ) | స్థానిక సంస్థలవి | (7 పాఠశాలలు) | 0.070 |
| 3. | 1957–58లో తెరవబడిన ప్రాథమిక పాఠశాలలు, నియమించబడిన అదనపు ఉపాధ్యాయులు. | | |
| (ఎ) | స్థానిక సంస్థలవి | (5 పాఠశాలలు) | 0.050 |
| (బి) | ఎయిడెడ్ వి | (7 పాఠశాలలు) | 0.070 |
| 4. | 1958–59లో ప్రారంభించబడిన ప్రాథమిక పాఠశాలలు, నియమించబడిన అదనపు ఉపాధ్యాయులు. | | |
| (ఎ) | స్థానిక సంస్థలవి | (6 పాఠశాలలు) | 0.040 |
| (బి) | ఎయిడెడ్ వి | (5 పాఠశాలలు) | 0.080 |
| 5. | 1957–58లో ప్రారంభించ బడిన జూనియరు బేసిక్ పాఠశాలలు | | |
| (ఎ) | ప్రభుత్వం వారివి (సాంఘిక సంక్షేమశాఖ) | | |
| (బి) | స్థానిక సంస్థలవి | (10 పాఠశాలలు) | 0.150 |
| (సి) | ఎయిడెడ్ వి | (10 పాఠశాలలు) | 0.150 |
| 6. | 1958–59లో ప్రారంభించబడిన జూనియర్ బేసిక్ పాఠశాలలు | | |
| (ఎ) | స్థానిక సంస్థలవి | (6 పాఠశాలలు) | 0.050 (ఎ, బి కలిపి) |
| (బి) | ఎయిడెడ్ వి | (3 ,, ) | |

7. 1957–58లో జూనియర్. బేసిక్ పాఠశాలలుగా మార్చబడిన ప్రాథమిక పాఠశాలలు

| | | |
|---|---|---|
| (ఎ) ప్రభుత్వం వారివి (సాంఘిక సంక్షేమ శాఖ) | | |
| (బి) స్థానిక సంస్థలవి (62 పాఠశాలలు) | | 0.011 |
| (సి) ఎయిడెడ్ వి ( 7 పాఠశాలలు) | | |

8. 1958–59లో జూనియర్ బేసిక్ పాఠశాలలుగా మార్చబడిన ప్రాథమిక పాఠశాలలు.

(ఎ) ఎయిడెడ్ వి (5 పాఠశాలలు) 0.002

9. ప్రాథమిక, మాధ్యమిక పాఠశాలలలోని ఉపాధ్యాయుల జీతాల హెచ్చింపుకు 4.250

10. 1956–57లో ప్రారంభించిన మాధ్యమిక పాఠశాలలు, అదనపు సెక్షన్లు.

(ఎ) స్థానిక సంస్థలవి (10 సెక్షన్లు) 0.050
(బి) ఎయిడెడ్ వి ( 7 ,, ) 0.020

11. 1957–58లో ప్రారంభించిన మాధ్యమిక పాఠశాలలు, అదనపు సెక్షన్లు

(ఎ) ప్రభుత్వం వారివి (2 సెక్షన్లు) 0.020
(బి) స్థానిక సంస్థలవి (2 పాఠశాలలు, 19 సెక్షన్లు) 0.280
(సి) ఎయిడెడ్ వి (ఒక పాఠశాల, 2 సెక్షన్లు) 0.100

12 1957–58లో మాధ్యమిక పాఠశాలలుగా మార్చబడిన హైయ్యర్ ఎలిమెంటరీ పాఠశాలలు.

(ఎ) స్థానిక సంస్థలవి. (ఒక పాఠశాల) 0.040

13. 1958–59లో ప్రారంభించిన మాధ్యమిక పాఠశాలలు, అదనపు సెక్షనులు (ప్రభుత్వానివి) (2 పాఠశాలలు, 2 సెక్షన్లు) 0.180

| | | |
|---|---|---|
| 14. | 1957–58 లోను, 1958–59లోను ప్రారంభించిన ప్రభుత్వ మాధ్యమికపాఠశాలలకు భవనాలు, ఆటస్థలాలు (2 పాఠశాలలు) | 0.120 |
| 15. | 1958–59లో కొన్ని ప్రభుత్వ శిక్షణ పాఠశాలల్లో స్థాయి పెంచబడిన హెడ్‌మాస్టర్లకు (ఒకరు) | 0.010 |
| 16. | 1956–57లో సెకండరీ గ్రేడు ట్రైనింగు సెక్షన్లుగా మార్చబడిన హైయరు ఎలిమెంటరీ గ్రేడు ట్రైనింగు సెక్షన్లు. | 0.010 |
| 17. | 1958–59లో ప్రభుత్వ ట్రైనింగు పాఠశాలలలో నియమించబడిన డ్రాయింగు, హిందీ టీచర్లు (ఒకటీచరు) | 0.010 |
| 18. | 1957–58లో ఇన్‌స్పెక్టరేటులలో నియమించబడిన గుమాస్తాలు, టైపిస్టులు (ఆరుగురు) | 0.050 |
| 19. | 1958–59లో నియమించబడిన సీనియరు డిప్యూటీ ఇన్‌స్పెక్టర్లు, జవానులతో సహా (10 మంది) | 0.180 |
| 20. | 1958–59లో ఇనస్పెక్టరేటులలో నియమించబడిన అప్పరు డివిజను గుమాస్తాలు (ఒకరు) | 0.020 |
| 21. | III. ఫారం వరకు ఉచిత విద్యా పథకాన్ని అమలుపరచడానికి ఇన్‌స్పెక్టరేట్లలో నియమించబడిన అప్పరు డివిజను గుమాస్తాలు (4 గురు గుమాస్తాలు) | 0.060 |

క్రొత్త పథకాలు

| | | |
|---|---|---|
| 22. | విద్యావంతులలో నిరుద్యోగాన్ని నివారించడానికి పథకం. | 1.090 |

| | | |
|---|---|---|
| 23. | ప్రాథమిక పాఠశాలల్లో అదనపు ఉపాధ్యాయుల నియామకం (27 గురు ఉపాధ్యాయులు) | 0.130 |
| 24. | ప్రాథమిక పాఠశాలలను జూనియరు బేసిక్ పాఠశాలలుగా మార్చడం. | |
| (ఎ) | స్థానిక సంస్థలవి (21 పాఠశాలలు) | 0.070 |
| (బి) | ఎయిడెడ్‌వి ( 7 పాఠశాలలు) | 0.020 |
| 25. | జిల్లాబోర్డులు ఎయిడెడ్ ప్రాథమిక పాఠశాలలను స్వాధీన పరచుకోవడం. | 0.970 |
| 26. | 1958–59లో మాధ్యమిక పాఠశాలలుగా మార్చబడిన హైయ్యర్ ఎలిమెంటరీ పాఠశాలలకు గ్రాంటులు (ఎయిడెడ్) (ఒకపాఠశాల) | 0.060 |
| 27. | మాధ్యమిక పాఠశాలలుగా హైయ్యర్ ఎలిమెంటరీ ఎయిడెడ్ పాఠశాలలను మార్చడం (కాంపెన్సేటరీ గ్రాంటు) (ఒకపాఠశాల) | 0.050 |
| 28. | 1958–59లో ప్రారంభించిన మాధ్యమిక పాఠశాలలకు, అదనపు సెక్షనులకు గ్రాంటులు. | |
| (ఎ) | ఎయిడెడ్‌వి (4 పాఠశాలలు) | 0.010 |
| (బి) | స్థానిక సంస్థలవి (15 పాఠశాలలు) | 0.400 |
| 29. | మాధ్యమిక పాఠశాలల్లో అదనపు సెక్షన్లు తెరవడం (ఎయిడెడ్) (7 పాఠశాలలు) కాంపెన్సేటరీగ్రాంటు | 0.060 |
| 30. | బాలికలకుగాను ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలను ప్రారంభించడం. | 0.270 |

| | | |
|---|---|---|
| 31. | 1958–59లో ప్రారంభించబడిన ప్రాచ్యవిద్యా మాధ్యమిక పాఠశాలలకు, అదనపు సెక్షన్లకు గ్రాంట్లు, (ఎ) ఎయిడెడ్ (నాలుగు సెక్షన్లు) | 0.040 |
| 32. | ప్రభుత్వ పాఠశాలలో అదనపు (మాధ్యమిక) సెక్షన్లు ప్రారంభించడం (2 సెక్షన్లు) | 0.030 |
| 33. | ఏజన్సీ ప్రాంతాల్లో మాధ్యమిక పాఠశాలలను ప్రారంభించడం; ప్రాథమికోన్నత పాఠశాలలను మాధ్యమిక పాఠశాలలుగా మార్చడం. (ప్రభుత్వం వారివి—ఒక పాఠశాల, రెండు సెక్షన్లు) | 0.220 |
| 34. | శిక్షణ పాఠశాలలను బేసిక్ పద్ధతికి మార్చడం (ఎ) ఎయిడెడ్ (ఒక పాఠశాల) | 0.420 |
| 35. | ప్రభుత్వ బేసిక్ ట్రైనింగు పాఠశాలలలో అంబరు చర్ఖా పథకం. (2 పాఠశాలలు) | 0.010 |
| 36. | జిల్లా విద్యా శాఖాధికారులకు జీపులు (3 జీపులు) | 0.460 |
| 37. | ప్రాచ్య విద్యా పాఠశాలల ఇన్‌స్పెక్టరేటులో ఒక గుమాస్తా నియామకం. | 0.010 |
| | మొత్తం | 10.313 |

## సెకండరీ విద్య

సెకండరీ విద్య అభివృద్ధికోసం ఈ జిల్లాకు రు. 3.205 లక్షల మొత్తం కేటాయించబడింది. అది ఈ క్రింది విధంగా వినియోగించ బడుతుంది.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయింపు మొత్తం (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| | కొనసాగుతున్న పథకాలు | |
| 1. | 1956–57లో ప్రారంభించబడినఉన్నత పాఠశాలలు, అదనపు సెక్షన్లు | |
| (ఎ) | ప్రభుత్వం వారివి (2 సెక్షన్లు) | 0.020 |
| (బి) | స్థానిక సంస్థలవి (ఒకపాఠశాల, 12 సెక్షన్లు) | 0.090 |
| (సి) | ఎయిడెడ్ వి (3 సెక్షన్లు) | 0.020 |
| 2. | 1957–58లో ప్రారంభించబడిన ఉన్నత పాఠశాలలు, అదనపు సెక్షన్లు. | |
| (ఎ) | స్థానిక సంస్థలవి (ఒకపాఠశాల 17 సెక్షన్లు) | 0.240 |
| (బి) | ఎయిడెడ్ వి (2 సెక్షన్లు) | 0.020 |
| 3. | 1957–58లో హైయ్యరు సెంకండరీ పాఠశాలలుగా స్థాయిపెంచబడిన ఉన్నత పాఠశాలలు. | |
| (ఎ) | ప్రభుత్వానివి (ఒకపాఠశాల) | 0.020 |
| (బి) | స్థానిక సంస్థలవి (3 పాఠశాలలు) | 0.070 |
| 4. | ఉన్నత పాఠశాలలకు బిల్డింగుగ్రాంట్లు. | |
| (ఎ) | స్థానిక సంస్థలవి | 0.090 |
| (బి) | ఎయిడెడ్ వి | 0.020 |
| 5. | హైయ్యర్ సెకండరీ పాఠశాలలకు బిల్డింగు గ్రాంట్లు | |
| (ఎ) | స్థానిక సంస్థలవి (ఒకటి) | 0.100 |
| 6. | సెకండరీ పాఠశాలలలో ఉపాధ్యాయుల జీతాలు పెచ్చింపుకు. | 0.940 |
| 7. | 1958–59లో శిక్షణ కళాశాలలో పునర్వ్యవస్థీకరించ బడిన సిబ్బందికి | 0.040 |

| | | |
|---|---|---|
| 8. | 1957–58 నియమించ బడిన జిల్లా విద్యా శాఖాధికార్లు (ఒక అఫీసరు) | 0.250 |
| | **క్రొత్త పథకాలు** | |
| 9. | 1958–59లో ప్రారంభించబడిన ఉన్నత పాఠశాలలు, అదనపు సెక్షన్లకు గ్రాంట్లు. | |
| | (ఎ) స్థానిక సంస్థలవి | 0.100 |
| | (బి) ఎయిడెడ్‌వి | 0.050 |
| 10. | ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలను ఉన్నత పాఠశాలలుగా మార్చడం, సెకండరీ పాఠశాలల్లో అదనపు సెక్షన్లను ఏర్పాటు చేయడం. | 0.020 |
| 11. | ఉన్నతపాఠ శాలలను హైయర్ సెకండరీ పాఠశాలలుగా మార్చడం (ఎ) ఎయిడెడ్ (ఒక పాఠశాల) | 0.500 |
| 12. | ఉన్నత పాఠశాలలకు బిల్డింగు గ్రాంట్లు | |
| | (ఎ) స్థానిక సంస్థలవి | 0.100 |
| | (బి) ఎయిడెడ్‌వి | 0.200 |
| 13. | ఉన్నత పాఠశాలలకు ఫర్నీచరు, పరికరాలకు గ్రాంట్లు | |
| | (ఎ) స్థానిక సంస్థలవి | 0.100 |
| | (బి) ఎయిడెడ్‌వి | 0.100 |
| 14. | ప్రభుత్వ శిక్షణ పాఠశాలలను పటిష్ఠం చేయడం. | 0.010 |
| 15. | ప్రభుత్వం శిక్షణ కళాశాలల్లో అదనంగా ట్యూటర్లు, అసిస్టెంటు లెక్చరర్ల నియామకం | 0.030 |
| 16. | XI, XII తరగతుల విద్యార్థులకు స్కాలరు షిప్పులు. | 0.005 |

| | | |
|---|---|---|
| 17. | టి. టి. సి. కోర్సుల నిర్వహణకు. | 0.020 |
| 18. | హిందీటీచర్ల సెమినార్లు (సమాలోచనములు), వక్తృత్వ పోటీల నిర్వహణ | 0.040 |
| 19. | ప్రభుత్వ బాలుర బహుళార్థ సాధక, హైయర్ సెకండరీ పాఠశాలలలో ఫిజికల్ డైరెక్టర్ల నియామకం, (4గురు) | 0.050 |
| | మొత్తం | 3.205 |

## యూనివర్సిటీ విద్య

ఆంధ్ర ప్రాంతంలో యూనివర్శిటీ విద్య అభివృద్ధికోసం ప్రణాళిక మొదటి 3 సంవత్సరాలలో రూ. 34.64 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ సంవత్సరంలో రూ.24.56లక్షలమొత్తం ఆంధ్రప్రాంతం ప్రణాళికలో కేటాయించబడింది. అందులో రూ. 4.33 లక్షల మొత్తం ఈ క్రింది పథకాలకోసం ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయింపు మొత్తం (రూ. లక్షలలో) |
|---|---|---|
| | **కొనసాగుతున్న పథకాలు** | |
| 1. | ప్రాచ్యవిద్యా కళాశాలలకు గ్రాంట్లు | 0.10 |
| 2. | ప్రభుత్వ కళాశాలలలో ప్రీ-యూనివర్శిటీ విద్య కోర్సులకు (1956–57లో ప్రారంభించినవి) | 0.17 |
| 3. | ప్రభుత్వ ఆర్ట్సు, ట్రైనింగు కళాశాలలలో నియమించబడిన అదనపు సిబ్బంది | 0.02 |
| | **క్రొత్త పథకాలు** | |
| 4. | కళాశాలల్లో 3 సం. డిగ్రీకోర్సు ప్రవేశపెట్టడం | |

| | | | |
|---|---|---|---|
| | (ఎ) | ప్రభుత్వానివి (రెండు కళాశాలలు) | 1 30 |
| | (బి) | ఎయిడెడ్‌వి (ఒక కళాశాల) | 0.28 |
| 5. | | ప్రభుత్వ ఆర్ట్సు కళాశాలలకు మెడికల్ యూనిట్లు | 0.08 |
| 6. | | కాకినాడలోని పి. ఆర్. ప్రభుత్వ ఆర్ట్సు కళాశాలకు భవనాలు | 2.43 |
| | | మొత్తం | 4.33 |

ఇతర పథకాలు

ఇతర పథకాల పద్దుకింద ఈ జిల్లాలో రూ. 0.92 లక్ష మొత్తం ఖర్చు పెట్టబడుతుంది. ఈ డబ్బు క్రింది విధంగా ఖర్చుపెట్టబడుతుంది.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయింపు మొత్తం (రూ. లక్షలలో) |
|---|---|---|
| | **ఇతర పథకాలు** | |
| 1. | ఎన్. సి. సి. ఏ. సి. సి విస్తరణకు | 0.68 |
| 2. | బాలభటుల, గర్లుగైడ్ల ఉద్యమాభివృద్ధికి | 0.03 |
| 3. | అవిటివారికిగాను ఏర్పాటు చేయబడిన ప్రత్యేక పాఠశాలల అభివృద్ధికి (ఒక పాఠశాల) | 0.02 |
| | **క్రొత్త పథకాలు** | |
| 4. | పంచాయతీ, ప్రైవేటు, సహకార, గ్రామ సంఘ, స్థానిక సంస్థల గ్రంథాలయాలకు గ్రాంట్లు | 0 08 |
| 5. | ఎన్. సి. సి. యూనిట్టుకు ఏరోమాడలింగు, షిప్పు మాడలింగు పరికరాల సరఫరా | 0.01 |
| 6. | అవిటివారికోసం ఉన్న ప్రభుత్వ ప్రత్యేక పాఠశాలల్లో అదనపు సిబ్బంది నియామకం | 0.03 |

| | | |
|---|---|---|
| 7. | హిందీ ప్రేమీమండలుల గ్రంథాలయాలకు గ్రాంటులు | 0.01 |
| 8. | యువజన సంక్షేమ కార్యకలాపాలు | 0.02 |
| 9. | ఎన్.సి.సి. ఏ సి.సి. యూనిట్ల చౌకిదార్ల జీతాల సవరింపుకు | 0.01 |
| 10. | అవిటివారికి స్కాలరుషిప్పులు | 0.01 |
| 11. | అవిటివారికోసం ఉన్న ప్రభుత్వ ప్రత్యేక పాఠశాలలో చదువుకొంటున్న విద్యార్థులకిచ్చే అలవెన్సులను ప్రామాణీకరించుటకు. | 0.02 |
| | మొత్తం | 0.92 |

## సాంకేతిక విద్య

### కాకినాడలోని ఆంధ్ర పాలిటెక్నిక్ అభివృద్ధి

కాకినాడలో ఉన్న ఆంధ్ర పాలిటెక్నిక్ అభివృద్ధికోసం రెండవ ప్రణాళికలో రు. 4.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ మొత్తం కేటాయింపంతా పరికరాల కొనుగోలు కోసం ఉద్దేశించబడింది. ఇంత వరకు రు. 2.50 లక్షలు ఖరీదయ్యే పరికరాలు సరఫరా చేయబడినాయి. ఈ సంవత్సరం రు. 0.50 లక్ష ఖరీదయ్యే పరికరాలు కొనడానికి ప్రతిపాదింపబడింది. ఈ మొత్తం 1959–60 ప్రణాళికలో కేటాయించబడింది. ఇంతే కాక అదనపు పరికరాలను సమకూర్చడంద్వారాను, భవనాలనునిర్మించడంద్వారాను యీపాలిటెక్నిక్‌ను విస్తరింపచేయడం కోసం కేంద్ర ప్రతిపాదిత పథకాల క్రింద రు. 3.02 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 2.57 లక్షల మొత్తం కేంద్ర ప్రభుత్వము, రు. 0.45లక్ష రాజ్య ప్రభుత్వము భరిస్తాయి.

### కాకినాడ ఇంజనీరింగ్ కళాశాలలో డిప్లొమా కోర్సులు

రెండవ పంచవర్ష ప్రణాళిక యొక్క తొలి సంవత్సరాలలో ఇంజనీరింగులో శిక్షణ పొందినట్టివారి కొరత చాల ఎక్కువగా ఉన్న కారణంగా ప్రణాళిక సంఘంవారిచే నియమించబడిన "ఇంజనీరింగ్ పర్సనల్ కమిటీ" వారి సిఫారసులను

అనుసరించి "కం|ప్రెస్‌డ్ డిప్లొమా కోర్సు"లు కాకినాడ ఇంజనీరింగ్ కళాశాలలో ప్రారంభించబడినాయి. 1957–58లో యీపరిస్థితంతా పరిశీలించబడింది. తరువాత పాలిటెక్నిక్ సంస్థలలో ఉండే మామూలు మూడు సంవత్సరాల డిప్లొమా కోర్సులతో కలిపి వేయడానికి ప్రతిపాదింపబడింది. అదే ప్రకారం 1957–58 లో "కం|ప్రెస్‌డ్ డిప్లొమా కోర్సులు"రద్దు చేయబడినాయి. కాకినాడలో ఈ కోర్సులకు లభ్యం చేయబడినటువంటి సీట్లు ఉయ్యూరు, తిరుపతి పాలిటెక్నిక్‌ల మధ్య సరిసమానంగా పంపకం చేయబడినాయి. 1956–57లో ఇంజనీరింగ్ కళాశాలలో "కం|ప్రెస్‌డ్ డిప్లొమా కోర్సు" లకు చేర్చుకోబడిన విద్యార్థులు యీ సంస్థలో శిక్షణ పూర్తి చేసుకొనేవరకు యివి కొనసాగించ బడతాయి. ఈ సంవత్సరం కేటాయించబడిన రు. 0.98 లక్ష యీ కోర్సులు కలిపి వేయబడిన తరువాత ఉయ్యూరు, తిరుపతి పాలిటెక్నిక్‌ల మధ్య సమానంగా పంపిణీ చేయబడుతుంది. ఈ డబ్బు సిబ్బంది జీతాల|క్రింద, యితర చిల్లర ఖర్చులక్రింద వినియోగించబడుతుంది.

## కాకినాడలోని ఇంజనీరింగ్ కళాశాలలో "టెలికమ్యూనికేషన్ కోర్సు"ను ప్రారంభించడం

1957–58లో డిగ్రీ స్థాయిలో టెలికమ్యూనికేషన్ కోర్సు కాకినాడలోని ఇంజనీరింగ్ కళాశాలలో ప్రారంభించబడింది. ఏటా 30 మంది విద్యార్థులను చేర్చుకోవడానికి వీలుంది. ఈ పథకం కోసం రెండవ ప్రణాళికలో కేటాయించ బడిన రు. 5.00 లక్షలలో రు. 2.59 లక్షల మొత్తం యీ సంవత్సరం వినియోగించ బడుతుంది. ఇందులో రు. 0.60 లక్ష పరికరాల కొనుగోలుకు, రు. 0.50 లక్ష భవనాల నిర్మాణానికి ఖర్చుపెట్టడం జరుగుతుంది.

## కాకినాడ, అనంతపురం ఇంజనీరింగ్ కళాశాలల్లో ప్రీ—ప్రొఫెషనల్ కోర్సులను ప్రారంభించడం

కాకినాడ, అనంతపురం ఇంజనీరింగ్ కళాశాలల్లో ప్రీ–ప్రొఫెషనల్ కోర్సులు 1958–59లో ప్రారంభించబడినాయి. ఒక్కొక్క కళాశాలలో 150 మందిని చేర్చుకోవడానికి వీలుంది. అదనపు వసతి సౌకర్యాన్ని కలిగించ

డం కోసం పై రెండు కళాశాలల్లోను భవనాల నిర్మాణం ప్రారంభించబడింది. ఈ సంవత్సరం ప్రణాళికలో రు. 1.49 లక్షల మొత్తం పరికరాల కొనుగోలుకు (రు. 0.50 లక్ష), భవనాల నిర్మాణానికి (రు. 0.11 లక్ష), జీతాలు, యితర చిల్లర ఖర్చులకు (రు. 0.88 లక్ష) గాను కేటాయించబడింది.

# వైద్యం

## కాంపౌండర్లకు శిక్షణ

ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు, ఇతర వైద్య సంస్థలకు కావలసిన కాంపౌండర్ల కోసం, రెండవ ప్రణాళికా కాలంలో 495 మంది కాంపౌండర్లకు అదనంగా శిక్షణ యివ్వడానికి తలపెట్టబడింది. జిల్లా హెడ్ క్వార్టర్సు ఆసుపత్రుల లోను, బోధనచేసే ఇతర ఆసుపత్రులలోను గల 11 శిక్షణ కేంద్రాలలో ఏటా 99 మందికి శిక్షణ ఇవ్వబడుతుంది. అదే ప్రకారం 1956–57,1958–59ల మధ్య 297 మంది కాంపౌండర్ల కు శిక్షణ ఇవ్వబడింది. ఇంకా 99 మంది కాంపౌండర్లకు శిక్షణ ఇచ్చేటందుకు ఈ సంవత్సరంలో రూ. 0.22 లక్ష మొత్తం ప్రత్యేకించబడింది. ఇందులో రూ. 0.02 లక్ష మొత్తం, కాకినాడలోని జిల్లా హెడ్ క్వార్టర్సు ఆసుపత్రిలో 9 మంది కాంపౌండర్లకు శిక్షణ ఇవ్వడానికి ఈ జిల్లాకు కేటాయించబడింది.

## మంత్రసానులకు శిక్షణ

అదనంగా 90 మందికి మంత్రసానులుగా శిక్షణ యివ్వడంకోసం యీ సంవత్సరం ప్రణాళికలో రు. 1.26 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో 18 మందికి రు. 0.25 లక్ష వ్యయంతో ఈ జిల్లాలోని కాకినాడలో ఉన్న జిల్లా హెడ్ క్వార్టర్సు ఆసుపత్రిలో శిక్షణ యివ్వబడుతుంది.

## నర్సులకు శిక్షణ

ఈ పథకంక్రింద రెండవ ప్రణాళికాకాలంలో ప్రతి సంవత్సరం 95 మంది నర్సులుగా శిక్షణపొందే నిమిత్తం అదనంగా చేర్చుకోబడినారు. ఈ సంవత్సరం 95 మందితో కూడిన నాలుగవ జట్టు అభ్యర్థులు వివిధ శిక్షణ సంస్థలలో శిక్షణ నిమిత్తం చేర్చుకోబడతారు. ఇందుకోసం 1959–60 ప్రణాళికలో

రు. 2.23 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.43 లక్ష వ్యయంతో 20 మంది అభ్యర్థులకు కాకినాడలోని ప్రభుత్వ హెడ్ క్వార్టర్సు ఆసుపత్రిలో శిక్షణ యివ్వబడుతుంది.

## జిల్లా కేంద్ర ఆసుపత్రులకు అభివృద్ధి పనులు

రెండవ ప్రణాళికయొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో రు. 13.00 లక్షల వ్యయంతో ఆంధ్రలోని జిల్లా కేంద్రాలలో ఉన్న ఆసుపత్రులకు అదనపు భవనాలు నిర్మించడం, పరికరాలను సమకూర్చడం, సిబ్బందిని సమకూర్చడం మొదలయి నటువంటి అభివృద్ధి పనులు చేయబడినాయి. ఈ సంవత్సరం ప్రణాళికలో యింకా రు. 9.00 లక్షల మొత్తం జిల్లా ఆసుపత్రులను అభివృద్ధి చేయుటకుగాను కేటాయించబడింది. ఇందులో రు. 1.00 లక్ష కాకినాడలోని జిల్లా ఆసుపత్రిని అభివృద్ధి చేయడంకోసం ప్రత్యేకించబడింది.

## తాలూకా హెడ్ క్వార్టర్సు ఆసుపత్రులకు అభివృద్ధి పనులు

పడకల సంఖ్యను పెంచడం, అదనంగా భవనాలను నిర్మించడం ద్వారా ఆంధ్ర ప్రాంతంలోని తాలూకా ఆసుపత్రులను అభివృద్ధి పరచుటకుగాను రూ.4.71లక్షలమొత్తం రెండవ ప్రణాళికలోని మొదటి మూడుసంవత్సరాలలో ఖర్చు పెట్టబడింది. తాలూకా ఆసుపత్రుల అభివృద్ధి కోసం ప్రణాళికలో రూ. 1.60 లక్షల మొత్తం ఈ సంవత్సరంలో కేటాయింపబడింది. అందులో రూ. 0.13 లక్ష మొత్తం, పడకలను ఎక్కువ చేయడం వల్ల తాలూకా ఆసుపత్రులలో ఇంతకు ముందు నియమించబడిన సిబ్బందిని కొనసాగించడానికి, రాజమండ్రిలోని ప్రభుత్వ ఆసుపత్రిని యీ సంవత్సరం అభివృద్ధిచేయడానికి గాను యీ జిల్లాలో వినియోగించ బడుతుంది.

## లోకలు ఫండు ఆసుపత్రిలను స్వాధీనం చేసుకోవడం

ఈ సంవత్సరపు ప్రణాళికలో ఈ పథకంకోసం రూ. 3.45లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రూ. 0.36లక్ష మొత్తం 1956–59లలో ప్రభుత్వ స్వాధీనం చేసుకొన్న కొత్తపేట, కపిలేశ్వరపురం, పిఠాపురం ఆసుపత్రుల నిర్వహణ నిమిత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## జిల్లా లేబరేటరీలు, ప్రాంతీయ లేబరేటరీలు

1957—59లలో స్థాపించబడిన 2 ప్రాంతీయ లేబరేటరీలను, 2 జిల్లా లేబరేటరీలను నిర్వహించడమే కాకుండా, రెండు జిల్లా లేబరీటరీలను క్రొత్తగా స్థాపించడానికి ఈ సంవత్సరపు ప్రణాళికలో రూ. 0.72లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో రూ. 0.10లక్ష మొత్తం, 1958—59లో నెలకొల్పబడిన కాకినాడలోని జిల్లా లేబరేటరీ నిర్వహణకోసం ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## క్షయ చికిత్సా కేంద్రాలు

రెండవప్రణాళిక యొక్క మొదటి 3 సంవత్సరాలలో ఆంధ్రప్రాంతంలో 10 క్షయ చికిత్సా కేంద్రాలు తెరవబడ్డాయి. ఈ సంవత్సరంలో, ఇది వరకు తెరవ బడిన వాటిని నిర్వహించడమే కాకుండా మరి 4 క్లినిక్కులను ప్రారంభించేడానికి తలపెట్టబడింది. అందుకోసం 1959—60 ప్రణాళికలో రూ. 3.00 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రూ. 0.50 లక్ష 1956—57లో కాకినాడలోని జిల్లా ఆసుపత్రిలో స్థాపించిన క్షయ చికిత్సా కేంద్రాన్ని కొనసాగించడానికి, రాజమండ్రిలోని ప్రభుత్వ ఆసుపత్రిలో మరొక కేంద్రాన్ని నెలకొల్పడానికి గాను ప్రత్యేకించబడింది.

## కుటుంబ నియంత్రణ కేంద్రాలు

దేశంలోని జనాభా త్వరితంగా పెరుగుతుండడం వల్లను, దేశంలోని సంపద పరిమితం కావడం వల్లను జనాభా పెరుగుదలను అరికట్టే సమస్యకు ప్రాముఖ్యత ఏర్పడింది. ఇందుకోసం 13 ఆంధ్రలోను, 7 తెలంగాణాలోను మొత్తం 20 కుటుంబ నియంత్రణ కేంద్రాలు 1957—59లలో నెలకొల్పబడ్డాయి. ఈ సంవత్సరంలో ఇంతకు ముందు నెలకొల్పబడిన కేంద్రాలను నిర్వహించడమే కాకుండా మరొక 10 కేంద్రాలను ఆంధ్రలోను, 5 తెలంగాణలోను మొత్తం 15 కేంద్రాలను నెలకొల్పడానికి తలపెట్టబడింది. అందుకోసం 1959-60 ప్రణాళికలో రూ. 0.66 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో రూ. 0.04 లక్ష మొత్తం ఈ జిల్లాలో వినియోగించబడుతుంది. రాజమండ్రిలో ఒక కుటుంబ

నియంత్రణ కేంద్రాన్ని స్థాపించడానికి, 1958–59లో సామర్లకోటలో స్థాపించ బడిన కుటుంబ నియంత్రణ కేంద్రాన్ని నిర్వహించడానికి పై డబ్బు వినియోగించ బడుతుంది.

### సహాయక నర్సు—మంత్రసానులు

సహాయక నర్సు—మంత్రసానుల శిక్షణకుగాను ఇదివరకు ప్రారంభించబడిన5 కేంద్రాలను నిర్వహించడానికి, ఈ సంవత్సరంలో మరి రెండు కేంద్రాలను ప్రారంభించడానికిగాను ఈ సంవత్సరం ప్రణాళికలో రూ. 0.78 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో రూ. 0.10 లక్ష రాజమండ్రిలో ఒక శిక్షణ కేంద్రాన్ని ఏర్పాటు చేయడానికి ప్రత్యేకించబడింది.

### ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు

ఈ పథకం క్రింద గ్రామీణ ప్రజల అవసరాలను తీర్చడానికిగాను బ్లాకు ప్రాంతాలలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు స్థాపించ బడతాయి. ఈ సంవత్సరపు ప్రణాళికలో ఈ పథకం క్రింద రూ. 15.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులో రు. 1.50 లక్షల మొత్తం, ఇంతకు ముందు స్థాపించబడిన కేంద్రాలను కొనసాగించడానికి, 4 ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలను నెలకొల్పడానికి గాను ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

### ఇంటర్నీ శిక్షణ నిమిత్తం హెడ్ క్వార్టర్సు ఆసుపత్రుల స్థాయిని పెంచడం

క్రొత్త నిబంధనల ప్రకారం, ఎం. బి. బి. ఎస్., విద్యార్థులు ఒక సంవత్సరం పాటు ప్రభుత్వంవారిచే గుర్తించబడిన వైద్య సంస్థలలో "ఇంటర్నీ" లుగా శిక్షణ పొందాలి. ఈ ఇంటర్నీలకు అదనపు వసతి సౌకర్యాన్ని కలిగించడం కోసం ఏలూరులో వసతిగృహాలు నిర్మించడం ప్రారంభించబడింది. ఈ సంవత్సరం వీటి నిర్మాణం పూర్తవుతుంది. 1959-60లో విశాఖ పట్టణంలోని ఆంధ్ర వైద్య కళాశాలలోను, కాకినాడలోని జిల్లా హెడ్ క్వార్టర్సు ఆసుపత్రిలోను "ఇంటర్నీ"లకు గాను అదనపు వసతి గృహాలను నిర్మించడానికి కూడ ప్రతిపాదించ బడింది. ఈ పథకానికిగాను కేటాయించబడిన రు. 0.50 లక్షలో రు. 0.10

లక్ష కాకినాడలోని జిల్లా ఆసుపత్రిలో అదనపు వసతి గృహాలను నిర్మించడంకోసం ప్రత్యేకించబడింది.

## దంత వైద్య కళాశాల, దంత చికిత్సాలయాలను స్థాపించడం

ఈ పథకం క్రింద రు. 3.06 లక్షల మొత్తం—ఆంధ్రప్రాంతపు ప్రణాళికలో రు. 2.50 లక్షలు, తెలంగాణాప్రాంతపు ప్రణాళికలో రు. 0.56లక్ష-కేటాయించబడింది. ఇంతకు ముందు ఏర్పాటు చేయబడిన దంత చికిత్సాలయాల నిర్వహణకు, క్రొత్తవాటిని స్థాపించడానికి, హైదరాబాదులోని ఉస్మానియా వైద్య కళాశాలలో 1958–59లో ఏర్పాటు చేయబడిన దంత శాస్త్ర విభాగాన్ని కొనసాగించడానికి గాను పై డబ్బు వినియోగించబడుతుంది. ఇందులో రు. 0.20 లక్ష 1956–57లో కాకినాడలోని ప్రభుత్వ హెడ్ క్వార్టర్సు ఆసుపత్రిలో ఏర్పాటు చేయబడినదంత చికిత్సా విభాగాన్ని కొనసాగించడం కోసం ప్రత్యేకించబడింది.

## క్షయ రోగులకు ప్రత్యేక పడకలు ఏర్పాటుచేయడం

ఈ సంవత్సరం ఆంధ్ర ప్రాంతంలో క్షయ రోగులకుగాను 290 ప్రత్యేక పడకలు ఏర్పాటు చేయబడతాయి. ఇంతే కాక యింతకు ముందు ఏర్పాటు చేయబడిన ప్రత్యేక పడకల నిర్వహణ కొనసాగుతుంది. ఇందుకోసం రు. 5.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.70 లక్ష ఒక జిల్లాకోసం ప్రత్యేకించబడింది. కాకినాడలోని ప్రభుత్వ హెడ్‌క్వార్టర్సు ఆసుపత్రిలో క్షయ రోగులకుగాను 50 ప్రత్యేక పడకలను ఏర్పాటు చేయడంకోసం పై డబ్బు వినియోగించబడుతుంది.

## భద్రాచలం, తిరుపతిలలో అంటువ్యాధులఆసుపత్రులు

భద్రాచలం, తిరుపతిలలో నిర్మాణంలో ఉన్న అంటువ్యాధుల ఆసుపత్రులు 1959–60లో పూర్తిచేయబడతాయి. ఇందుకు రు. 1.50 లక్షల మొత్తం కేటాయించబడింది.

### సుఖవ్యాధి చికిత్సా కేంద్రాలు

ఇంతకు ముందు స్థాపించిన 6సుఖవ్యాధిచికిత్సా కేంద్రాలను కొనసాగించడానికి, ఈ సంవత్సరం మరో 3 కేంద్రాలను నెలకొల్పడానికిగాను ఈసంవత్సరపుప్రణాళికలోరూ. 1.70 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రూ. ^.20 లక్ష మొత్తం,కాకినాడలోని ప్రభుత్వహెడ్ క్వార్టర్సు ఆసుపత్రిలో సుఖవ్యాధి చికిత్సా కేంద్రాన్ని 1959–60లో ఏర్పాటుచేయడంకోసం ఈ జిల్లాకు కేటాయించబడింది.

## ప్రజారోగ్యం

### దాయీలకు శిక్షణ

నాటు మంత్రసానులు (దాయీలు) పురుళ్లు పోయడంలో ఉత్తమ పద్ధతుల నవలంబించి తమ వృత్తిని నిర్వహించేటట్టు చేయడంద్వారా గ్రామీణప్రాంతాల్లో ఇండ్లలోనే కాన్పులుజరిగే పద్ధతిని బాగొనరించటానికి గాను శిక్షణ పథకం ఒకటి 1956–57లో ప్రారంభించబడింది. రెండవ ప్రణాళిక మొదటి మూడుసంవత్సరాలలో 1,329మంది ఈ పథకంక్రింద శిక్షణకోసం చేర్చుకోబడ్డారు. ఈసంవత్సరంలో ఈ పథకం కొనసాగించ బడడమే కాకుండా మరొక720మంది అభ్యర్థులు చేర్చుకోబడుతారు. అందుకోసం రు. 0.81లక్ష మొత్తం రాజ్యప్రణాళికలో కేటాయించబడింది. 60 మంది దాయీలకు శిక్షణ నిచ్చేటందుకు ఆ మొత్తంలో 2,900 రూపాయలు ఈ జిల్లాలో వినియోగించ బడతాయి.

### మలేరియా బ్యూరో విస్తరణ

1956–57లో మొదటి ప్రణాళికా కాలంలో స్థాపించబడిన2మలేరియా నివారణ యూనిట్లు కొనసాగించబడినాయి. 1957–58లో మరో 2 యూనిట్లు ఏర్పాటు చేయడం జరిగింది. ఈ 4 యూనిట్లు 1958–59లో కొనసాగించబడ్డాయి. ఈ వ్యాధి రాకుండా 40 లక్షల మందికి రక్షణ చేకూర్చడానికి ఈ యూనిట్లు ఉపకరించాయి. నేషనల్ మలేరియా నివారణ కార్యక్రమం మలేరియా నిర్మూలనా కార్యక్రమంగా 1–4–1958 నుండి మార్చబడింది. అదనంగా స్ప్రేయింగు పరికరాలు, డి. డి. టి. ని సరఫరా చేయడంద్వారా మలేరియా సోకని ప్రాంతాలతోసహా రాజ్యం అంతటా మందు చల్లడం తీవ్రం చేయ

బడుతుంది. 17 సబ్‌యూనిట్లతో ప్రస్తుతం ఉన్న 4 యూనిట్లను కొనసాగించ డానికి, 16 హైపో ఎండమిక్ యూనిట్లను తెరవడానికి, ప్రజారోగ్య శాఖ రీజినల్ అసిస్టెంటు డైరెక్టర్ల కార్యాలయాలను మూడింటిని నెలకొల్పడానికి 1959-60 ప్రణాళికలో రాజ్య ప్రభుత్వం వాటాక్రింద రూ. 22.99 లక్షల మొత్తం కేటాయించబడింది. 2 హైపో ఎండమిక్ యూనిట్లను నెలకొల్పడానికి ఈ మొత్తం వినియోగించ బడుతుంది.

## బోదవ్యాధి నివారణ కార్యక్రమం

మొదటి ప్రణాళికాకాలంలో యీ పథకంక్రింద రెండు సర్వే యూనిట్లు, ఒక నివారణ యూనిట్టు ఏర్పాటు చేయబడినాయి. రెండు సర్వే యూనిట్లు కూడ 30-9-56 వరకు మాత్రం కొనసాగించబడగా నివారణ యూనిట్టు ప్రణాళిక యొక్క మూడు సంవత్సరాల కాలంలో కొనసాగించబడింది. ఇంకా రెండు నివారణ యూనిట్లను * ఏర్పాటు చేయడానికి, పాత యూనిట్టును 1959-60 లో కొనసాగించడానికి ప్రతిపాదింపబడింది. ఇందుకయ్యే వ్యయంలో రాజ్య ప్రభుత్వ వాటాక్రింద ప్రణాళికలో రు. 7.11 లక్షలమొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.85 లక్ష తూర్పు గోదావరి జిల్లాలోని మందపేటలో ఉన్న ఒక పాత యూనిట్టును కొనసాగించడానికి వినియోగించబడుతుంది.

## బి. సి. జి. టీకాలు

క్షయ నివారణకోసం ఒక కేంద్ర పరిపాలక యూనిట్టు, ఆరు ఫీల్డు టీములతో బి. సి. జి. టీకాలఉద్యమం మొదటిప్రణాళికాకాలంలో ప్రారంభించబడింది. అవి మొదట మూడుసంవత్సరాలలో కొనసాగించబడ్డాయి. 1959-60లో ప్రస్తుతం ఉన్న పరిపాలక యూనిట్టును, ఆరు ఫీల్డు టీములను కొనసాగించడమే కాకుండా, అదనంగా మూడు ఫీల్డు టీములను స్థాపించడానికి తల పెట్టబడింది.

---

* క్రొత్త ఢిల్లీలోని మలేరియా సంస్థ డైరెక్టరు యీ సంవత్సరం క్రొత్త యూనిట్లను స్థాపించరాదని సలహా యివ్వడంవల్ల యీ రెండు యూనిట్లను ఏర్పాటుచేయడం విరమించబడింది.

అందుకోసం ప్రణాళికలో రూ. 3.70 లక్షల మొత్తం, ఖర్చులో రాజ్య ప్రభుత్వపు వాటా క్రింద, కేటాయించబడింది. ఈ జిల్లాలో ఈ సంవత్సరం ప్రారంభించబడే 6 ఫీల్డు టీములు 3 మాసాలు పాటు పనిచేస్తాయి. అందుకోసం రూ. 0.53 లక్ష మొత్తం కేటాయించ బడింది.

### ఆరోగ్య ప్రచారం

ప్రజలకు ఆరోగ్య విషయాలను తెలియ చెప్పేటందుకు 1957-58లో ప్రజారోగ్యశాఖ డైరెక్టరు కార్యాలయంలో ఒక కేంద్ర ఆరోగ్య ప్రచార సంస్థ స్థాపించబడింది. రెండు వ్యాన్లు కొనబడ్డాయి ఇంతకు ముందు కొన్న 11 జీపులను, అంటు వ్యాధుల నివారణ గురించి ప్రచారంచేయడానికి ఉపకరించే రెండు వ్యానులను నిర్వహించడం జరిగింది. 1958—59లో ఈ పథకాన్ని కొనసాగించడానికి న్యూఢిల్లీలోని కార్యాచరణసంఘంవారు సమ్మతించలేదు. అయినప్పటికి 1959—60లో జిల్లాలలో ప్రస్తుతం ఉన్న 11జీపులను, 4వ్యానులను నిర్వహించడానికి, హైదరాబాదులోని కేంద్ర ఆరోగ్య ప్రచార సంస్థను కొనసాగించడానికి 8 క్రొత్త వ్యానులను కొనడానికి, మూడు ప్రచార సంస్థలను నెలకొల్పడానికిగాను రూ. 4.15 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు.0.12 లక్ష మొత్తం ఒకజీపును, ఒకవ్యానును నిర్వహించడానికిగాను ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

# గ్రామీణ, పట్టణ నీటి సరఫరా

### పట్టణ నీటి సరఫరా, మురుగు పారుదల పథకాలు

స్థానిక సంస్థలకు సంబంధించిన పట్టణ నీటి సరఫరా, మురుగు పారుదల పథకాలకోసం భారత ప్రభుత్వంవారు రు. 102.446 లక్షల మొత్తాన్ని ( రు. * 82.446 లక్షల మొత్తం కేంద్ర ప్రణాళికక్రింద, రు. 20.00లక్షల మొత్తం రాజ్య ప్రణాళిక క్రింద) ఋణ సహాయంగా యిస్తారని ఆశించబడుతున్నది. ఇందులో రు. 41.270 లక్షల మొత్తం కార్పొరేషను పథకాలకుగాను ప్రత్యేకించబడింది. మిగత మొత్తంలో రు. 0.668లక్ష క్రింది పథకాలకు గాను ఈ జిల్లాలో వినియోగించ బడుతుంది.

---

* ఇందులో రు. 5.446 లక్షల మొత్తం, ఈ పథకానికిగాను 1957-58 సంవత్సరంలో కేటాయించబడిన మొత్తంలో ఖర్చుపెట్ట బడకుండా మిగిలిపోయినట్టిది.

| పథకం పేరు | కేటాయింపు మొత్తం (రూపాయలు, లక్షలలో) |
|---|---|
| 1. పెద్దాపురం నీటి సరఫరా పథకం | 0.168 |
| 2. కాకినాడ నీటి సరఫరా అభివృద్ధి పనులు (ఫిల్టరు బెడ్లు) | 0.500 |
| మొత్తం | 0.668 |

### గ్రామీణ నీటి సరఫరా, పారిశుధ్యం పథకాలు

గ్రామీణ ప్రజలకు మంచినీటి సౌకర్యాన్ని, పారిశుధ్య సౌకర్యాలను కల్పించడానికి ఈ పథకం ఉద్దేశించబడింది. ఇందుకుగాను ఆంధ్ర ప్రాంతానికి ఈ సంవత్సరం ప్రణాళికలో రు. 16.84 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 1.24 లక్షల మొత్తం ఈ జిల్లాలో భద్రాచలం నీటి సరఫరా పథకం కోసం ప్రత్యేకించబడింది.

## గృహ నిర్మాణం

### మురికిపేటల నిర్మూలన, పాకీవారికి ఇళ్ళు

ఈ జిల్లాలో పాకీవారికి 40 యిళ్ళను నిర్మించడం కోసం ప్రణాళికలో రు. 1.07 లక్షల మొత్తం (కేంద్ర ప్రభుత్వ సహాయం కలుపుకొని) కేటాయించ బడింది.

### ప్రభుత్వ సహాయంతో పారిశ్రామిక గృహ నిర్మాణం

భారత ప్రభుత్వంవారు ఋణాలు, సబ్సిడీల రూపంలో ఇచ్చే ఆర్థిక సహాయంతో పారిశ్రామిక కార్మికుల ఇండ్ల నిర్మాణానికి ఈ పథకం ఉద్దేశించబడింది. ఈ పథకంక్రింద రెండురకాల ఇండ్లు నిర్మించబడుతున్నాయి. ఒక—గది ఇళ్ళు రూ. 3,300లు, రెండు గదుల ఇళ్ళు—రూ. 3,850ల వ్యయంతో నిర్మించబడుతున్నాయి. ఇందులో భూమి ఖరీదు, అభివృద్ధి ఖర్చులు చేరి వుంట్లాయి. నీటి

సరఫరా, పారిశుధ్యం, విద్యుచ్ఛక్తి ఫిట్టింగులు వంటి వాటికయ్యే ఖర్చులు ఇందులో చేరవు. ఈ పథకంక్రింద జరిగే పనిని కొనసాగించడానికి 1959–60 ప్రణాళికలో రు. 21.88 లక్షల మొత్తం కేటాయించబడింది. నంద్యాలలో 50 ఇండ్లను, బుగ్గన్నపల్లిలో 110 ఇండ్లను, విశాఖపట్నంలో 150 టూరులో 150 ఇండ్లను, గుంతకల్లులో 100 ఇండ్లను, రాజమండ్రిలో 100 ఇండ్లను, ఏలూరులో 100 ఇండ్లను నిర్మించేపనిని ప్రారంభించడానికి గాను యీ డబ్బు వినియోగించబడుతుంది.

### పట్టణాలలో గృహావసతి
### సహకార సంఘాలు

పట్టణ గృహ నిర్మాణ సహకార సంఘాల సభ్యులకు ఇండ్లను నిర్మించుకోడానికి దీర్ఘకాలిక ఋణాల నివ్వడంద్వారా పట్టణ ప్రాంతంలోని ఇండ్ల కొరతను తీర్చడానికి ఉద్దేశింపబడింది. ఈ సంవత్సరంలో ఆంధ్ర ప్రాంతంలో క్రొత్తగా 340 ఇండ్లను నిర్మించుకోడానికి ఋణాల క్రింద ఇచ్చేటందుకు రు. 20.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 4.00 లక్షల మొత్తం ఈ 70 యిండ్లను నిర్మించడంకోసం ప్రత్యేకించబడినది.

### స్థానిక సంస్థలు

ఈ పథకంక్రింద ఇండ్ల నిర్మాణంకోసం ఒక్కొక్కయింటికి రు. 4,800లు చొప్పున అంటే ఒక్కొక్క ఇంటికి అయ్యేఖర్చులో నూటికి 80 వంతులు స్థానిక సంస్థలకు ఋణాలుగా మంజూరుచేయబడతాయి. 1959–60లో కాకినాడలో 7 ఇండ్ల నిర్మాణానికి ఋణం ఇచ్చేటందుకు ఈ జిల్లాకు రు. 0.386 లక్షల మొత్తం కేటాయించబడింది.

# కార్మికులు-కార్మిక సంక్షేమం

### ఉద్యోగ సమాచార సేకరణ

ఈ పథకం యొక్క లక్ష్యాలేవంటే:

1. ఏ రకం ఉద్యోగులు కొరతగాఉన్నారో ఎంప్లాయిమెంటు అధికారులు ఖచ్చితంగా నిర్ణయించడంకోసం ఇంకా ఎక్కువ వివరాలనువారికి అందజేయడం.

2. విద్యాభ్యాసం పూర్తి చేసిన వారికి, ఉద్యోగాన్వేషణలో ఉన్న వారికి ఉద్యోగాల విషయంలోను, ఉద్యోగ అవకాశాల విషయంలోను సలహా నిచ్చేటందుకు సమాచారాన్ని అందచేయడం.

3, ఉద్యోగ సాధక కేంద్ర ప్రాంతంలో గాని, నిర్ణీత ఎంప్లాయిమెంటు మార్కెట్లుగా పరిగణింప బడే ఇతర ప్రాంతాలలో గాని ఉద్యోగ నియమావకాశాలలో వచ్చే మార్పులు గమనించడానికి పద్ధతులను రూపొందించడం.

4. ప్రతి పరిశ్రమ, వృత్తులలో ఉండే ఉద్యోగాల పోకడలను ముందుగా సూచించడం,

హైదరాబాదు, వరంగల్లు, విశాఖపట్టణం, విజయవాడ, కర్నూలులలో ఉన్న 5 ప్రధాన ఉద్యోగ సాధక కేంద్రాలలో యీ పథకం 1957–58లో అమలు పరచబడింది. వీటి కేంద్ర యూనిట్టు హైదరాబాదులో ఉన్న నేషనల్ ఎంప్లాయిమెంటు సర్వీసు డైరెక్టరేటులో ఏర్పాటు చేయబడింది, 1958–59లో ఈ పథకం కాకినాడ, గుంటూరు, నిజామాబాదులోని జిల్లా ఉద్యోగ సాధక కేంద్రాలకు విస్తరింప చేయబడింది, 1959–60లో విశాఖపట్నం, విజయవాడ కాకినాడ, గుంటూరు, వరంగల్లులలోని ప్రైవేటు రంగాన్ని పరిశీలించడానికి తలపెట్టబడింది. ఇందుకోసం, పైన తెలుపబడిన ఎక్స్ఛేంజీలలో అదనపు సిబ్బందిని నియమించడం, డైరెక్టరేటులోని సెంట్రల్ యూనిట్టును ఒక సీనియరు అధికారి అజ్మాయిషీక్రింద వుంచడంద్వారా సెంట్రల్ యూనిట్టును పటిష్ఠంచేయడం జరుగుతుంది. మిగిలిన అన్ని కేంద్రాలలో కూడా సిబ్బందిని పెంచడానికి ఉద్దేశించబడింది. ఈ కేంద్రా లన్నిటిలోను ఒక్కొక్క గుమస్తాను అదనంగా నియమిస్తారు. ఈ పథకానికి అయ్యే ఖర్చులో కేంద్రప్రభుత్వంవారు భరించే రు. 0.31 లక్షకు తోడుగా రాజ్య ప్రభుత్వ వాటాక్రింద 1959–60 ప్రణాళికలో రు. 0.47 లక్ష మొత్తం కేటాయించబడింది. మొత్తం కేటాయింపు రు. 0.78 లక్షలోను రు. 0.052 లక్ష మొత్తం ఈ జిల్లాలోని కార్యక్రమంక్రింద వినియోగించబడుతుంది.

## వృత్తి పనివారికి శిక్షణసౌకర్యాల విస్తరణ, కాకినాడలో పారిశ్రామిక శిక్షణ కేంద్రం

ఈ సంస్థలో అదనంగా 165 మంది అభ్యర్థులను చేర్చుకోవడానికి 1958–59లో సీలు కల్పించబడింది. ఇంకా మూడు మందిని ఎక్కువగా చేర్చుకోవడానికి ఈ సంవత్సరం సీలుకల్పించే నిమిత్తం అదనపు భవనాలను నిర్మించడానికి, పరికరాలను సమకూర్చడానికి, సిబ్బందిని నియమించడానికి ప్రతిపాదింపబడింది. ఇందుకు ప్రణాళికలో రాజ్య ప్రభుత్వ వాటాక్రింద రు. 2.86 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందుకదనంగా కేంద్ర ప్రభుత్వం రు. 1.30 లక్షల మొత్తం యిస్తుంది.

## పారిశ్రామిక శిక్షణ సంస్థలకు కొరవడిఉన్న పరికరాలను సమకూర్చడం

వర్కుషాపు సౌకర్యాలను అభివృద్ధిచేసే ఉద్దేశంతో కాకినాడ, అనంతపురం, ఉయ్యూరులలో ఉన్న మూడు పారిశ్రామిక శిక్షణ సంస్థలకు కొరవడి ఉన్న పరికరాలను సమకూర్చడానికి ఈ పథకం ఉద్దేశించ బడింది. ఈ సంవత్సరం ప్రణాళికలో రు. 0.75 లక్ష ఈ పథకం కోసం రాజ్యప్రభుత్వ వాటాక్రింద కేటాయించబడింది. ఇంతేకాక కేంద్ర ప్రభుత్వ వాటాగా రు. 1.12 లక్షల మొత్తం కేటాయించబడింది. మొత్తం కేటాయింపులో రు. 0.628 లక్ష ఈ జిల్లాలోని సంస్థకోసం వినియోగించ బడుతుంది.

## "హాబి" శిక్షణ పథకం

ఇది క్రొత్త పథకం వృత్తిపనులలో ఆసక్తిని కలిగించేటందుకు ఈ పథకాన్ని కాకినాడలోని పారిశ్రామిక శిక్షణ సంస్థలో 1959–60లో ప్రారంభించడానికి ప్రతిపాదింప బడింది. ఏటేటకు 50 మందికి ఈ పథకం క్రింద శిక్షణ సౌకర్యాలు సమకూర్చ బడతాయి. ఈ పథకం కోసం ఈ సంవత్సరం రాజ్య ప్రభుత్వ వాటాక్రింద రు. 0.06 లక్ష, కేంద్ర ప్రభుత్వ వాటాక్రింద రు. 0.09 లక్ష కేటాయించబడినాయి.

# వెనుకబడిన తరగతులు, షెడ్యూల్డు కులాల సంక్షేమం

## షెడ్యూల్డు కులాలు—షెడ్యూల్డు కులాలవారికి స్కాలరు షిప్పులు

ఈ పథకం క్రింద హరిజన విద్యార్థులకు, ఇతర అర్హమైన కులాల విద్యార్థులకు అన్ని తరగతులలోను స్కాలరు షిప్పులు మంజూరు చేయబడుతున్నాయి. తల్లి, దండ్రుల ఆదాయం ఉన్నత పాఠశాల విద్యార్థుల విషయంలో రూ. 1,500లు, కళాశాల విద్యార్థుల విషయంలో రూ. 1,800లు మించకుండా ఉంటే రుసుం చెల్లించ నవసరం లేకుండా మా ఫీ చేయబడుతుంది. 1959—60లో ఇదివరకు మంజూరుచేసిన స్కాలరు షిప్పులను కొనసాగించడమే కాకుండా సుమారు 1,600 అదనపు స్కాలరు షిప్పులను మంజూరు చేయడానికి రు. 4.90 లక్షల మొత్తం కేటాయించ బడింది. స్కాలరు షిప్పులు ఈ జిల్లాలోని అర్హులైన విద్యార్థులకు కూడా ఇవ్వబడుతాయి.

## షెడ్యూల్డు కులాలవారికి హాస్టళ్లు.

ఆంధ్ర ప్రాంతంలో ప్రభుత్వ సహాయంతో నడపబడే హాస్టళ్లు 438 ఉన్నాయి. విద్యాసంవత్సరానికి ఒక్కొక్క విద్యార్థికి రూ.150చొప్పున బోర్డింగు గ్రాంట్లు, వెనుక బడినతరగతుల హరిజనులవిద్యార్థులకు ఏటా ఇవ్వబడుతున్నాయి. ఈ సంవత్సరపు ప్రణాళికలో 670 అదనపు బోర్డింగు గ్రాంట్లు మంజూరు చేయడానికి రూ. 1.00 లక్ష మొత్తం కేటాయించ బడింది. బోర్డింగు గ్రాంట్లు ఈ జిల్లాలోని హాస్టళ్లకు కూడా ఇవ్వబడతాయి.

## షెడ్యూల్డు కులాలవారికి ప్రభుత్వ హాస్టళ్లు

ఈ జిల్లాలో కాకినాడ, ముమ్మిడివరంలలో ఉన్న హాస్టళ్ళు ఈ సంవత్సరంలో రూ. 0.036 లక్ష వ్యయంతో నిర్వహించబడతాయి.

## పాఠశాలల, హాస్టళ్ళ భవనాల నిర్మాణం, మరమ్మతులు

ఆంధ్ర ప్రాంతంలోని సాంఘికసంక్షేమ పాఠశాలలు, సాంఘిక సంక్షేమ శాఖ అజమాయిషీ క్రిందగల సబ్సిడీ పొందే హాస్టళ్లు అద్దె భవనాలలో సెలకొల్ప

బడ్డాయి. అందువల్ల హరిజనుల సౌకర్యార్థం నడపబడే సాంఘిక సంక్షేమ పాఠశాలలకు, సబ్సిడీపొందే హాస్టళ్లకు పక్కా భవనాలను నిర్మించడానికి తలపెట్ట బడింది. 1959–60లో 25 పాఠశాల భవనాల నిర్మాణంకోసం రూ. 1.00 లక్ష మొత్తం కేటాయించ బడింది. అందులో 3 భవనాలు రూ. 0.12 లక్ష వ్యయంతో ఈ జిల్లాలో నిర్మించబడతాయి.

## పారిశుద్ధ్య సౌకర్యాలు

సాధారణంగా అనారోగ్యకరమైన వాతావరణంలో ఉండే హరిజన వాడ లను ఆరోగ్యకరంగా చేయడానికి కాలిబాటలు, పాయిఖానాలు, స్నానాలగదులు, మంచినీటి బావులు, మొదలైన పారిశుధ్య సౌకర్యాలను ఏర్పాటు చేయడం అవసరం. 1959–60లో ఆంధ్ర ప్రాంతంలో 217 మంచినీటి బావులు త్రవ్వ డానికి ప్రణాళికలో రూ. 4.34 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులో 20 బావులు, రూ. 0.40 లక్ష వ్యయంతో ఈ జిల్లాలో త్రవ్వబడతాయి.

## నివేశన స్థలాల సేకరణ

నివేశన స్థలాల సేకరణకు, ఉచితంగా వాటిని హరిజనులకు ఇవ్వడానికిగాను 1959–60లో ఈ పథకం క్రింద రు. 8.00 లక్షలు కేటాయించ బడ్డాయి, అందులో రు. 0.75 లక్ష మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## ప్రచారం

అస్పృశ్యతను నిర్మూలించడానికి 1959–60 ప్రణాళికలో రు. 0.40 లక్ష మొత్తం ప్రత్యేకించ బడింది. అస్పృశ్యతవల్ల కలిగే నష్టాన్ని గురించి ప్రచారం చేయడానికి, నాటకాలు, యక్షగానాలలో ఉత్తమమైన వాటికి బహుమతులివ్వడానికి, పత్రికలకు సబ్సిడీలను ఇవ్వడానికి, పోస్టర్లను, కరపత్రాలను అచ్చువేయడానికి, హరిజన దినోత్సవాలు జరపడానికి, వర్ణాంతర భోజనాలను ఏర్పాటుచేయడానికి యీమొత్తంవినియోగించబడుతుంది. ఈజిల్లాలో ఈపథకాన్ని అమలు పరచడంకోసం, రు. 0.035 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## స్వచ్ఛంద సంస్థలకు సహాయం

హరిజన సేవక సంఘం, భారత సేవక సమాజ్, గిల్డు ఆఫ్ సర్వీసు, రెడ్ క్రాస్ సొసైటి, రోటరీ క్లబ్బులు, ఇతర స్వచ్ఛంద సంస్థలు. అనేకం హరిజనోద్ధరణకు కృషి చేస్తున్నాయి. ఈ సంస్థలకు ఈ విషయంలో తగు ప్రోత్సాహం ఇచ్చేటందుకు ఆర్థిక సహాయం చేయబడుతుంది. ఇందుకు రు. 0.80 లక్ష మొత్తం 1959–60 ప్రణాళికలో కేటాయించ బడింది ఈ జిల్లాలోని స్వచ్ఛంద సంస్థలు కూడా ఈ సహాయాన్ని పొందటానికి అర్హమై ఉంటాయి.

## గృహ వసతి

నివేశన స్థలాల్ని యిచ్చినాకూడా సొంతంగా ఇళ్లుకట్టుకోలేనంత బీదస్థితిలో హరిజనులు ఉన్నారు. అందువల్ల ఇళ్లు కట్టుకోవడానికి సబ్సిడీలకు ఋణాలను కుడా మంజూరు చేయడానికి తలపెట్ట బడింది కలప, సామగ్రి మొదలయిన వాటి క్రింద ఇవ్వబడే సహాయం కాకుండా ఇంటికి 750లు ఇవ్వబడుతాయి. అంటే రు 250 సబ్సిడీక్రింద, రు. 500 ఋణం క్రింద ఇవ్వబడతాయి ఈ ఋణం మొత్తం ఈ సహాయం పొందే వారినుండి వసూలు చేయబడుతుంది. ఇతర కులాలవారు కూడా హరిజనులతో కలిసిమెలిసి ఉండేటట్లు ప్రోత్సహించడానికి నిర్మించేటందుకు తలపెట్టబడిన ఇళ్లల్లో 10 శాతం వెనుకబడిన తరగతుల వారికి ప్రత్యేకించ బడుతున్నాయి. 1959–60లో ఈ జిల్లాలో 68 ఇళ్లను నిర్మించేటందుకు ప్రణాళికలో రు. 0.47 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## వెనుకబడిన తరగతులు

### వెనుకబడిన తరగతుల విద్యార్థులకు స్కాలరు షిప్పులు

వెనుక బడిన తరగతుల విద్యార్థులకు స్కాలరు షిప్పులు ఇవ్వడానికి రాజ్య ప్రభుత్వం వారు ఏటా సుమారు రూ. 4.00 లక్షల మొత్తం ఖర్చు పెడుతున్నారు. ఆంధ్ర ప్రాంతంలోని అనేక పాఠశాలలలోను, కళాశాలలోను చదువుతున్న వెనుకబడిన తరగతుల విద్యార్థులకు అదనంగా 920 స్కాలరు షిప్పులు మంజూరు చేయడానికి ఈ సంవత్సరంలో రు. 2.74 లక్షల మొత్తం కేటాయించ

ఎడింది. స్కాలరు షిప్పులు ఈ జిల్లాలోని వెనుక బడిన తరగతుల విద్యార్థులకు కూడా లభ్యమౌతాయి.

## వెనుకబడిన తరగతుల విద్యార్థులకు బోర్డింగు గ్రాంటులు

ఉన్నత పాఠశాలల్లోను, కళాశాలలోను చదువుకుంటున్న వెనుక బడిన తరగతుల విద్యార్థులకు సబ్సిడీ పొందుతున్న హాస్టళ్లలో బోర్డింగు గ్రాంట్లు ఇవ్వబడుతున్నాయి. ఈ గ్రాంట్లు ఒక్కొక్క బోర్డరుకు విద్యా సంవత్సరానికి రు.150 చొప్పున ఇవ్వబడుతున్నాయి. 1959–60లో అదనంగా 445 బోర్డింగు గ్రాంట్లను ఇచ్చేటందుకు గాను పథ్రికలో రు. 0 67 లక్ష మొత్తం కేటాయించబడింది. బోర్డింగు గ్రాంట్లు ఈ జిల్లాలోని వెనుక బడిన తరగతుల విద్యార్థులకు కూడా లభ్యమౌతాయి.

## వెనుకబడిన తరగతులవారి పిల్లలకు మధ్యాహ్నపు భోజనాలు

సాంఘిక సంక్షేమ పాఠశాలలో వెనుక బడిన తరగతుల పిల్లలు చేరడాన్ని ప్రోత్సహించేటందుకు రెండవ ప్రణాళిక ప్రారంభం నుండి సాంఘిక సంక్షేమ పాఠశాలల్లో చదివే పిల్లలకు మధ్యాహ్నపు భోజనాలు ఏర్పాటు చేయబడుతున్నాయి. ఈ విధంగా చేయడం వల్ల అస్పృశ్యతా నిర్మూలనానికి కూడా తోడ్పడడం జరుగుతుంది 1959–60లో ఈ పథకం కోసం రు. 0.50 లక్ష మొత్తం ఖర్చు పెట్టడానికి తలపెట్టబడింది. ఈ జిల్లాలోని వెనుక బడిన తరగతుల పిల్లలకు కూడ దీనివల్ల లాభం చేకూరుతుంది.

## విముక్త జాతులు

### విద్య

విముక్త జాతుల వారి పిల్లలు పాఠశాలకు పోయి చదువుకోరు. ఇందుకు కారణం వాళ్లి తల్లి తండ్రులు వాళ్లను పాఠశాలకు పంపి చదివించ లేక పోవడమే. అందువల్ల యీపిల్లలకు, పుస్తకాలు పలకలు మొదలయినవి ఇవ్వడానికి తలపెట్టబడింది. 1959–60 పథ్రికలో రు. 0.09 లక్ష మొత్తం కేటాయించ

బడింది. ఈ మొత్తంతో చిత్తూరు జిల్లాలోని విముక్తజాతుల వారి కాలనీల లోని 2 పార్కులను, 2 రేడియో సెట్లను నిర్వహించడమే కాకుండా, పుస్తకాలు, పలకలు మొదలైనవి ఇవ్వడం, స్కాలరు షిప్పులను మంజూరు చేయడం జరుగుతుంది. ఈ జిల్లాలోని విముక్తజాతుల పిల్లలకు కూడా ఈ పథకం వల్ల లాభం చేకూరుతుంది.

## గృహవసతి

ఈ పథకం క్రింద, విముక్త జాతులవారు గుడిసెలను వేసుకోవడానికి, ప్రస్తుతం ఉన్న ఇళ్లను మరమ్మతు చేసుకోడానికి సహాయ పడేటందుకు తలపెట్ట బడింది. స్వంత ఇల్లు కట్టుకునే వారికి రు. 100 వరకు ఖరీదు చేసే సామగ్రి ఇవ్వబడుతుంది. ఇళ్లు మరమ్మత్తు చేసుకోవడానికి కుటుంబానికి రు 30 లు. ఇవ్వబడుతాయి. 40 క్రొత్త ఇండ్ల నిర్మాణానికి, 40 పాతఇండ్ల మరమ్మత్తుకు ఈ సంవత్సరం రు. 0.052 లక్ష మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింద

## ప్రజారోగ్యం

1959—60 ప్రణాళికలో ఈ జిల్లాలో ఒక క్రొత్తబావిని త్రవ్వడానికి, ఒకపాయిఖానాను నిర్మించడానికి రు 0.03 లక్ష మొత్తం కేటాయించబడింది.

## కుటీర పరిశ్రమలు

ఈ పథకం క్రింద విముక్త జాతులవారు, తమ వృత్తులను కొనసాగించు కొనేటందుకు పనిముట్లు పరికరాలు, ముడి పదార్థాలు, సరఫరా చేయబడుతాయి. ప్రతివ్యక్తికి పనిముట్లు, పరికరాలు, ముడిపదార్థాల రూపంలో రు. 50ల వరకు సహాయం ఈయబడుతుంది. దీనికోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.15 లక్ష మొత్తం ప్రత్యేకించ బడింది. అందులో ఈ జిల్లాకు రు. 750లు కేటాయించ బడ్డాయి. ఈ పథకం క్రింద 15 మందికి లాభం చేకూరుతుంది.

## వైద్యసహాయం

వైద్య సహాయం కోసం, తదితర ఖర్చుల కోసం విముక్త జాతులకు చెందిన అర్హులైన 50 మంది రోగులకు ఒక్కొక్కరికి రు. 40 చొప్పున డిస్క్రిష

సరీ గ్రాంటులను ఈ పథకం క్రిందఇవ్వడానికి తలపెట్టబడింది. దీనికోసం 1959-60 ప్రణాళికలో రు. 0.02లక్ష మొత్తం కేటాయించబడింది. అందులో రు. 80లు, ఇద్దరు విముక్త జాతుల వారికి డిస్క్రిషనరీ గ్రాంటులను ఇవ్వడానికి ఈ జిల్లాకు ప్రత్యేకించ బడ్డాయి

# షెడ్యూల్డు తెగల సంక్షేమం

## విద్య

### ప్రభుత్వ సహాయంపొందే హాస్టళ్ళలో బోర్డర్ల సంఖ్యను పెంచడం

ప్రభుత్వ సహాయంపొందే హాస్టళ్ళలో చేరడానికి వచ్చే ట్రయిబలు విద్యార్థుల సంఖ్య ఎక్కువవుతున్నందు వల్ల చింతపల్లి, కూనవరంలలో ఉన్న హాస్టళ్ళలో బోర్డర్ల సంఖ్య ఎక్కువ చేయబడింది. చింతపల్లిలోని హాస్టలుకు 7, కూనవరం లోని హాస్టలుకు 15 బోర్డింగుగ్రాంటులు అదనంగా ఇవ్వబడినాయి. 1959-60లో యీ అదనపు గ్రాంటులు కొనసాగించబడతాయి. ఇందుకు ప్రణాళికలో రు. 0.02 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 1,350/-లు యీ జిల్లాకు కేటాయించబడినాయి.

### పాడేరులోను, మారేడుమిల్లిలోను క్రొత్తగా ప్రభుత్వ హాస్టళ్ళను ఏర్పాటు చేయడం

ట్రయిబలు పిల్లలకోసం తూర్పు గోదావరి జిల్లాలోని పుల్లంగిలో ఒకటి, విశాఖపట్టణం జిల్లాలోని పాడేరులో ఒకటి మొత్తం రెండు ప్రభుత్వ హాస్టళ్ళు 1956-57లో ప్రారంభించబడినాయి. ఇవి యీ సంవత్సరంలో మొత్తం 50 మంది బోర్డర్లతో కొనసాగించబడతాయి. ఇందుకు రు. 0.05 లక్ష వ్యయమవుతుంది. ఇందులో రు. 0.025లక్ష ఈ జిల్లాకు కేటాయించబడింది. పుల్లగింతో ప్రారంభించబడిన హాస్టలు 1958-59లో మారేడుమిల్లికి మార్చబడింది.

### ప్రభుత్వ సహాయంపొందే హాస్టళ్ళను ప్రభుత్వబోర్డింగు హోములుగా మార్చడం.

ప్రభుత్వ బోర్డింగు హోములుగా మార్చబడిన ఈ జిల్లాలోని ఏజెన్సీ ప్రాంతాల్లో ఉన్న మూడు ప్రభుత్వ సహాయంపొందే హాస్టళ్ళను కొనసాగించడంకోసం 1959-60 సంవత్సరానికి రు 0.0342 లక్ష కేటాయించబడింది.

ఈ జిల్లాలోని ప్రభుత్వసహాయం పొందే హాస్టళ్ళను ప్రభుత్వ బోర్డింగు హోములుగా మార్చడానికి, బోర్డింగు ఛార్జిని 41 నయాపైసల నుండి 50 నయా పైసలకు పెంచడానికిగాను మరో రు 0.0542 లక్ష కూడ కేటాయించబడింది.

పాఠశాలలలో చదువుకొంటున్న ట్రయిబలు పిల్లలకు పుస్తకాలు, పలకలు, దుస్తుల సరఫరా

ట్రయిబలు ప్రజలు తమ పిల్లలకు చదువు చెప్పించేటందుకు ఉత్సాహం కలిగించే నిమిత్తం ప్రాథమిక పాఠశాలలలోను, ప్రాథమికోన్నత పాఠశాలలలోను చదువుకొంటున్న ట్రయిబలు పిల్లలకు పుస్తకాలు, పలకలు, దుస్తులు సరఫరా చేయడానికి సంబంధించిన పథకాన్ని 1959–60లో రు. 0.6144 లక్ష వ్యయంతో కొనసాగించడానికి ప్రతిపాదించబడింది. ఈ పథకంవల్ల 13,624 మంది పిల్లలకు లాభం చేకూరుతుందని ఆశించబడుతున్నది.

ఏజన్సీ ప్రాంతాల్లో పాత ప్రాథమిక పాఠశాలలను కొనసాగించడం; క్రొత్త వాటిని స్థాపించడం

ట్రయిబలు పిల్లల సౌకర్యార్థం ఈ జిల్లాలోని ఏజన్సీ ప్రాంతాల్లో యింతకు ముందు స్థాపించబడిన 10 ప్రాథమిక పాఠశాలలను కొనసాగించడానికి, క్రొత్తగా నాలిగింటిని స్థాపించడానికిగాను 1959–60 ప్రణాళికలో రు. 0.25172 లక్ష కేటాయించబడింది.

ఏజెన్సీ ప్రాంతాల్లోని పాఠశాలలకు, హాస్టళ్ళకు పక్కా భవనాల నిర్మాణం

ఏజెన్సీ ప్రాంతాలలోని పాఠశాలలకు శాశ్వతమైన భవనాలు లేనందువల్ల ఈ జిల్లాలోని ఏజెన్సీ ప్రాంతాలలో 1959–60లో 4 పక్కా భవనాలను నిర్మించడానికి ప్రతిపాదించబడింది ఇందుకు ఈ సంవత్సరం ప్రణాళికలో రు. 0 36 లక్ష కేటాయించబడింది.

కొండ మొదలులో ప్రభుత్వ బోర్డింగు హోమును ప్రారంభించడం

తూర్పు గోదావరి జిల్లాలోని కొండమొదలులో ప్రభుత్వ బోర్డింగు హోమును స్థాపించడంకోసం ప్రణాళికలో 1959-60 సంవత్సరానికి రు. 0.10 లక్ష కేటాయించబడింది.

## భద్రాచలంలోని ప్రభుత్వ హైయ్యర్ సెకండరి పాఠశాలకు అనుబంధించ బడి ఉన్న నాన్‌బేసిక్ శిక్షణ విభాగాన్ని బేసిక్ శిక్షణ విభాగంగా మార్చడం

ప్రభుత్వ హైయ్యర్ సెకండరి పాఠశాలకు అనుబంధించబడి ఉన్న నాన్ బేసిక్ శిక్షణ విభాగాన్ని బేసిక్ శిక్షణ విభాగంగా మార్చడంకోసం ఈ సంవత్సరం ప్రణాళికలో రు. 0.12 లక్ష కేటాయించబడింది.

## గుమ్మలక్ష్మీపురం, దుమ్ముగూడెంలలో ఉన్న ప్రభుత్వ మాధ్యమిక పాఠ శాలలను ఉన్నత పాఠశాలలుగా మార్చడం

శ్రీకాకుళం జిల్లాలోని గుమ్మలక్ష్మీపురంలోను, తూర్పు గోదావరి జిల్లాలోని దుమ్ముగూడెంలోను ఉన్న ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలను ఉన్నత పాఠశాలలుగా స్థాయిని పెంచడంకోసం రు. 0.05 లక్ష ప్రత్యేకించబడింది.

## తూర్పు గోదావరి జిల్లాలోని ఏజెన్సీ ప్రాంతాలకోసం అవసరమైన సిబ్బందితో ప్రత్యేక జిల్లావిద్యాశాఖాధికారి నియామకం

తూర్పు గోదావరి జిల్లాలోని ఏజెన్సీ ప్రాంతాలకోసం ఒక ప్రత్యేక జిల్లా విద్యాశాఖాధికారిని అవసరమైన సిబ్బందితోసహా నియమించడంకోసం యీ సంవత్సరం ప్రణాళికలో రు. 0.26 లక్ష కేటాయించబడింది ఈ ప్రత్యేక జిల్లా విద్యాశాఖాధికారికి పర్సనల్ అసిస్టెంటును నియమించడానికి (ఖర్చు రు. 1,463) ప్రత్యేక జిల్లా విద్యా శాఖాధికారి కార్యాలయంలో ఒక అప్పరు డివిజను గుమాస్తాను నియమించడానికి (ఖర్చు రు. 1,265) గాను యింకా రు. 2,728/-లు కేటాయించబడినాయి.

## వ్యవసాయం

## రంప చోడవరంలోని ప్రదర్శన—పరిశీలన క్షేత్రం నిర్వహణకు, అభివృద్ధికి సంబంధించిన పథకం.

కూరగాయలు, పండ్లు, ఇతర తోటపంటలు పండించడానికిగాను 1955లో ప్రదర్శన—పరిశీలన క్షేత్రం ఒకటి రంపచోడ వరంలో స్థాపించ బడింది. ఈ సంవత్సరంలో ఈ క్షేత్రం రు. 0.40 లక్ష వ్యయంతో కొనసాగించ బడుతుంది.

## ఏజన్సీ ప్రాంతాల్లో ప్రదర్శన యూనిట్లను ప్రారంభించడం

మేలురకం వ్యవసాయ విధానాలను ప్రజలకు తెలిపేటందుకుగాను ఆంధ్ర ప్రాంతంలోని ఏజన్సీ జిల్లాలలో 1958–59 నుండి మొదలు పెట్టి 8 ప్రదర్శన యూనిట్లను స్థాపించడానికి ప్రతిపాదింపబడింది. అదే ప్రకారం 1958–59లో విశాఖపట్టణం జిల్లాలోని చింత పల్లిలో ఒక ప్రదర్శన యూనిట్టు ఏర్పాటు చేయ బడింది. ఆంధ్రప్రాంతంలో 7 ప్రదర్శన యూనిట్లను ప్రారంభించడానికి, ఇంతకుముందు స్థాపించినదాన్ని కొనసాగించడానికి గాను 1959–60 ప్రణాళికలో రు. 1.55 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.395 లక్ష ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది. ఈ జిల్లాలోని రామవరం, నేమ్మదుగుడెం లలో 3 ప్రదర్శన యూనిట్లు ప్రారంభించబడతాయి.

## కుటీర పరిశ్రమలు

### తూర్పు గోదావరి జిల్లాలో కోర, తుంగిలతో చాపల అల్లకం

తూర్పు గోదావరి జిల్లాలోని చెర్లలో చాపల అల్లకానికి పనికివచ్చే కోర, తుంగ విరివిగా లభ్యమవుతాయి. వటిని ఉపయోగించుకొని ట్రయిబలు ప్రజలు తమ ఆర్థిక పరిస్థితిని మెరుగు పరచుకొనేటందుకు గాను వీలు కల్పించే నిమిత్తం 1957–58లో చాపల అల్లకానికి సంబంధించిన శిక్షణ కేంద్రం ఒకటి చెర్లలో స్థాపించ బడింది. 1957–59లలో 26 మంది ట్రయిబలు ప్రజలు శిక్షణ పొందారు. 1959–60లో యింకా 15మంది ట్రయిబలు ప్రజలకు చాపల అల్లకంలో ఉత్తమ పద్ధతుల్ని గురించి శిక్షణ యిచ్చేటందుకు ప్రతిపాదింప బడింది. ఇందుకు ప్రణాళికలో రు. 0.056 లక్ష కేటాయించ బడింది.

## తూర్పుగోదావరి జిల్లాలోని ఏజన్సీ ప్రాంతాల్లో తాటినార తీయడం

తూర్పుగోదావరి జిల్లాలోని ఏజన్సీ ప్రాంతాలలో ట్రయిబలు ప్రజలకు తాటి నార తీయడంలో శిక్షణ యిచ్చేటందుకు ఈ పథకం తలపెట్ట బడింది. ఇందుకు 1959–60 ప్రణాళికలో రు. 0.02 లక్ష కేటాయించ బడింది.

## ప శు గ ణా భి వృ ద్ధి

### పశు ప్రథమ చికిత్సా కేంద్రాలను ఏర్పాటుచేయడం

ఈ జిల్లాలో ఉన్న పశు ప్రథమ చికిత్సా కేంద్రాన్నొక దాన్ని కొనసాగించడంకోసం 1959–60 ప్రణాళికలో రు. 0.02 లక్ష కేటాయించ బడింది.

### పశువుల పంపకం

ఆంధ్ర ప్రాంతంలోని ఏజన్సీ ప్రదేశాలలో విస్తారంగా పచ్చిక బీళ్ళున్నాయి. ఈ ప్రాంతాలలో పెంచేటందుకు మేలురకం పశువులను సరఫరా చేయడానికి సంబంధించిన పథకం ఒకటి మొదటి ప్రణాళికాకాలంలో అమలులో ఉండేది. ఈ ప్రాంతాల్లో పశుగణాభివృద్ధిని కొనసాగించే నిమిత్తం ఈ జిల్లాలో 2 ఆబోతులను, 2 ఆవులను, 12 గొర్రెలను, 100 కోళ్ళను పంపకం చేయడానికి ప్రతి పాదింప బడింది. ఇందుకోసం 1959–60 ప్రణాళికలో రు. 0.0702 లక్ష కేటాయించ బడింది.

### రవాణా సౌకర్యాలు (రోడ్లు)

ఏజన్సీ ప్రాంతాల్లో ఉత్తమ రవాణా సౌకర్యాలను కలిగించడం కోసం 1959–60 ప్రణాళికలో రు. 2.61 లక్షల మొత్తం కేటాయించ బడింది. క్రింది పనులు నిర్వహించ బడతాయి.

| వరుస సంఖ్య | పని వివరము | 1959–60 లో కేటాయించ బడిన మొత్తం (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| 1. | సీతంపల్లినుండి అడ్డతీగలకు, అక్కడినుండి చెరువుకొమ్ము పాలెంకు రోడ్డు నిర్మాణం. | 0.58 |

| | | |
|---|---|---|
| 2. | మారేడుమిల్లి, లక్కవరంల మీదుగా రంపచోడవరం నుండి భద్రాచలంకు రోడ్డు నిర్మాణం. | 1.00 |
| 3. | నెల్లిపూడి మీదుగా గంగవరం నుండి ఎం. డి. ఆర్. కు రోడ్డు నిర్మాణం. | 0.03 |
| 4. | అడ్డతీగలనుండి రామవరంకు రోడ్డు నిర్మాణం, | 0.75 |
| 5. | ఐపూరు మీదుగా కూనవరంనుండి పోచవరంకు రోడ్డు నిర్మాణం, | 0.05 |
| 6. | రాజమండ్రి—మారేడుమిల్లి రోడ్డు మైలు 22/0 నుండి సామర్లకోట-గోకవరం రోడ్డు మైలు 26/0 వరకు రోడ్డు నిర్మాణం | 0.25 |

## గ్రామీణ రోడ్లు

### ఏజెన్సీ గ్రామాలలో చిన్నతరహా రోడ్లను నిర్మించడం; ప్రస్తుతమున్న వాటికి మరమ్మతులు చేయడం

ఈ జిల్లాలోని ఏజన్సీ ప్రాంతాల్లో చిన్న తరహా గ్రామీణ రోడ్లను నిర్మించడానికి, ప్రస్తుతమున్న వాటికి మరమ్మతులు చేయడానికిగాను 1959–60 ప్రణాళికలో రు. 0.10 లక్ష కేటాయించ బడింది.

## భూ స్థి రీ క ర ణ

ట్రయిబలు ప్రజలను శాశ్వతంగా వ్యవసాయంలో స్థిరపరచడానికి, వారిచేత పోడు వ్యవసాయాన్ని మాన్పించేటందుకుగాను క్రింద కాలనీలలో పాకలను నిర్మించి, భూములను సాగులోనికి తెచ్చి, వాటిని ట్రయిబలు కుటుంబాలకు కేటాయించడానికి ప్రతిపాదింప బడింది. 1959–60లో ప్రతి కాలనీకి కేటాయించ బడిన మొత్తం వివరాలు క్రింద యివ్వ బడినాయి.

| వరుస సంఖ్య | కాలనీ పేరు | కేటాయింపు మొత్తం రూపాయలు లక్షలలో |
|---|---|---|
| 1, | గుజ్జుమామిడి వలస భూస్థిరీకరణ పథకం, | 1.07 |
| 2, | తూర్పు పశ్చిమ గోదావరి జిల్లాలలో భూస్థిరీకరణ పథకం, | 0.20* |

## ఏజెన్సీ ప్రాంతాల్లో మత్స్య పరిశ్రమాభివృద్ధి

శాస్త్రీయ పద్ధతుల్లో మత్స్య పరిశ్రమను అవలంబించేటంచుకు ట్రయిబలు ప్రజలను ప్రోత్సహించే నిమిత్తం చేపపిల్లలను పంపకం చేయడానికి, మత్స్య పరిశ్రమాభివృద్ధికిగాను 1959–60 సంవత్సరానికి రు. 0.024 లక్ష కేటాయించ బడింది,

## నీటి పారుదల

క్రింది నీటి పారుదల పనులను పూర్తిచేయడంకోసం 1959–60 సంవత్సరానికి యీ జిల్లాకు రు. 1.41 లక్షల మొత్తం కేటాయించ బడింది. ప్రతి పథకానికి చేయబడిన కేటాయింపు, నీటిపారుదల జరిగే ప్రదేశం వివరాలు క్రింద యివ్వ బడినాయి.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయింపు రూ.లక్షలలో | పూర్తియైన తరువాత నీటి పారుదలజరిగే ప్రదేశం (ఎకరాలలో) |
|---|---|---|---|
| 1. | భద్రాచలం తాలూకాలోని పామేర్రు చెరువుకు మరమ్మతులు. | 0.05 | చెరువుకు మరమ్మతులు |

* (తూర్పు,పశ్చిమ గోదావరి జిల్లాలు)

| | | | |
|---|---|---|---|
| 2. | కొలివర చెరువు పుదరుద్ధరణ. | 0.03 | చెరువుకు మరమ్మతు |
| 3. | గన్నవరం గ్రామమంలోని వోటికుంట చెరువు పునరుద్ధరణ. | 1.33 | ,, |

## తూర్పు గోదావరి జిల్లాలో చిన్నతరహా నీటి పారుదల పనులు

వ్యవసాయోత్పత్తిని అధికంచేయడానికి చిన్నతరహా నీటిపారుదల పనులను నిర్వహించడం చాలా అవసరం. ఇందువల్ల తూర్పు గోదావరి జిల్లాలో చిన్న తరహా నీటిపారుదల చెరువులకు మరమ్మతులు చేయడంకోసం 1959–60 ప్రణాళికలో రు. 0.50 లక్ష కేటాయించ బడింది.

## ఏజెన్సీ ప్రాంతాల్లో రేడియో సెట్లను స్థాపించడం

ఏజన్సీ గ్రామాల్లో 7 రేడియో సెట్లను నెలకొల్పడానికి, ఇంతకు ముందు నెలకొల్పిన 15 సెట్లను నిర్వహించడానికిగాను ఈ జిల్లాకు 1959–60 సంవత్సరానికి రు. 0.037 లక్ష కేటాయించ బడింది,

## స హ కా ర ం

## అడ్డ తీగల సహకార స్టోరు

1959–60లో అడ్డతీగలలోని సహకార స్టోరు అభివృద్ధి పరచడానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు రు. 0.12 లక్ష ఈ సంవత్సరం ప్రణాళికలో కేటాయించ బడింది. సిబ్బందికి జీతాలు మొదలగు వాటిక్రింద సబ్సిడీ యివ్వ డానికి, గిడ్డంగుల నిర్మాణానికి, రెండెడ్ల బండిని, ఎద్దులను కొనడానికి, రిజర్వు నిధిని ఏర్పాటు చేయడానికిగాను పై డబ్బు వినియోగించ బడుతుంది.

## ఫీల్డు సిబ్బందికి పునశ్చరణ తరగతులు

ప్రభుత్వం వారిచే నిర్వహించ బడుతున్న వివిధ పథకాలు, అభివృద్ధికార్య క్రమాల్ని గురించి స్త్రీ సంక్షేమ శాఖ యొక్క ఫీల్డు సిబ్బందీ తమ పరిజ్ఞానాన్ని

ఎక్కువ చేసుకోనేటందుకుగాను ఈ పథకం క్రింద ఏజన్సీ ప్రాంతాలలో పునశ్చరణ తరగతులు నిర్వహించ బడతాయి. ఈ సంవత్సరం 5 మందికి శిక్షణ యివ్వబడుతుంది. ఇందుకు రు. 0.005 లక్ష కేటాయించ బడింది.

## రోగులకు, అవిటివారికి సహాయం

కాయకష్టం చేయలేనటువంటి ట్రయిబలు స్త్రీ రోగులకు సహాయం చేయడానికి, అవిటి వారికి పునరావాసం కల్పించేటందుకుగాను ఈ పథకం ఉద్దేశింపబడింది. ఇందుకుగాను ఈ జిల్లాకు ఈ సంవత్సరం రు. 0.025 లక్ష కేటాయించ బడింది. ఈ పథకం వల్ల 12 మంది స్త్రీలు లాభం పొందుతారు.

## వైద్యం

### చెర్లలో వైద్యాలయానికి, వెంకటాపురంలో ఆసుపత్రికి అభివృద్ధి పనులు

ఈ పథకం క్రింద చెర్లలోని వైద్యాలయానికి, వెంకటాపురంలోని ఆసుపత్రికి మందులు సరఫరా చేయబడతాయి. అదనపు సిబ్బంది నియమించ బడుతుంది. ఇందుకు 1959–60 ప్రణాళికలో రు. 0.035 లక్ష కేటాయించ బడింది.

### భద్రాచలంలో ఆసుపత్రి అభివృద్ధి—సిబ్బందికి వసతి గృహానిర్మాణం—ఆసుపత్రిలో విద్యుచ్ఛక్తి సౌకర్యాన్ని కలిగించడం

భద్రాచలంలోని ప్రభుత్వ ఆసుపత్రికి కొన్ని అభివృద్ధిపనులు చేయడానికి ఆసుపత్రి భవనాల్లో విద్యుచ్ఛక్తి సౌకర్యాన్ని కలిగించడానికి, సిబ్బందికి వసతి గృహాలు నిర్మించడానికిగాను 1959–60 ప్రణాళికలో రు. 0.25 లక్ష కేటాయించ బడింది.

## ప్రజారోగ్యం

### ఏజెన్సీ ప్రాంతాలలో మలేరియా నివారణ చర్యలు

ఆంధ్రలోని ఏజన్సీ ప్రదేశాల్లో ప్రజలకు ఎక్కువగా తగిలేవ్యాధి-మలేరియా, మొదటి ప్రణాళికాకాలంలో మలేరియా నివారణ చర్యలు

తీసుకోబడినాయి. రెండవ ప్రణాళికాకాలంలో ఈ చర్యలు కొనసాగించ బడుతున్నాయి. ఆంధ్రలోని యితర ఏజన్సీ ప్రాంతాలకు కూడ ఈ పథకాన్ని విస్తరింప చేయటం కోసం ఈ సంవత్సరము రు. 5.00 లక్షల మొత్తం కేటా యించ బడింది. ఇందులో రు. 1.88 లక్షల మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## ఏజెన్సీ ప్రాంతాలలో ప్రసూతి, శిశు ఆరోగ్య కేంద్రాలు

శిశు మరణాలకు అరికట్టేటందుకుగాను 1957-59 సంవత్సరాలలో 8 ప్రసూతి, శిశు ఆరోగ్య కేంద్రాలు ప్రారంభించ బడినాయి. ఈ సంవత్సరము యింకో కేంద్రాన్ని ప్రారంభించ డానికి తలపెట్ట బడింది. పాత కేంద్రాలను కొనసాగించడానికి, క్రొత్త కేంద్రాలను ప్రారంభించ డానికిగాను 1959-60 ప్రణాళికలో రు. 0.73 లక్ష కేటాయించ బడింది. ఇందులో రు. 0.15 లక్ష ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## ఏజెన్సీ ప్రాంతాలలో మంచినీటి బావుల త్రవ్వకం

ఏజన్సీ ప్రాంతాల్లో సురక్షితమైన మంచినీటి సౌకర్యాలు లేకపోవడంవల్ల ట్రయిబలు ప్రజలు వాగులనుండి, కుంటలనుండి నీటిని త్రాగేటందుకు వాడు కొంటున్నారు. ఇందువల్ల వారి ఆరోగ్యానికి హానికలుగుతున్నది. ఈ ట్రయిబలు ప్రజలకు మంచినీటి సరఫరా సౌకర్యాన్ని కలిగించడంకోసం రు. 0.39 లక్ష వ్యయంతో ఈ జిల్లాలోని ఏజన్సీ ప్రాంతాల్లో 10 బావులను త్రవ్వడానికి ప్రతిపాదింప బడింది.

## స్వచ్ఛంద సంస్థలకు సహాయం

ఆంధ్రలోని ఏజన్సీ ప్రాంతాల్లో సంక్షేమ కార్యక్రమాన్ని కొనసాగిస్తున్న స్వచ్ఛంద సంస్థలకు ఆర్థిక సహాయం చేయడంకోసం 1959-60 సంవత్సరానికి రు. 0.90 లక్ష కేటాయించ బడింది ఈ జిల్లాలోని స్వచ్ఛంద సంస్థలకు కూడ ఈ పథకం క్రింద సహాయం యివ్వబడుతుంది,

# స్త్రీ సంక్షేమం

## ప్రస్తుతమున్న స్త్రీ సంక్షేమశాఖ విభాగాల అభివృద్ధి

స్త్రీ సంక్షేమ శాఖ కార్యకలాపాలను తీవ్రతరం చేసి, వాటిని ఇంకా ఎక్కువ ఉపయోగకరకంగా ఉండేటట్లు చేసే ఉద్దేశంతో దృశ్యశ్రవణ పరికరాలు సౌండు ప్రొజెక్టర్లు, ఎడ్యుకేషనల్ చార్టులు, కెమేరాలు, రేడియోలు, సైకిళ్లు, కుట్టు మిషన్లు వంటి పరికరాలు మొదలైన వస్తువులు సరఫరా చేయడానికి తలపెట్ట బడింది. రు. 0.10 లక్ష వ్యయంతో 1959-60 లో పై పరికరాలు ప్రస్తుతమున్న 12 స్త్రీ సంక్షేమశాఖ విభాగాలకు సరఫరా చేయబడతాయి, ఇందులో రు. 900/-లు ఈ జిల్లాకు ప్రత్యేకించ బడినాయి.

# సాంఘిక సంక్షేమం

## సాంఘిక సంక్షేమ విస్తరణ ప్రాజెక్టులు

ప్రస్తుతం ఉన్న 2 సంక్షేమ ప్రాజెక్టులను నిర్వహించడానికి, ఈ జిల్లా లోని మొదటి దశ బ్లాకులలో కో ఆర్డినేటెడ్ పద్ధతిని మరొక ప్రాజెక్టును ప్రారంభించడానికి రాజ్య ప్రభుత్వ వాటాక్రింద ప్రణాళికలో ఈ సంవత్సరం రు. 0.386 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఈ ప్రారంభించబోయే ప్రాజెక్టుకు అయ్యే ఖర్చును బ్లాకులు, కేంద్ర సాంఘిక సంక్షేమబోర్డు, రాజ్య ప్రభుత్వం 5:12:6 నిష్పత్తిలో భరిస్తాయి. ప్రజలనుంచి సేకరించే మాచింగు విరాళాలు కూడా ఇందుకు తోడవుతాయి.

## సాంఘిక, నైతిక పునరుద్ధరణ, సంరక్షణ కార్యక్రమాలు

నైతిక పునరుద్ధరణ కేంద్రాలనుండి విడుదల చేయబడిన స్త్రీలకోసం రాజ్యస్థాయిలో ఒకఆశ్రయకేంద్రాన్ని, 14 జిల్లాఆశ్రయకేంద్రాలను(పురుషులకు 3, స్త్రీలకు 11) ప్రారంభించడానికి. అయ్యే ఖర్చులో రాజ్య ప్రభుత్వ వాటాక్రింద 1959-60 ప్రణాళికలో రు. 6.32 లక్షలమొత్తం కేటాయించబడింది. ఇంతే కాకరాజ్యంలో ఇంతకుముందు ప్రారంభించినసదనాలు, జిల్లా ఆశ్రయకేంద్రాలు కూడా కొనసాగించ బడతాయి. పై కేటాయింపు మొత్తంలో రు. 0.673

లక్ష ఈ జిల్లాలో స్త్రీలకుగాను ఒక జిల్లా ఆశ్రయ కేంద్రాన్ని స్థాపించడానికి, వాన్-కరెక్షనల్ ఇనిస్టిట్యూషన్లనుండి విడుదల చేయబడే స్త్రీలకోసం రాజమండ్రిలో ఏర్పాటు చేయబడిఉన్న రాజ్యస్థాయి ఆశ్రయ కేంద్రాన్ని కొనసాగించడానికిగాను ఈ జిల్లాకోసం ప్రత్యేకించ బడింది.

## మునిసిపల్ రోడ్లు, అభివృద్ధి పనులు

మునిసిపాలిటీల, రెండు పట్టణ పంచాయతీల ఆదాయ మార్గాలను అభివృద్ధి పరచే ఉద్దేశంతోను, స్థానిక ప్రజలకు మరికొన్ని సౌకర్యాలను కలుగజేసే ఉద్దేశంతోను రెండవ ప్రణాళికలో రు. 47.54 లక్షల మొత్తం కేటాయించ బడింది. దీర్ఘకాలిక ఋణాల రూపంలో ఆర్థికసహాయం కలుగ జేయడానికి ఈ మొత్తం వినియోగింప బడుతుంది. అందులో రు. 21.42 లక్షలు మొదటి 3 సంవత్సరాలలో ఖర్చుచేయబడ్డాయి. ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 11.59 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులో రు. 0.15 లక్ష మొత్తం 1958—59 లో టౌను ప్లానింగు డైరెక్టరు కార్యాలయంలో నియమించ బడిన అదనపు సిబ్బందిని కొనసాగించ డానికి వినియోగింప బడుతుంది. మిగిలిన రు.11.44 లక్షలలోను రు. 1.70 లక్షల మొత్తం ఈ జిల్లాకు కేటాయించ బడింది ఋణం మొత్తం, స్థానిక సంస్థపేరు, పనివివరం ఈ దిగువ తెలుప బడ్డాయి.

| స్థానిక సంస్థపేరు | పని వివరము | అప్పు మొత్తం (రు. లక్షలలో) |
|---|---|---|
| కాకినాడ పురపాలక సంఘం | సూర్యారావుపేట మార్కెట్టుకు అభివృద్ధి పనులు; శ్రీ నగరులో మార్కెట్టు నిర్మాణము | 0.50 |
| రాజమండ్రి పురపాలక సంఘం | మార్కెట్లకు అభివృద్ధి పనులు | 1.00 |
| ధవళేశ్వరం పంచాయతీ | కార్యాలయ భవన నిర్మాణం | 0.20 |
| | | 1.70 |

# రేడియో ప్రసారం

## కమ్యూనిటీ రేడియో సెట్ల స్థాపన, నిర్వహణ

రెండవ ప్రణాళికా కాలంలో స్థాపించ దలచిన 467 కమ్యూనిటీ రేడియో సెట్లలోను 311 సెట్లు 1956–59లలో ఈ జిల్లాలో స్థాపించ బడ్డాయి. ఈ సంవత్సరములో 1–4–1959 లోకి పూర్వం స్థాపించ బడిన సెట్లు అన్నిటిని నిర్వహించడమే కాకుండా ఈ జిల్లాలో 46 సెట్లను స్థాపించి నిర్వహించడానికి తలపెట్ట బడింది. ఇందుకు ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.357 లక్ష మొత్తం కేటాయించ బడింది.

# ప్ర చా రం

రెండవపంచవర్ష ప్రణాళికను విజయవంతంగా అమలుపరచటంకోసం ప్రణాళికను గురించి ప్రజలలో శ్రద్ధాశక్తులు కలిగేటట్లు చేసేటందుకు, వారి సంపూర్ణ సహకారాన్ని పొందేటందుకు, వారు యీ కార్యక్రమంలో ఎక్కువగా పాల్గొనేటట్లు చేసేటందుకుగాను వివిధ ప్రచార సాధనాల ద్వారా అభివృద్ధి కార్యక్రమాలను గురించి ప్రచారంచేసేటందుకు ఏకీకృత ప్రచార కార్యక్రమం ఒకటి 1956–57లో ప్రారంభించ బడింది. ఈ కార్యక్రమాన్ని కొనసాగించడానికి ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 6.80లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 22,599/–లు ఈ జిల్లాలో ఈ క్రిందివాటికోసం వినియోగించబడుతాయి.

| | | రూపాయలు |
|---|---|---|
| 1. | పి. ఏ. ల జీత బత్తాలు, ఇతర సిబ్బంది జీత బత్తాలు | 8,029 |
| 2. | పబ్లిసిటీ కారులకు పెట్రోలు ఖర్చులు, నిర్వహణ ఖర్చులు | 2,400 |
| 3. | జిల్లాస్థాయిలో ఏర్పాటు చేయబడే ప్రదర్శనలో పాల్గొనేటందుకు | 250 |
| 4. | సంగీత కచ్చేరీలు, నాటకోత్సవాలు నిర్వహించడం | 500 |
| 5. | జిల్లా, తాలూకా కేంద్రాలలో ప్రణాళిక వారోత్సవాలు జరపడం | 900 |
| 6. | ఈ జిల్లాలో ప్రచారం చేస్తున్న బుర్రకథ దళాల నిర్వహణ | 4,560 |
| 7. | సంచార వ్యానుకు పరికరాలు | 5,000 |
| 8. | ప్రస్తుతం ఉన్న పబ్లికు గ్రంథాలయాలలో పైలెటు పద్ధతిని సమాచార కేంద్రాలను నిర్వహించడం | 960 |
| | మొత్తం | 22,599 |

## అర్థగణాంక శాఖ

జిల్లా స్థాయిలో రాజ్య ప్రభుత్వానికి చెందిన గణాంక కార్యకలాపాలను సమన్వయ పరచి, సేకరించే వివరాల స్థాయిని అభివృద్ధి పరచడానికి 1959–60 లో ఒక జిల్లా గణాంక సంస్థ ఈ జిల్లాలో నెలకొల్ప బడింది. ఒక జిల్లా గణాంకాధికారి (గెజిటెడ్), ఒక ఎకనామిక్ ఇన్‌వెస్టిగేటర్, ఒక అప్పరు డివిజను గుమస్తా, ఇద్దరు జవాన్లు నియమించ బడ్డారు. ఈ సిబ్బంది ఈ సంవత్సరం కూడా కొనసాగించ బడుతుంది. ఇందుకు 1959–60 ప్రణాళికలో రూ. 0.10 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## తంతి తపాలా సౌకర్యాలు

ఈ సంవత్సరం 7 తపాలా ఆఫీసులను ప్రారంభించడానికి తలపెట్టబడింది. ఇంతే కాక కొత్తపేట, నురమళ్ళ, ఇంబారంలలో 3 టెలిగ్రాఫ్ (కంబైండు) ఆఫీసులు ప్రారంభించడానికి ప్రతిపాదింప బడింది. సామర్లకోటలో ఒక టెలిఫోను ఎక్స్ఛేంజి, రంప చోడవరంలో ఒక పబ్లిక్ కాల్ ఆఫీసు ఏర్పాటు చేయడానికి కూడ ప్రతిపాదింప బడింది.

## రైలు మార్గాలు

రైలు మార్గాలకు సంబంధించి తూర్పు గోదావరి జిల్లాలో క్రింది కార్యక్రమం 1959–60లో అమలు జరుపబడుతుంది.

| పని వివరము | అంచనా వేయబడిన ఖర్చు వేల రూపాయలలో |
|---|---|
| రాజమండ్రిలో యిప్పుడున్న హెల్త్ యూనిట్టు స్థానంలో కొత్త హెల్త్ యూనిట్టును (గ్రేడు i) నిర్మించడం; సిబ్బందికి అదనంగా వసతిగృహాల నిర్మాణం. | 345 |

2. సామర్లకోట జంక్షనులో యిప్పుడున్న హెల్త్ యూనిట్టు స్థానంలో క్రొత్త హెల్త్ యూనిట్టును (గ్రేడు ii) నిర్మించడం; సిబ్బందికి అవసరంగా వసతి గృహాల నిర్మాణం 136

3. ఈ శాన్య రైలుమార్గం—విజయవాడ—వాల్తేరుసెక్షను రాజమండ్రి, సామర్లకోటల మధ్య డబుల్ లైను వేయడం ద్వారపూడి, సామర్లకోటలమధ్య డబుల్ లైను వేయడం (మైలు 371½ నుండి 390¾ వరకు) రాజమండ్రి ఫేస్ ii—ద్వార పూడి,—సామర్లకోటల మధ్య యిప్పుడున్న 18.75 మైళ్ళ పొడవు గల లైనును 19.75 మైళ్ళ పొడవు గల లైనుగా మార్చి రెండవ రైలు మార్గాన్ని వేయడం. 13,000

---

## తూర్పు గోదావరి జిల్లా, జిల్లా ప్రణాళిక, అభివృద్ధి సంఘం సభ్యుల జాబితా

అధికార సభ్యులు:—

జిల్లా కలెక్టరు — ఆధ్యక్షుడు

శ్రీ డి. గోపాలరావు, ఎం. ఎల్. ఏ.,
మెహర్ నిలయం, కాకినాడ. — ఉపాధ్యక్షుడు

జిల్లా ప్లానింగు ఆఫీసరు — ఎక్సిఫిషియో కార్యదర్శి

1. జిల్లా వైద్య శాఖాధికారి, కాకినాడ
2. జిల్లా వ్యవసాయ శాఖాధికారి, కాకినాడ
3. జిల్లా ఆరోగ్య శాఖాధికారి, కాకినాడ
4. జిల్లా పశువైద్య శాఖాధికారి, కాకినాడ
5. జిల్లా పోలీసు సూపరింటెండెంటు, తూర్పు గోదావరి జిల్లా, కాకినాడ

| | | |
|---|---|---|
| 6. | జిల్లా విద్యా శాఖాధికారి, | కాకినాడ |
| 7. | జిల్లా పంచాయతి ఆఫీసరు, | కాకినాడ |
| 8. | జిల్లా బోర్డు స్పెషల్ ఆఫీసరుయొక్క పర్సనల్ అసిస్టెంటు, | కాకినాడ |
| 9. | ఎక్జిక్యూటివ్ ఇంజనీరు, గోదావరి తూర్పు డివిజను, | ధవిళేశ్వరం |
| 10. | అదనపు జిల్లా పంచాయతి ఆఫీసరు, | రాజమండ్రి |
| 11. | డివిజనల్ ఇంజనీరు (రహదార్లు) | కాకినాడ |
| 12. | ఎక్జిక్యూటివ్ ఇంజనీరు, గోదావరి సెంట్రల్ డివిజను, | ధవిళేశ్వరం |
| 13. | సబ్ కలెక్టరు, | రాజమండ్రి |
| 14. | డివిజనల్ ఇంజనీరు (రహదార్లు) | రాజమండ్రి |
| 15. | రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు, | పెద్దాపురం |
| 16. | రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు, | కాకినాడ |
| 17. | రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు, | అమలాపురం |
| 18. | బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరు, | కోరుకొండ |
| 19. | ,, | కొత్తపేట |
| 20. | ,, | తుని |
| 21. | ,, | రాజనగరం |
| 22. | ,, | ముమ్మిడివరం |
| 23. | ,, | పుల్లేటికుర్రు |
| 24. | ,, | పెద్దాపురం |
| 25. | ,, | గొల్లప్రోలు |
| 26. | ,, | పిఠాపురం |
| 27. | ,, | సామర్లకోట |
| 28. | ,, | గొల్లపాలెం |
| 29. | ,, | రాయవరం |
| 30. | ,, | తాళ్ళరేవు |
| 31. | ,, | కపిలేశ్వరపురం |
| 32. | ,, | బెండపూడి |
| [illegible] | ,, | రామచంద్రపురం |

| | | |
|---|---|---|
| 34. | ,, | నుగూరు |
| 35. | ,, | శంఖవరం |
| 36. | ,, | సీతానగరం |
| 37. | సహకార సంఘాల డిప్యూటీ రిజిస్ట్రారు, | కాకినాడ |
| 38. | ,, | అమలాపురం |
| 39. | ,, | రాజమండ్రి |
| 40. | అసిస్టెంటు ఉమన్ వెల్ ఫేర్ ఆఫీసరు, | రాజమండ్రి |
| 41. | డివిజనల్ ఎలక్ట్రికల్ ఇంజనీరు, | రాజమండ్రి |
| 42. | ఎక్జిక్యూటివ్ ఇంజనీరు (ఎలక్ట్రికల్ కన్‌స్ట్రక్షన్), | రాజమండ్రి |
| 43. | పరిశ్రమల, వాణిజ్యశాఖ అసిస్టెంటు డైరెక్టరు, | రాజమండ్రి |
| 44. | జిల్లా సంక్షేమ శాఖాధికారి, | కాకినాడ |
| 45. | సమాజవికాస కేంద్రాల ఆఫీసరు (ఇండస్ట్రీస్), శ్రీనగర్, | కాకినాడ |
| 46. | అసిస్టెంటు రేడియో ఇంజనీరు, | కాకినాడ |
| 47. | అసిస్టెంటు రేడియో ఇంజనీరు, | రాజమండ్రి |
| 48. | ఎక్జిక్యూటివ్ ఇంజనీరు, వై. ఆర్. డివిజను, | పెద్దాపురం |
| 49. | జిల్లా వైద్య శాఖాధికారి, | రాజమండ్రి |
| 50. | గ్రామ సేవకుల శిక్షణ కేంద్రపు ప్రిన్సిపాల్, | సామర్లకోట |
| 51. | జిల్లా అటవీశాఖాధికారి, గోదావరి అప్పర్ డివిజను, | రాజమండ్రి |
| 52. | జిల్లా అటవీ శాఖాధికారి, గోదావరి లోయర్ డివిజను, | కాకినాడ |
| 53. | ఫిషరీస్ అసిస్టెంటు డైరెక్టరు, | రాజమండ్రి |
| 54. | స్మాల్ సేవింగ్స్ స్పెషల్ డిప్యూటీ తహసీల్దారు, | కాకినాడ |
| 55. | జిల్లా ఆర్గనైజర్, నేషనల్ స్మాల్ సేవింగ్స్ స్కీము, | కాకినాడ |
| 56. | పబ్లిసిటీ అసిస్టెంటు, | కాకినాడ |
| 57. | తహసీల్దారు, | అమలాపురం |
| 58. | ,, | రాజమండ్రి |
| 59. | ,, | పెద్దాపురం |
| 60. | డిప్యూటీ తహసీల్దారు, | ప్రత్తిపాడు |
| 61. | ,, | తుని |

62. తహసీల్దారు కాకినాడ
63. డిప్యూటీ తహసీల్దారు, ముమ్మిడివరం
64. ,, పిఠాపురం
65. వ్యవసాయశాఖ రీజినల్ డిప్యూటి డైరెక్టరు, ఏలూరు
66. ప్రాజెక్టు ఎవాల్యుయేషన్ ఆఫీసరు, కాకినాడ
67. ఫీల్డు పబ్లిసిటీ ఆఫీసరు, కాకినాడ
68. తపాలా ఆఫీసుల సూపరింటెండెంటు, రాజమండ్రి
69. జిల్లా ఎంప్లాయిమెంట్. ఆఫీసరు, కాకినాడ
70. సామర్లకోట పురపాలక సంఘాధ్యక్షుడు
71. ద్రాక్షారాం పురపాలక సంఘాధ్యక్షుడు
72. కాకినాడ పురపాలక సంఘాధ్యక్షుడు
73. రాజమండ్రి పురపాలక సంఘాధ్యక్షుడు
74. పెద్దాపురం పురపాలక సంఘాధ్యక్షుడు
75. అమలాపురం పురపాలక సంఘాధ్యక్షుడు
76. డాక్టరు కర్నల్ డి. ఎస్. రాజు, ఎం. పి., రాజమండ్రి
77. శ్రీ ఎం తిరుమలరావు, ఎం. పి., కాకినాడ
78. ,, పైడా వెంకటనారాయణ, ఎం. ఎల్. సి., కాకినాడ
79. ,, బి. యస్. మూర్తి, సామాజికాభివృద్ధి మంత్రాంగశాఖ ఉపమంత్రి, క్రొత్తఢిల్లీ
80. శ్రీమతి వాణి రామరావు, ఎం. ఎల్. ఎ. భద్రాచలం
81. శ్రీ మహమ్మద్ తహసీల్, ఎం.ఎల్.ఎ., కూనవరం, భద్రచలంతాలూకా
82. ,, బత్తిన సుబ్బారావు, ఎం.ఎల్.ఎ., కోలనమూరు, రాజమండ్రితాలూకా
83. ,, రాజా వత్సవాయి వెంకట కృష్ణం రాజబహదూరు, తుని
84. ,, వాడ్రేవు గోపాలకృష్ణ, ఎం ఎల్ ఎ., పిఠాపురం
85. ,, డి. వి. సుబ్బారావు. ఎం ఎల్ ఎ., పెద్దాపురం
86. ,, పి. గుర్రాజు, ఎం ఎల్ ఎ., శంఖవరం, పెద్దాపురంతాలూకా
87. ,, పుత్సల సత్యనారాయణ, ఎంఎల్ఎ., ఉప్పాడ, పిఠాపురంతాలూకా
88. ,, మల్లిపూడి పళ్ళంరాజు, ఎం. ఎల్. ఎ., కాకినాడ
89. ,, రెడ్డి కామయ్య, ఎం ఎల్ ఎ., తాళ్ళరేవు. కాకినాడ తాలూకా

90. ,, రామళ్ళ తిరుపతిరావు, ఎం. ఎల్. ఎ., దుగ్గుదుర్రు కాకినాడ తా॥
91. ,, కాకర్లపూడి రాజరామచంద్రరాజు బహదూరు, ఎం. ఎల్. ఎ.,
రామచంద్రపురం
92. ,, తేతలి లక్ష్మీనారాయణరెడ్డి, ఎ. ఎల్. ఎ., అడ్వకేటు, రాజమండ్రి
93. ,, ఎస్. బి. పి. పట్టాభిరామరావు. విద్యామంత్రి, హైదరాబాదు
94. ,, బొజ్జా అప్పలస్వామి, ఎం. ఎల్. ఎ, కందికుప్ప, అమలాపురం తా॥
95. ,, ఎస్. రామభద్రరాజు, ఎం.ఎల్.ఎ, కొందుకుపాడు,అమలాపురం తా॥
96. ,, గొల్లకోటి నరసింహమూర్తి, ఎం. ఎల్. ఎ., గున్నేపల్లి,
అమలాపురం తాలూక
97. ,, గంజి నాగేశ్వరరావు, ఎం. ఎల్ ఎ., కడలి, రాజోలు తాలూక
98. ,, అల్లూరి వెంకటరామరాజు, ఎం. ఎల్. ఎ.,
అంతర్వేదిపాలెం, రాజోలు తాలూకా
99. డాక్టరు ఎ. బి. నాగేశ్వరరావు, ఎం. ఎల్. ఎ., రాజమండ్రి
100. శ్రీమతి ఎస్. వెంకటరత్నమ్మ. ఎం. ఎల్. ఎ.
దానవాయిపేట, రాజమండ్రి
101. ,, నూకల వెంకటరత్నం. అనంతవరం
102. ,, వి. వి. ఆర్. దీక్షితులు, ఆర్యాపురం, రాజమండ్రి
103. ,, అయ్యగారి సుబ్బారావు, రాజనగరం, కొత్తపేట తాలూకా
104. ,, బి. వెంకటరత్నం, కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు అధ్యక్షుడు.
రామచంద్రాపురం
105. ,, ఎ. లై వడపల్లి, రామచంద్రాపురం
106. ,, కె. శఠకోపన్. హరిజన సేవక సంఘం కార్యదర్శి, కాకినాడ
107. ,, ఎం. అయ్యన్న, కన్వీనరు, స్టేటుసోషల్ బోర్డు, రాజమండ్రి
108. ,, శ్రీరంగ కుక్కుటేశ్వరరావు, భీమరపల్లి, అమలాపురం తాలూకా
109. ,, రావు అచ్చారావు, కొత్తపల్లి, పిఠాపురం తాలూకా
110. ,, షైదపాటి వెంకటరావు, రామచంద్రాపురం
111. ,, పట్నం ప్రసాదరావు, గెడ్డనపల్లి, పెద్దాపురం తాలూకా
112. ,, ఎస్. ఆర్. సి. హెచ్. సీతారామమూర్తి రాజబహదూరు, తుని
113. ,, ఆకుల బుల్లిస్వామి, ఇదరాడ, రాజోలు తాలూకా

114. ,, గుమ్మిడివల సుబ్బారావు, అమలాపురం
115. ,, ఉప్పెళ్ళ లక్ష్మీనారాయణ, ఆలమూరు
116. ,, పి. కృష్ణ బ్రహ్మశాస్త్రి, గిల్డ్ ఆఫ్ సర్వీసు కార్యదర్శి, కాకినాడ
117. ,, టి. డి. ప్రసాదరావు, రిటైర్డ్ ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరు, కాకినాడ
118. ,, కోటరాజు స్వామి, కిర్లంపూడి
119. ,, [illegible] సూర్యనారాయణ, పెద్ద రావువ్వాడు, కాకినాడ తాలూకా
120. ,, మహ్మద్ ఇస్మాయిల్, బ్లాకు ప్లానింగు కమిటీ అధ్యక్షుడు, సామర్లకోట
121. ,, ఉండవిల్లి సత్యనారాయణ మూర్తి ఎం ఎల్. ఏ., రాయవరం, ఆర్. ఎమ్. ఎమ్. తాలూకా
122. ,, బొజ్జ బాపన్న, బ్లాకు ప్లానింగు అండ్ డెవలప్‌మెంట్ కమిటీ అధ్యక్షుడు, రాజమండ్రి తాలూకా
123. శ్రీమతి కంతిపూడి సుశీలాదేవి, అంబగు చర్మాసంఘంఅధ్యక్షురాలు, రాజమండ్రి
124. ,, వెట్టికూటి పట్టాభిరామన్న, వెల్ల, రామచంద్రాపురం తాలూకా
125. ,, మొండు వీరన్న, పంచాయతీ అధ్యక్షుడు, పినపల్లి, ఆర్. ఎం. ఎం. తాలూకా
126. శ్రీమతి వై. వి. నరసింహారావు, కాకినాడ
127. ,, ఎం. వి. శాస్త్రి, ఎం ఎల్. సి, కాకినాడ
128. ,, ఎస్. బి. పి. బి. కె. సత్యనారాయణరావు, ఎం. ఎల్. సి., కపిలేశ్వరపురం
129. ,, ఎ. రామారావు, ఎం. ఎల్. సి., రాజమండ్రి
130. ,, ఆర్. రామలింగరాజు, ఎం. ఎల్. సి., పాఖనేతిపల్లి, రాజోలు తాలూకా
131. ,, సి. హెచ్. జగ్గిరెడ్డి, పంచాయతీ సమితి అధ్యక్షుడు, కొత్తపేట
132. ,, ఎం. వి. ఎస్. సుబ్బారాజు, ఎం. ఎల్. సి., జి. దపూడి, కొత్తపేట తాలూకా
133. ,, ఎం. సత్తిరాజు, కృషిపండిట్, సామర్లకోట

134. ,, మిస్సుల సూర్యనారాయణమూర్తి, ఎం. పి.
కొండకర్ల, పోస్టు (వయా) అనకాపల్లి

౧౩౫. ,, కంటిపూడి వీరన్న పాడల్, ఎం. పి., పెదవలస, చింతపల్లి పోస్టు
(వయా) నరసపట్నం

౧౩౬ , ఎం. వి. సుబ్బరాజు, ఎం ఎల్ ఎ. గంటి పెదపూడి.
కొత్తపేట తాలూకా

